## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి.కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **సుందరయ్య విజ్ఞాన కేంద్రం** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **సుందరయ్య విజ్ఞాన కేంద్రం** వారి వెబ్ సైట్: http://sundarayya.org/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో **సుందరయ్య విజ్ఞాన కేంద్రం** వెబ్ సైట్ వారు అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు,కనుక వారిని సంప్రదించగలరు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు*

## సుందరయ్య విజ్ఞాన కేంద్రం వారి వెబ్ సైట్:

## http://sundarayya.org/

Sundarayya Centenary Cel ×

sundarayya.org

# Sundarayya Vignana Kendram

Home | About SVK | Library | Projects | Donations | Publications | స్వేచ్ఛా విజ్ఞాన ప్రవంతి | Services | Contact Us

## Sundarayya Centenary Celebrations

### India Today: Looking Back, Looking Forward

**India Today: Looking Back, Looking Forward**
**Watch Videos** (Click to Download Papers)

On the occasion of the birth centenary of P. Sundarayya, a freedom fighter, communist and above all an individual who had given utmost importance to collecting facts and understanding them for political praxis, we feel it prudent to organise a seminar in his memory to comprehensively discuss and debate issues concerning the present, past and future of our country.

Read More

### Agenda

| Time | Session | Speakers |
|---|---|---|
| 4th May 2013<br>10:00-14:00 | **Synoptic Session One**<br>Imperialism and the Indian Economy<br>Patterns of Class Formation since Independence<br>Communalisms: Changing Forms and Fortunes Since Independence | Amiya Kumar Bagchi<br>Prabhat Patnaik<br>Aijaz Ahmad |
| 4th May 2013<br>15.00-16.30 | **Industry, Finance, Planning**<br>International Finance And Development in India under Neo-Liberalism<br>Capitalists and Industrialisation in India<br>Planning and the regime of Capital in India | C.P.Chandrashekhar<br>Surajit Mazumdar<br>Chirashree Das Gupta |
| 4th May 2013<br>17.00-18.30 | **Women in Economy and Society**<br>Economic Policies and Women's Work<br>State Policies and Women<br>The Political Economy of Violence against Women. | Jayati Ghosh<br>Smita Gupta<br>Kalyani Menon Sen |
| 5th May 2013<br>9.30-13.30 | **Synoptic Session Two**<br>Agrarian Question and the Post-Independence State<br>Non-Alignment to Dependence: Shifting Paradigms for Foreign Policy<br>State, Market and the Media | Utsa Patnaik<br>Sukumar Muralidharan<br>Sashi Kumar<br>P. Sainath |
| 5th May 2013<br>15.00-16.30 | **The Agrarian Crisis**<br>An Overview<br>Assets, Incomes and Employment<br>Credit,Technology and Public Policy in Indian Agriculture | Venkatesh Athreya<br>Vikas Rawal<br>Ramakumar |

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ

# ధర్మశాస్త్రరత్నాకరము.



ఇది,

సర్వజనోపయుక్తముగాయుండునటుల

సర్వవ్రత ఆచారవ్యవహారములు చక్కగాతెల్పునట్టి

సకలవైదిక లౌకిక ధర్మములు తెలియపరుచుటకు

సమస్తగ్రంధసారములును అనుసరించి

యీ కలియుగములోనడుచుటకు ముఖ్యమగు ధర్మములుచెప్పి

తేటతెనుగుమాటలతో

బ్రహ్మశ్రీ అలుకూరు మల్లిఖార్జునశాస్త్రులవారిచే వ్రాయబడి,

పత్తికొండ నివర్తి జోగయ్యశాస్త్రులచే బరిష్కరింపబడి.

చెన్నపురి ఆనందముద్రాక్షరశాలయందు ముద్రించి

ప్రచురింపబడియె.

MADRAS.

1896



శ్రీ

# ధర్మశాస్త్రరత్నాకరం.

# విషయసూచిక.

## మంగళాచరణశ్లోకాలు.

## ఆచారప్రకరణం.

## ప్రకీర్ణప్రకరణము.



## వ్యవహారప్రకరణం.

ప్రాయశ్చిత్తవిషయం.







ప్రాజాపత్యకృఛ్రలక్షణములు.

ఆశౌచప్రకరణము.



శ్రాద్ధప్రకరణము.

ధర్మశాస్త్రరత్నాకరం ముగిసెను.

శ్రీ గురుభ్యో నమః

శ్రీవాసుదేవభగవాన్ ప్రసీద.

# ధర్మశాస్త్రము.

శ్లో॥ వాసుదేవంనమస్కృత్య ధర్మశాస్త్రార్థబోధికాం । తనోమిబాలబోధాయకృతిమాంధ్రాఖ్యభాషయా॥

ఆచారశ్చవ్రతంచాథప్రకీర్ణోవ్యవహారకః । ప్రాయశ్చిత్తంతథాశౌచంశ్రాద్ధమేతాన్యహంక్రమాత్ ॥ వివృణోమి ప్రకరణాన్యాలోచ్య చయథామతి । నిష్కృష్యబహుశాస్త్రాణివిస్తరాత్సంగ్రహాత్క్వచిత్ ॥౩॥

తుష్యంతువాహసంత్వత్రజనాశ్శాస్త్రవిచక్షణాః। అన్యేపిచసమేహర్షోనమేకఃకదాచన॥ఆశ్రితార్తిహరశ్శ్రీమాన్మాధవస్తుష్యతిప్రభుః। కేవలంమయ్యనుక్రోశంసమ్యక్చక్రేస్మయోనిశం॥౫॥

విద్వద్వేంకటరామార్యతనయోమల్లికార్జునః । కురుతేకృతిమద్వైతామలుకూరుపురస్థితః॥౬॥

శ్రీపత్తికొండనగరీస్థితః కుర్వేపరిష్కృతిం । భారద్వాజో మహాదేవసుతోహంజోగయాభిధః॥ ౭

## ఆచార ప్రకరణము.

* బ్రాహ్మముహూర్తమందు అనగా ఉషఃకాలమందు నిద్రనుంచిలేచి శ్రీవిష్ణుమూర్తి నిస్మరించి గజేంద్రమోక్షము మొదలగు దానిని పఠించియిష్టకులదేవతను స్మరించవలయును. “సముద్రవసనేదేవిపర్వతస్తనమండలే । విష్ణుపత్ని నమస్తుభ్యం పాదస్పర్శంక్షమస్వమే” అనిమంత్రముతో భూమిదేవతను ప్రార్థించి ధేనువు మొదలగు మంగళములనుచూడవలయును.

అనంతరము మూత్రమునుమలమును విసర్జించుట మొదలగు దానియొక్క విధానము చెప్పబడుచున్నది. తృణము మొదలగుదాని తో కనబడకయున్న భూమి గలిగియున్నచోట శిరస్సును వస్త్రముచేజుట్టుకొనియజ్ఞోపవీత మునువనమాలగా

* ఈ ఆచారప్రకరణమందు భస్మత్రిపుండ్రవిధానాంతము ధర్మసింధువుయందు మూలవాక్యములను చూడవలయును.

వేసికొనిపీపుమీదన యిననుశ్రోత్రమందయినను ధరియించి ముక్కుమూసికొని పగటియందును సూర్యోదయసూర్యాస్తమయసంధ్యా కాలములయందును ఉత్తరముఖముగా కూర్చున్నవాడై రాత్రియందు దక్షిణముఖముగాకూర్చున్నవాడయి మౌనముకలవాడై పాదములయందు పాదుకలుగలవాడై మూత్రముయొక్కయు మలముయొక్కయు విసర్జించుటను చేయవలయును. యజ్ఞోపవీతమునకు కంఠలంబితమునువిడిచియె అనగా వసమాలగావేసుకొనుటలేకనే శ్రోత్రమునందుధరియించుట ఆచారవిరుద్ధముగాన యదిచేయ తగదు. మార్గమునందును ఉదకమందును దేవాలయమందును నదీతీరమందును యీమొదలగు చోటములమూత్రములను విడువరాదు. జలాధారముగలచోటను పదిరెండు మూరలను విడిచిపైగామూత్రమును చేయవలయు. స్థలముఅవకాశముగలచోపదునారవమూరయందుమూత్రమును చేయవలయును మలమును విడువవలసినవిషయమందయితే యీచెప్పినదానికి నాలుగంతలప్రదేశమునువిడిచిబెట్టిపైగాచేయవలయును.తనమలమునుచూచినప్పుడు అందుకుప్రాయశ్చిత్తముగాసూర్యునినైననుగోవునైననుచూడవలయును. అనంతరము శిశ్నమునుచేతపట్టుకొని లేచిశౌచమును చేయవలయును. అదియెట్లనగా మూత్రమును విసర్జించుటయందు పరిశుద్ధమైన మృత్తిక నుఒక పర్యాయము శిశ్నమందును మూడుమార్లు యడమచేతియందును రెండుమార్లు రెండుహస్తముల యందునువేసిరుద్ది అన్నిఆవృత్తులు వుదకముచే కడుగుకొనవలయు. మూత్రమువిడుచునపుడుచేయు శౌచముక న్ననురేతస్సును విడుచుటయందు రెండంతలు శౌచమును మైథునమును చేయుటయందు మూడంతలుశౌచమును చేయవలయును. మలమును విడిచినపిమ్మటనయితే ఒక మృత్తికను శిశ్నమందును మూడుమృత్తికలును గుదమందును పదిమృత్తికలను యడమచేతియందును. యేడుమృత్తికలును రెండుహస్తములయందును యేడుమృత్తికలు నయినను మూడుమృత్తికలునయినను రెండుపాదముల యందును యీ చెప్పియున్నది గృహస్థధర్మమునందుగాన బ్రహ్మచర్యధర్మమునందయితే రెండంతలుగను యతులుకు అయితే నాలుగంతలుగను యీప్రకారము మృత్తికలుతోను వుదకములతోను శౌచమునుచేయవలయును రాత్రియందు అయితే యీచెప్పినశౌచములో సగము చేయతగినది ఆతురుణియందు అయితే దీనిలో సగము శౌచము తెలియతగినది శూద్రులుకు స్త్రీలకు బాలురకు అందులోసగము శౌచము [యిట్లుచెప్పుటవలనవీరికినాలవభాగము శౌచము స్పష్టము అయినది]. ఈచెప్పబడిన సంఖ్యచేత





గంధలేపనము పోకుండినపుడు యెంతశౌచము చేతగంధలేపనము పోవునో అంతశౌచముచేయతగినది.మృత్తిక యిచ్చట తడిదియును శిరికెఫలము ప్రమాణము గలదియును గ్రహించతగినది వుదకము అప్పుడేదొరకక పోవుటచేత శౌచమునకు ఆలస్యమగుటయందు యేవస్త్రములను దేహమునందు ధరియించివుండునో ఆవస్త్రములతోకూడనే స్నానమును చేయవలయును. ఈచెప్పబడినప్రకారము శౌచమును చేయకబోవుటయందయితే యెనిమిదినూర్లు గాయత్రీజపముచేశి మూడు ప్రాణాయామములను చేయవలయును.అట్లనే, మూత్రమును చేసినపిమ్మట శౌచమునకై నాలుగు గండూషములను, మలమును విసర్జించిన పైన పదిరెండు గండూషములనయినను యెనిమిదిగండూషములనయినను, భోజనముచేశినపిమ్మట పదునారుగండూషములును చేయతగినవి.

అనంతరము ఆచమనముయొక్క విధానము చెప్పబడుచున్నది. శిరస్సును కంఠమును వస్త్రముచే జుట్టుకొనకయున్నవాడయి, కూర్చొనియున్నవాడై, ఉపవీతము గలిగియున్నవాడయి, తూర్పుముఖముగలవాడయినను ఉత్తరముఖము గలవాడయినను విడువబడిన అంగుష్ఠము కనిష్ఠముఅని రెండువ్రేళ్లుగల హస్తము గలిగియున్నట్టి అంగుష్ఠమూలముచేత ఉష్ణముకానిదై నురుగుమొదలగు దానిచే రహితమయిన పరిశుద్ధమగు యుదకమును హృదయమువరకు చేరునట్లు మూడుమార్లు పానముచేయవలయును. కేశవమొదలగు మూడునామముల చేత జలమును పానముచేశి గోవింద, అనేనామముచేత దక్షిణహస్తమును జలముచే మార్జనము చేసికొనవలయును. విష్ణు మధుసూదన, అనే రెండునామములచే రెండుపెదవులను మార్జనముచేసికొని అనగా ప్రోక్షించుకొని త్రివిక్రమ, అనే నామముచే ఆరెండుపెదవులను ఉన్మార్జనము చేసికొనవలయును. వామన, అనేనామముచే ఉదకముచేమంత్రించి శ్రీధర అనేనామముచే వామహస్తమును మార్జనము చేసికొనవలయును. హృషీకేశ, అనేనామముచే దక్షిణపాదమును మార్జనము చేసికొని పద్మనాభ, అనేనామముచే వామపాదమును మార్జనముచేసికొనవలయును. దామోదర, అనేనామముచేత శిరస్సును ప్రోక్షించుకొని సంకర్షణ, అనేనామముచే పైపెదవును ముట్టుకొనవలయును. వాసుదేవ, అనేనామముచే కుడిముక్కును ముట్టుకొనవలయు. ప్రద్యుమ్నఅనేనామముచే యెడమముక్కును ముట్టుకొనవలయు. అనిరుద్ధ, అనేనామముచే కుడినేత్రమును ముట్టుకొనవలయును. పురుషోత్తమ, అనేనామముచే యెడమనేత్రమును ముట్టుకొనవలయును. అధో

షజ, అనేనామముచే కుడిచెవిని ముట్టుకొనవలయు. నారసింహా, అనేనామముచే యెడమచెవినిముట్టుకొనవలయును. అచ్యుత, అనేనామముచే నాభిని అనగా బొడ్డునుముట్టుకొనవలయును. జనార్దన, అనేనామముచే హృదయమును అనగా రొమ్మునుముట్టుకొనవలయును. ఉపేంద్ర అనేనామముచే శిరస్సును ముట్టుకొనవలయును. హరి, అనేనామముచే కుడిభుజమును ముట్టుకొనవలయును. శ్రీకృష్ణ, అనేనామముచే యెడమభుజమును ముట్టుకొనవలెను, అని క్రమముగా తెలియవలయును. ఇచ్చట సంకర్షణ, అనేనామము మొదలు కొని ముట్టుకొనవలసిన విషయమందు పైపెదవుకు వ్రేళ్లయొక్క కొనలుచేతను, రెండుముక్కులకు అంగుష్ఠ తర్జనీలచేతను, నేత్రములకు అంగుష్ఠానామికలచేతను, శ్రోత్రములకు నాభికిన్ని అంగుష్ఠక నిష్ఠికలచేతను రొమ్ముకు అరచేతిచేతను శిరస్సుకు హస్తముచేతను భుజములకు వ్రేళ్లయొక్క కొనలచేతను, ముట్టుకొనడము తెలియదగినది. ఇట్టి ఆచమన విధానమును చేయుటయందు శక్తిలేని యతడు కేశవాది నామత్రయముచే మూడుమార్లు పానముచేశి యుదకముచే హస్తమును కడుగుకొని కుడిచెవిని ముట్టుకొనవలయును. కంచు యినుము సీసముసత్తు విత్తళివీటిచేచేయబడిన పాత్రములచే ఆచమనమును చేయరాదు. శ్రౌతాచమనమయితే గాయత్రియొక్క మూడుపాదములు కేశవ నారాయణమాధవ, అనునామములకు బదులుగను, ఆపోహిష్ఠా, అని మంత్రముయొక్క తొమ్మిది పాదములు గోవింద, అని నామము మొదలగు దామోదర అనినామము అంతముగల తొమ్మిది నామములకు బదులుగను, యేడువ్యాహృతులు సంకర్షణ అనినామము మొదలగు నారసింహ అనునామము అంతముగల యేడు నామములకు బదులుగను, గాయత్రియొక్క మూడుపాదములు అచ్యుత జనార్దన ఉపేంద్ర అని మూడునామములకు బదులుగను, రెండుగా విభాగము చేయబడినదేవీ శిరస్సు హరి శ్రీకృష్ణ అని రెండు నామములకు బదులుగను, చేయతగినవని యిరువైనాలుగు స్థానములు తెలియందగు (యీ శ్రౌతాచమన విషయ మురహస్యముగాన చక్కగా గురువుల వారియను గ్రహము వలననే తెలియవలయును గాబట్టి యిచ్చట పూర్తిగా వివరించము.)

అనంతరము ఆచమనమునకు కొన్ని కారణములు చెప్పబడుచున్నవి. కర్మను చేయుచుండి అపానవాయువును విడుచుటయందాచమనము చేయవలయును. దుఃఖముచే కంటినీరు పడుటయందును, కోపము వచ్చియుండుటయందును, మార్జార





స్పర్శయందును, తుమ్ముటయందును, వస్త్రధారణమందును, రజకులు మొదలగు వారియొక్కయు అంత్యజులు మొదలగు వారియొక్కయు దర్శనమందును, ఆచమనమును చేయవలయును. స్నానముచేశి పానముచేశి భోజనముచేశిన్ని ఆచమనము చేయవలయుమలము మూత్రము రేతస్సు వీటినివిడిచి శౌచము చేశినపిమ్మటను ఆచమనముచేయవలయును. అన్నిచోట్ల ఆచమనముయొక్క సంభవించకపోవుటయందు కుడిచెవిని ముట్టుకొనవలయును దంతములకు సంబంధించినయన్నమును మృధువైనయుపాయముచేత పోగొట్టవలయు ఏలననగా రక్తమువెళ్లుటయందు దోషమును చెప్పుటవలనని తెలియదగినది దంతములకు సంబంధించిన యన్నమునకు దంతమువలెనే యితరకాలమందు వెళ్లివచ్చుటయం దాచమనము చేయతగినది దర్భ యెడమచేతియందుండగా కుడిచేతిచేఆచమనము చేయరాదు. దర్భ రెండుహస్తముల యందుండగా ఆచమనమును చేయవలయును సోమపానము చేశిన ఫలముగలుగును ఆపవిత్రము ఉచ్ఛిష్టము కానేరదు. అయితే భోజనము చేశినపైనను పిత్ర్యకర్మయందును విడిచి పారవేయవలయునుమలమూత్రములను విసర్జించుటయందుకూడ ఆదర్భపవిత్రమును తీశివిడువవలయును.

అనంతరము దంతధావనము చెప్పబడుచున్నది. పాలచెట్టు పుల్లఉత్తరేణి పుల్ల మొదలయిన కాష్ఠములచేత చేయదగినది. కాష్ఠముదొరకనపుడును శ్రాద్ధము ఉపవాసము మొదలగు నిషిద్ధదినమందున్ను పర్ణము మొదలగు దానిచేతనయినను తర్జనికన్ననితరమగు వ్రేలుచేతనయినను పదిరెండు గండూషములచేతనయినను దంతములను శుద్ధిపరుచు కొనవలశినది.

అనంతరము నంక్షేపముగ స్నానవిధానము చెప్పబడుచున్నది నదిమొదలగు ప్రదేశమందుపోయి శిఖనుకట్టుకొని మోకాలుకన్నను పైగానున్న యుదకమందు నిలుచుకొని అట్లుదకములేనిచో కూర్చొని ఆచమనముచేశి “మమకాయిక వాచనికమానసిక దోషనిరసనపూర్వకం సర్వకర్మను శుద్ధిసిద్ధ్యర్థం ప్రాతః స్నానంకరిష్యే” అనిసంకల్పమును చేశియుదకమును నమస్కరించి తూర్పుముఖముగానున్నవాడయినను ప్రవాహమున కభిముఖుడైనను మూడుమార్లు స్నానముచేశి అవయవములను రుద్దుకొని స్నానముచేశి ఆపోహిష్ఠా, అనిమంత్రముచే మార్జనముచేశి ఇమంమేగంగే, అనిమంత్రముచే మూడుమార్లు ఉదకమును గలవరించి అఘమర్షణ స్నానమును చేయవలయును. మూడుమార్లు ఆవృత్తిచేయబడిన ఋతంచ అనిసూక్తముచే, కాత్యాయనులచేతనయితే ద్రుపదా అనేఋక్కుచే

జలమునందు మునుగుచుండుట స్నానముచేసి లేచిఆచమనముచేసి జలతర్పణమును చేయవలయు మరియొకపక్షమందు చేయపనిలేదు చేయుపక్షమందు విధానమెట్లన్నను, ఉపవీతముఅనగాసవ్యముగలిగియున్నవాడయి“బ్రహ్మాదయోయే దేవాస్తాం దేవాం స్తర్పయామి భూర్దేవాం స్తర్పయామి భువర్దేవాం స్తర్పయామి స్వర్దేవాం స్తర్పయామి భూర్భువఃస్వర్దేవాం స్తర్పయామి,, అనితర్పణములను చేయవలయును- నివీతముకలవాడై అనగాకంఠలంబితయజ్ఞోపవీతము గలిగియున్నవాడయి ,,కృష్ణ ద్వైపాయనాదయోయే ఋషయస్తాన్ ఋషీం స్తర్పయామి భూరృషీం స్తర్పయామి భువరృషీం స్తర్పయామి స్వరృషీం స్తర్పయామి భూర్భువఃస్వరృషీం స్తర్పయామి అని తర్పణములనుచేయవలయును - అపసవ్యముగలిగియున్నవాడయి ,, సోమః పితృమాన్యమోంగి రస్వానగ్నిష్వాత్తాః కవ్యవాహనాద యోయేపితరః తాన్ పితౄం స్తర్పయామి భూఃపితౄం స్తర్పయామి భువఃపితౄం స్తర్పయామిస్వః పితౄం స్తర్పయామి భూర్భువఃస్వః పితౄం స్తర్పయామి” అనితర్పణములను చేయవలయును వకనదియందు స్నానముచేయుటయందు మరియితరమైననది నిస్మరించకూడదు. ఇచ్చటతైత్తిరీయులు మొదలగువారిచేతర్పణ మందుఋషులు మొదలగువారికి నామాంతరములు చెప్పబడినవి. అవిమేముచెప్పనది సంక్షేపవిధిగాన చెప్పబడవు మరియొకప్రకారము స్నానమెట్లన్ననో, గృహమందుస్నానముచేయునెడ ఉష్ణోదకముచేతనే స్నానముచేయతగినదిగాని శీతోదకముచేతస్నానము చేయతగదు. ఆస్నానవిధానమయితేనో, పాత్రయందు చన్నీళ్లను పెట్టిఆచన్నీళ్లపైనవేన్నీళ్లే చేపూర్తిగానించి ,,శన్నోదేవీ = ఆపఃపునంతు = ద్రుపదాదివే=ఋతంచస= ఆపోహిష్ఠా = అనిఅయిదు ఋక్కులచేతనభిమంత్రించి ఇమంమే, అనిమొదలగు మంత్రముచేగంగాదితీర్థములను స్మరించుకొనుచు స్నానము చేయవలయును. గృహమునందు స్నానముచేయుటయందు సంకల్పము ఆచమనముఅఘమర్షణము తర్పణమున్ను లేదు. కడాపటఆచమనము మార్జనముఅనగా ప్రోక్షణమున్ను చేయతగినది. ఆప్రకారముస్నానముచేసి వస్త్రముచేత నయినను హస్తముచేతనయినను జలమును పోగొట్టుకొనకనే తెల్లనిశుష్కమయిన దూదివస్త్రమును ఆచ్ఛాదనముచేసికొని, స్నానముచేతడపబడిన వస్త్రమును పైనుంచి తీసివేయవలయును. గోచివేసికొనకయున్నవాడును, ఉత్తరీయము అనగా నూర్ధ్వవస్త్రములేనివాడును, దిగంబరుడును, చినిగినవస్త్రముకలవాడును, శ్రౌతస్మార్తకర్మలనుచేయరాదు. రెండుమడతలుగా మడవబడినవస్త్రములుగల వాడును,కాలి





నవస్త్రముకలవాడును, కూర్చబడిన తేపలువేయబడిన వస్త్రము కలవాడును, కావిబట్టలుగలవాడును, దిగంబరుడున్ను నగ్నుడేననిఅనగాదిగంబరులేనని తెలియవలయును. పిండినవస్త్రమును భుజమునందుంచరాదు. నాలుగుమడతలుగా మడపబడిన వస్త్రమును గృహమందుక్రిందకొనలుగలదిగనునది యందు పైకొనలుగలదిగను నేలయందు పిండవలయును. మూడుమాస్లవస్త్రమును మడవరాదు పైవస్త్రమును జీవించినతండ్రి కలవాడును జీవించిన అన్నకలవాడున్ను ధరియించరాదు. ప్రావారవస్త్రము అనగా ఉపవస్త్రమయితే అందరిచేతను ధరియించతగును, ఇట్లుప్రాతఃకాలమందు చేయతగిననిత్యస్నానము తెలియవలయును.

చండాలుడు ప్రసవించినస్త్రీయిరజస్వలాస్త్రీయిశ్మశాన కాష్ఠముశవముచండాలునినీడ, ఈమొదలగువారిని ముట్టుకొనుటయందువెంటనే స్నానముచేయవలయును.చండాలుడుమొదలగువానినిముట్టుకొనియున్నయతనినిమొదలుగాఅతనిచేముట్టుకొనబడియున్నవారలయందు లెక్కింపగా మూడవవానిపర్యంతము ధృతవస్త్రసహితమగుస్నానముచేయతగినది నాలగవవానికి ఆచమనముమాత్రము తెలియదగినది. అతనిపిమ్మట పైవారికి ప్రోక్షణము. రెండవవాడు మొదలగువానికి దండము తృణము మొదలయినది మధ్యభాగమందుండుటతో ముట్టుకొనుచుండుటయందు ఆచమనమేను, అయితే వస్త్రముయొక్క మధ్యభాగమందుండుటతోనయ్యది ప్రత్యక్షముగ ముట్టుకొనుటయేనని నిశ్చయించి యిచ్చట నాలగవవానికే ఆచమనముకాని పూర్వము వానికి ఆచమనములేదు, నైమిత్తికమయిన స్నానము రాత్రియందుకూడ చేయతగినది. మృతాశౌచమందును, జాతాశౌచమందును, సంక్రాంతియందును, శ్రాద్ధదినమందును, జన్మదినమందును, స్పృశించతగనివానిని ముట్టుకొనుటయందును, ఉష్ణోదకముచే స్నానముచేయరాదు, నైమిత్తికస్నానమందు జలతర్పణముమొదలగు విధానములేదు, నిత్యస్నానముచేయక భోజనముచేయుటయందుపవాసముచేయతగినది. గ్రహణము సంక్రాంతి మొదలగునైమిత్తిక స్నానమునుచేయక భోజనముచేయుటయందును పానముచేయుటయందున్ను యెనిమిదివేలగాయత్రీజపము, శూద్రులు మొదలగువానిని ముట్టుకొనుటవలన చేయతగియున్న స్నానమును చేయక భోజనముచేయుచో నుపవాసము శునకములు కాకములు చండాలులు మొదలగువారిని ముట్టుకొనేవిషయములో స్నానమునుచేయక భోజనముచేయుటయందున్ను పానమునుచేయుటయందున్ను, మూడుదినములుపవాసము చాకలివాడు మొదలగువానిని ముట్టుకొనువిషయము

లో వకటిన్నరదిన ముపవాసము, అమావాస్యవ్యతీపాతరధసప్తమి, యీమొదలగుదినమందు స్నానమున్ను కార్తికస్నానము మాఘస్నానమున్ను కామ్యము, ఇట్లుజలమందుమునుగుట మొదలగునట్టిరూపమైనవారుణస్నానములు చెప్పఁబడెను.

అనంతరము గౌణస్నానములు చెప్పఁబడుచున్నవి, ఆపోహిష్ఠా, అని మొదలగుమంత్రములచేత ప్రోక్షణము మంత్రస్నానము, గాయత్రీమంత్రముచే పదిమార్లుఉదకమునుమంత్రించి ఆయుదకముచే సమస్తములగు అవయవములయందు ప్రోక్షించుకొనుట గాయత్రస్నానము- భస్మముచే స్నానము ఆగ్నేయస్నానము, తడివస్త్రముచె అవయవములను రుద్దుకొనుట కాపిలస్నానము, విష్ణుపాదోదకముచే ప్రోక్షించుకొనుట, బ్రాహ్మణపాదోదకముచే ప్రోక్షించుకొనుట, విష్ణుధ్యానము, యీమొదలగువాటిచేత కూడనితరస్నానములుగలవు గౌణస్నానములచేత జపము సంధ్యావందనము మొదలగువానియందు శుద్ధిగలుగునుగాని శ్రాద్ధము దేవతార్చనము మొదలగుదానియందు శుద్ధిలేదు అయితే బ్రహ్మయజ్ఞమందు వికల్పము అనగా శుద్ధిగలిగియుండుటగాని లేకబోవుటగాని తెలియదగినది ఇది చిత్తశుద్ధితో నిర్ణయించవలయును.

అనంతరము తిలకమును ధరియించువిధానము చెప్పఁబడుచున్నది, ప్రాతఃకాలమునందు భస్మముతో పుండ్రమునుధరియించి అనంతరము మృత్తికతోపుండ్రమునుధరియించవలయును, మృత్తికలిచ్చట గోపీచందనము, తులసీవృక్షముయొక్కమూలమందున్నమృత్తిక, సముద్రతీరమందున్న మృత్తిక, గంగాతీరమందున్న మృత్తిక, పుట్టయందున్న మృత్తిక, ఈమొదలగు మృత్తికలు తెలియందగు, నొసటియందుకడుపుయందు రొమ్ముయందు కంఠమందు కుడిపార్శ్వము కుడిభుజము కుడిచెవి, అనునీప్రదేశములయందు, యెడమపార్శ్వము యెడమభుజము యెడమచెవి, అనునీప్రదేశములయందు, వీపుయందు, భుజశిరస్సుయందును,అని పదిరెండుస్థానములయందు శుక్లపక్షమందు కేశవాది ద్వాదశనామములచేతను, కృష్ణపక్షమందు సంకర్షణాది ద్వాదశనామములచేతను, శిరస్సుయందు వాసుదేవ అనునామముచేతనున్ను తిలకముచేయతగినది.

అనంతరముభస్మత్రిపుండ్రవిధానముచెప్పబడుచున్నది. శ్రాద్ధమందు యజ్ఞమందు జపమందు హోమమందు వైశ్వదేవమందు దేవతార్చనమందు భస్మత్రిపుండ్రములచే పరిశుద్ధమయిన దేహముగలమనుష్యుడు .మృత్యువును జయిం





చును భస్మమును గ్రహించి "అగ్నిరితిభస్మ నపతానిచక్షూంషిభస్మాని అనిమంత్రముచేత అభిమంత్రించియుదకతోమిశ్రముచేయబడినదైన నడిమిమూడువ్రేళ్లచేత గ్రహించబడిన భస్మమును నొనటియందును రొంముయందును బొడ్డుయందును కంఠమందును భుజశిరస్సులయందును భుజసంధులయందును వీపుయందును శిరస్సుయందును శివమంత్రముచేతనైనను నారాయణాష్టాక్షరిచేతనైనను గాయత్రిచేతనైనను ప్రణవముచేతనైనను త్రిపుండ్రములను చేయవలయును.

* అనంతరము సంధ్యావందనమునుచేయుటకు కాలము చెప్పబడుచున్నది. ప్రాతఃసంధ్యావందనమందు నక్షత్రములు కనబడుచున్నపుడే చేయుట యుత్తమము. నక్షత్రములుకనబడకయుండగా సూర్యుడుదయించకముందు చేయుటమధ్యమము. సూర్యుడుదయించినపైన చేయుట అధమము. ఇట్లుమూడువిధములు సాయంసంధ్యావందనమందు సూర్యుడు కనబడుచుండగాచేయుట యుత్తమము. సూర్యుడు కనబడకయుండగా నక్షత్రములుకనబడకముందు చేయుట మధ్యమము. నక్షత్రములుకనబడినపిమ్మటచేయుట అధమము. ఇట్లుమూడువిధములు వకటిన్నరయామము మొదలుకొని సాయంకాలమువచ్చునంతలోపల మాధ్యాహ్నికసంధ్యావందనమునకుకాలము. అందులో ఉత్తరోత్తరకాలముకన్నను పూర్వపూర్వకాలముశ్రేష్ఠము. సమస్తులకును మూడుసంధ్యావందనములు నది మొదలగుచోటవెలుపటనే ప్రశస్తము. స్మార్తాగ్నికలవానికయితే ప్రాదుష్కరణాదికర్మ ననుసరించుటచేత సాయంప్రాతఃసంధ్యావందనములు ఇంటియందుచేయతగినవి.

సంధ్యావందనము ఉపాత్తదురితక్షయ ద్వారాశ్రీపరమేశ్వరప్రీతికి కారణమగుటవలననిత్యము. ఇది నిర్గుణోపాసనమువలె నిర్వికల్పసమాధివలె ఈశ్వరార్పణముగచేయబడిన కర్మమువలె చిత్తశుద్ధినిగలుగంజేయునది. సకామముగాగ యజ్ఞదానతపఃకర్మలనుచేయువారికి సంధ్యావందనముపాపమునుమాత్రముహరించును. నిష్కామముగచేయువారికి పుణ్యమునుకూడహరించును.

---

ప్రమాణము. ఉత్తమాతారకోపేతామధ్యమాలుప్తతారకా । అధమాసూర్యసహితాప్రాతఃసంధ్యాత్రిధామతా॥ ఉత్తమాసూర్యసహితామధ్యమాలుప్తభాస్కరా । అధమాతారకోపేతాసాయంసంధ్యాత్రిధామతా॥ అధ్యర్ధయామాదాసాయంసంధ్యామాధ్యాహ్నికీష్యతే॥

ఎవ్వరుసంధ్యావందనమును చేయుచున్నారో వారలుపాపరహితులై బ్రహ్మలోకమునుపొందుచున్నారు సంధ్యావందనముచేతహీనుడగువాడు అనాచారుడగుటవలన నితరసత్కర్మల నెంతగాచేసిననుఫలమేమియునులేదు. అతండుజీవించియేశూద్రుడగును. మృతినొందినవాడై శునకజన్మమును పొందును నిశ్చయము.

మూడు సంధ్యావందనములయందు యేదోవకయత్నాభావమువలన కాలముయొక్క అతిక్రమించుటయందు ప్రాయశ్చిత్తముకొరకు వక అర్ఘ్యమును అధికముగా నివ్వవలయును పగలుచేయతగియున్న కర్మలను యత్నములేకపగలు చేయకబోవుటయందు రాత్రియందు వకయామములోపల † చేయవలయును. అయితే బ్రహ్మయజ్ఞమునుసారమంత్రజపమునున్ను చేయరాదు. సర్వప్రకారములుగా సంధ్యావందనములోపించుటయందు వక్కొకసంధ్యావందనమునుగురించి వక్కొకయుపవాసమునుచేశి వక్కొకసంధ్యావందనమునుగురించి పదివేలయినను వెయ్యిన్ని యెనిమిదయినను గాయత్రీజపముచేయతగినది. రోగాదిపీడితుడగుటవలన శక్తిలేకబోవుటయందు ప్రతిసంధ్యావందనలోపమందు నూరుగాయత్రీజపముచేయతగినది. రెండుమూడుదినములయందు సంధ్యావందనములు లోపమగుటయందు ఆసంధ్యావందనములయొక్క ఆవృత్తిననుసరించి గాయత్రీజపముచేయతగినది. అంతకుపైదినసంఖ్యయందుకూడ లోపమగుటయందు కృచ్ఛ్రచాంద్రాయణములు మొదలగు ప్రాయశ్చిత్తముకల్పించతగినది.

ఇట్లుసంధ్యావందనమును చేయకబోవుటయందు ఇంతప్రత్యవాయమున్నందువలన సంధ్యావందనమునిత్యము.

బహ్వృచులుతైత్తిరీయులు కాత్యాయనులు మొదలగువారికి సంధ్యావందనమువారివారిశాఖాను సారముగా తెలియదగినది.

‡ అనంతరము ఔపాసనహోమము చెప్పబడుచున్నది తాను హోమముచేయుట ముఖ్యము. శక్తిలేకయున్నపుడు భార్య, కుమారుడు, కూతురు, భ్రాత, శిష్యుడు, భగినీపుత్రుడు, అల్లుడు, ఋత్విక్కుడు, వీరిలో నెవ్వరైనను

* ప్రమాణము. సంధ్యాముపాసతే యే తు నిష్పాపా బ్రహ్మలోకగాః అన్యకర్మఫలంనాస్తిసంధ్యాహీనోఽశుచిత్వతః జీవమానోభవేచ్ఛూద్రోమృతశ్వాచాభిజాయతే.

† ధర్మప్రవృత్తియందును ధర్మసింధువుయందున్ను చూడవలెను.

‡ ఇదిమొదలు దేవగురుపూజాంతము ధర్మసింధువుయందును మాధవీయాదులయందున్ను మూలవచనములు చూడతగినవి.





చేయవలయును. తాను హోమముచేయుటయందు యేమిఫలముకలదో ఇతరులచేత హోమముచేయుటయందు అందులోసగముఫలము. పర్వదినమందయితే తానే హోమమును చేయవలయును. అచ్చట ప్రాతఃకాలమందు సూర్యోదయముకన్నను పూర్వము సాయంకాలము సూర్యాస్తమానముకన్నను పూర్వము గార్హపత్యాద్యగ్నులకయినను గృహ్యాగ్నికయినను ప్రాదుష్కరణమును చేశి సూర్యోదయమైనపిమ్మటను సూర్యాస్తమానమైనపిమ్మటను హోమము చేయతగినది. ప్రాదుష్కరణకాలము నతిక్రమించుటయందు "ఓంభూర్భువఃస్వః స్వాహా" అనిమంత్రముచేత స్రువాజ్యాహుతిరూపమయిన సర్వప్రాయశ్చిత్తమును ఆజ్యసంస్కారపూర్వకముగ చేశి హోమముచేయతగినది. సూర్యోదయముపైన పదిఘడియలలోపల ప్రాతర్హోమకాలము ముఖ్యము. అనంతరము సాయంకాలము పర్యంతము గౌణకాలము. సాయంహోమము తొమ్మిదిఘడియలు పర్యంతము ముఖ్యము. అదిమొదలు ప్రాతఃకాలము పర్యంతము గౌణకాలము. ముఖ్యకాలము నతిక్రమించుటయందు "కాలాతిపత్తినిమిత్తప్రాయశ్చిత్తపూర్వకమముగ హోమంకరిష్యే" అనిసంకల్పముచేశి ఆజ్యమును సంస్కారముచేశి స్రుక్కుయందు నాలుగుమార్లు గ్రహింపబడిన ఆజ్యమునుగ్రహించి సాయంకాలమందు "దోషావస్తర్నమఃస్వాహా" అనిహోమముచేసి ప్రాతఃకాలమందు "ప్రాతర్వస్తర్నమఃస్వాహా" అనిహోమముచేశి హోమద్రవ్యమును సంస్కారముచేశి నిత్యహోమముచేయతగినది. శ్రౌతహోమమునుచేశి స్మార్తహోమము చేయతగినది. కొందరు స్మార్తహోమమునే పూర్వమందు చెప్పుచున్నారు.

ఈస్మార్తహోమవిషయమందు సాయంప్రాతర్హోమములయందు ద్రవ్యైక్యము కర్త్రైక్యమున్ను తెలియదగినది. ద్రవ్యము భేదము కాదగదు. ప్రాతర్హోమకర్తయజమానుడుగానున్నచో కర్తృభేదము దోషముగానేరదు.

ఈహోమమునుగురించి ప్రయోగము ఆశ్వలాయనులు మొదలగువారికి వారివారిగృహ్యసూత్రానుసారము ధర్మసింధువుయందు చెప్పబడినది.

ఈస్మార్తహోమలోపమునందు ప్రతిహోమలోపమునుగురించి వెయ్యిన్నియెనిమిది గాయత్రీజపము చేయదగినది.

అందువలన ఈస్మార్తౌపాసనహోమము నిత్యమైనది.

అనంతరము ఇందునుగురించి హోమద్రవ్యములు చెప్పబడుచున్నవి. యెర్రనివడ్లయొక్క బియ్యము, సామవడ్లయొక్క బియ్యము, యవలయొక్క బియ్యము, పాలు, పెరుగు, నెయ్యి, యెర్రనివడ్లు, యవలు, గోధుమలు, కొర్రలు, యివి స్వరూపముచేతగూడ అనగా దంచిసడించకనే కూడ హోమము చేయవచ్చును. దంచిసడించియున్నచో మరల విశేషమేను. తిలలయితే స్వరూపముచేతనే యుండినయడల హోమము చేయతగును. బియ్యము మొదలగునవి నూరుసంఖ్యగలవిగానెంచి హస్తముచేత హోమము చేయతగినవి. పెరుగు మొదలగుద్రవద్రవ్యము స్రువముచేత హోమము చేయతగినది. అన్నిచోట్ల పరమయిన ఆహుతిపూర్వమైన ఆహుతికన్నను అధికముగా నుండవలయును. సమిధలయితే జిల్లేడు, మోదుగ, చండ్ర, ఉత్తరేణి, రావి, మేడి, జమ్మి, గరక, దర్భ, అనువృక్షములయొక్క సంబంధములు పదిఅంగుళములుగలవి పదిరెండుఅంగుళములుగలవి బొబ్బడగలవి తెలియదగినవి. హోమము చేయబడిన రెండుఆహుతులకు సంసర్గము కారాదుగనుక యత్రవేత్థ, అనిమంత్రముచేత అగ్నికొరకు సమిధను హోమముచేయవలయును. నిత్యహోమము అతిక్రమించుటయందు ఆజ్యమును సంస్కారముచేసి నాలుగుపర్యాయములు గ్రహించి "మనోజ్యోతిర్జుషతాం" అనిమంత్రముచేత హోమముచేయవలయును. పదిరెండుదినములపర్యంతము హోమమునకు లోపమగుటయందు ఇదే ప్రాయశ్చిత్తము చేయతగినది. అటుపిమ్మట అగ్నినాశమగును. కాబట్టి స్మార్తౌపాసనహోమము తప్పకచేయునది.

ఈప్రకారముగ హోమలోపప్రాయశ్చిత్తమునుచేసి అతిక్రమించిన హోమముకొరకు ద్రవ్యమును సంస్కారముచేసి సాయంకాలప్రాతఃకాలక్రమముచేత రెండురెండు ఆహుతులను దినగణనముచేతచేయవలయును. అగ్ని, సూర్యుడు, ప్రజాపతి, అనిదేవతలనుగురించి యుపస్థానముచేయవలయును. మరియొకపక్షమందు హోమముచేయరాదు. అదియేలనన్నన్నో, ప్రాయశ్చిత్తముచేత చారితార్థ్యమైయున్నందువలనని తెలియదగినది. సూతకము మొదలగుదానిచేత హోమములోపమగుటయందు కూడ నిదేప్రకారమే తెలియదగినది. హిరణ్యకేశీయ శాఖాజనితులకు కూడనిదేప్రకారమే తెలియదగినది. ఆపస్తంబులు మొదలగువారికి మూడుదినములపైన అగ్నినాశనము అగుచున్నది. అని కారణముచేత సూతకమందుకూడ తామేహోమమును చేయవలయును. సమారోపణమునుజేసినపైన సూతకము ప్రాప్తించుటయందు ప్రత్యవరోహము సంభవించకపోవుటవలన మూడుదినములు హోమలోపమగుచునుండగా పునరాధానముచేయతగినది.





అనంతరము సమస్యహోమము సాయంప్రాతర్హోమములను రెండిటిని వకవేళనేకలిసి చేయుటచెప్పబడుచున్నది. "సాయంప్రాతర్హోమౌసమస్యకరిష్యే" అనిసంకల్పముచేసి పూర్వమందువలె సాయంకాలహోమమునుచేసి ముగించి పర్యుక్షణమునుజేసి మరల ద్రవ్యమును సంస్కారముచేసి సమిధనుంచి సూర్యునిగురించి, ప్రజాపతినిగురించి, రెండు ఆహుతులను సమర్పించి హవిష్పాంతం, అని మంత్రముచేత యుపస్థానమును చేయవలయును.

అనంతరము పక్షహోమముచెప్పబడుచున్నది. పాడ్యమిదినమందు "అద్యసాయమారభ్యచతుర్ధశీ సాయమవధికాణ్ పక్షహోమాణ్ తంత్రేణకరిష్యే" అనిసంకల్పముచేసి సాయంకాలమందు తండులములను రెండుపాత్రలయందు దినవృద్ధిక్షయానుసారముగ పదునాలుగు మొదలగు ఆవృత్తులుగ్రహించి అనగావేశియుంచి హోమకాలమందు అగ్నయేస్వాహా, అనిమంత్రముచే మొదటిపాత్రయందున్న సమస్తతండులములను వకసమయమందే హోమించి రెండవపాత్రయందున్న సమస్తతండులములను ప్రజాపతికొరకు అట్లనే హోమముచేయవలయును. ఈప్రకారముగ విదియనాడు ప్రాతఃకాలమందు "అద్యావధిపర్వప్రాతరవధికాణ్ పక్షహోమాణ్తంత్రేణకరిష్యే" అనిసంకల్పము మొదలగునది సాయంహోమమువలె చేయునది.

ఈపక్షహోమమందు విశేషమయితే మొదటిపాత్రయందున్న సమస్తతండులములను సూర్యాయస్వాహా, అనిహోమముచేయునది. రెండవపాత్రయందున్న సమస్తతండులములను ప్రజాపతికొరకు హోమముచేసి రెండుచోట్లను సమిధయొక్కటియే యుపయోగించతగును. ఉపస్థానము మొదలగునది వకపర్యాయమే చేయతగినది. పక్షమధ్యమందు ఆపత్తుప్రాప్తించుటయందు ఆసాయంకాలము మొదలు చతుర్దశీ సాయంకాలము పర్యంతముగానున్న శేషహోమ

* ఈస్మార్తాగ్నియందు అశ్వలాయనాది సూత్రభేదముగ సమారోపణము ప్రత్యవరోహణము మొదలగువిషయము, హోమకర్మమునందు పూర్వాపరకృత్యనిర్ణయము, అగ్న్యుపఘాతనిమిత్తములు, అగ్నినాశకములు, అందునుగురించిన ప్రాయశ్చిత్తములు, ఈమొదలుగునది సవిస్తరముగ ధర్మసింధువుయందు చూచితెలిసి కొనవలయును.

ఇచ్చటనయితే విస్తరభయమువలన మేము సంక్షేపముగ వ్రాసియున్నాము.

ములను సాయంకాలమందు పక్షహోమమందువలె హోమముచేసి పర్వదినము ప్రాతఃకాలము పర్యంతముగానున్న శేషహోమములను ప్రాతఃకాలమందు హోమము చేయవలయును. సర్వప్రకారములుగా పర్వదినముయొక్క సాయమహోమమును పాడ్యమిదినముయొక్క ప్రాతర్హోమమున్ను వేరువేరుగనే చేయతగినది. ఇట్లుపక్షహోమము పక్షశేషహోమమున్ను చెప్పబడెను పక్షమధ్యమందు ప్రాప్తించియుండిన ఆయాపత్తుపక్షమధ్యమందే వెళ్లిపోవుచుండగా నాకర్షించి చేసియున్న హోమములను మరలచేయవలయును.

అయితే వెంబడివెంబడిగ మూడుపక్షహోమములనుచేసితే అగ్నినాశమగును. గనుక అట్లుచేయరాదు. వెంబడిగ రెండుపక్షహోమములను చేసినా మూడవపక్షమందు ప్రతిదినము హోమముచేయవలయును. సర్వప్రకారములుగ ఆపత్తు నివర్తించకబోయినయెడల జన్మముండుపర్యంతము పక్షహోమములనుచేసినను చేయవచ్చును దోషములేదు.

* యెవ్వనికివేదము వేదియున్ను మూడుపురుషులపర్యంతము విచ్ఛేదింపబడుచున్నవో అనగా వేదమును సషడంగముగా అభ్యసించకనున్ను శ్రౌతస్మార్త హోమములనుచేయకనున్ను ఉండునో అతడు దుర్బ్రాహ్మణుడు అనగా బ్రాహ్మణకులమందుబుట్టిన బ్రాహ్మణాభాసుండుగాని ముఖ్యబ్రాహ్మణ్యము గలవాడు గాదని తెలియందగు. ఇట్లు చెప్పుటవలన వేదము నభ్యసించక నితరశాస్త్రముల నభ్యసించినను అగ్నికార్యమునుచేయక నితరధర్మములనువిశేషించి జేసినను ముఖ్యధర్మమునుచేయనందున పాపము తప్పదని తెలియవచ్చుచున్నది. అతండుబ్రాహ్మణాభాసుండుగనుక సర్వకర్మలయం దధికారములేనివాడు. అందువలన తెలివిగలవాడై శ్రద్ధతోకూడినవాడై అగ్నిహోత్రకృత్యమును చేయవలను అగ్నిహోత్రకృత్యమునకంటె శ్రేష్ఠమయిన ధర్మమేదియును లేదు. శ్రౌతశాస్త్రజ్ఞానమైనను ద్రవ్యమైనను యీమొదలగునది లేకబోవుటవలన శ్రౌతకర్మమందు శక్తిలేకయున్న

* ప్రమాణవచనములు. యస్యవేదశ్చ వేదీచవిచ్ఛిద్యేతే త్రిపూరుషం। సవైదుర్బ్రాహ్మణోజ్ఞేయః సర్వకర్మసుగర్హితః॥ అగ్నిహోత్రం ప్రకుర్వీతజ్ఞానవాన్ శ్రద్ధయాన్వితః। త్రాత్పరోధర్మోనభూతోనభవిష్యతి॥ శ్రౌతకర్మణినోశక్తోజ్ఞానద్రవ్యాద్యభావతః। స్మార్తంకుర్యాద్యథాశక్త్యాప్యత్రాచారం లభేత్సదా కృతదారోనతిష్ఠేత క్షణమప్యగ్నినావినా। తిష్ఠేతచేద్ద్విజోవ్రాత్యస్తథాచపతితోభవేత్ నగృహ్ణీయాద్వివాహాగ్నింగృహస్థఇతిమన్యతే। అన్నంతస్యనభోక్తవ్యంవృథాపాకోహిసంస్మృతః॥ యోదద్యాత్కాంచనంమేరుంపృథివీంచసమానవాం। తత్సాయంప్రాతర్హోమస్యతుల్యంభవతివానవా॥





చో తనశక్తిననుసరించి స్మార్తకర్మనయినను చక్కగా చేయవలయును. భార్యను పెండ్లిచేసికొనియున్నమీదట క్షణకాలమయినను అగ్నికార్యమును చేయకనుండరాదు. అట్లున్నచో ఆబ్రాహ్మణుడువ్రాత్యుడును పతితుడునగును. తాను గృహస్థుడైయుండి స్మార్తాగ్నినిగ్రహించుటతో నిరంతరము స్మార్తహోమమును చేయుటతో ప్రయోజనములేదని యెవ్వడు తెలిసియున్నాడో అతనియన్నమును భోజనముచేయరాదు. యెవ్వడు సువర్ణరూపముగానున్న మేరుపర్వతమునున్ను మానవసహితముగానున్న భూమండలమునున్ను దానముచేసునో అతనిపుణ్యము సాయంప్రాతర్హోమమునుచేయు గృహస్థునియొక్కపుణ్యముతో సమానమగునో కాదో తెలియజాలము.

ఇది స్మార్తహోమప్రకరణము ముగిసెను.

అనంతరము నిత్యదానము చెప్పబడుచున్నది. * దానములేనట్టిదినము వక్కటియైనను గతించినచో నతండు దొంగలచేత దోపుడబోయినవాడెట్లుదుఃఖించునో అట్లు దుఃఖించుట మిక్కిలియుక్తము. కాబట్టి తనసంపత్తును అనుసరించి ద్రవ్యధాన్యము మొదలగునది ప్రతిదినము దానముచేయందగు సంభవించకబోవుటయందు వక్కలుఫలములు మొదలగునదియైనను దానముచేయతగినది. † దానమువలన స్వర్గపశుపుత్రవిత్తాదులు నుకీర్తికూడను గలుగుచున్నది. అందువల్ల దానముకన్న నధికమైనదెక్కడను మూడులోకములయందేదియును లేదు. ‡ యెవ్వనియొక్కద్రవ్యము ధర్మముకొరకైనను తాను అనుభవించు కొరకైనను ఉపయోగించునో అతనిద్రవ్యము సార్థకము లేకున్నచోనిరర్థకము. వేదముకూడ సమస్తదేవతలు దానమువల్లనే వశమును పొందుచున్నారని దానమాహాత్మ్యమును విశేషముగ చెప్పుచున్నది కాబట్టి దానమువలన సర్వముసాధ్యమేను దానమునకు వేదశాస్త్రవిద్యయున్ను తపస్సున్ను కలవాడుపాత్రము అందులో విద్యకన్నను తపస్సు అధికము గనుక విద్యలేనివాడయినను తపస్సంపన్నుడు పాత్రము దురాచారమును చేయువాడును వేదశాస్త్రములయందు పూర్తిగాప్రామాణ్య

* ఏకస్మిన్నప్యతిక్రాంతేదినేదానవివర్జితే। దస్యుభిర్ముషితస్యేవయుక్తమాక్రందితుంభృశం॥

† ఆదిత్య పురాణమందు నదానాదధికం కించిద్దృశ్యతే భువనత్రయే। దానేన ప్రాప్యతేస్వర్గః, అని మొదలుగా చెప్పబడియున్నది.

‡ యస్యవిత్తం నధర్మాయనోపభోగాయ తస్యవిత్తం నిరర్థకం॥

గారుడపురాణమందు పితుశ్శతగుణం ప్రోక్తం సహస్రం మాతురుచ్యతే। భగిన్యాందశసాహస్రం దర్యేదత్తమక్షయం॥

బుద్ధిలేనివాడును స్వకీయదార పుత్రాది పోషణమందు మాత్రము ఆసక్తిలేనివాడున్ను పరోపకార మందాసక్తిలేనివాడును, అయినపురుషుడు వేదశాస్త్రిపారంగతుడైనను పాత్రుడుగాడు. వేదవేదాంగములను దెలిసికొని నిరంతము శిష్యులకు పాఠముచేయించువారును, దరిద్రులును, కుటుంబులును, అయినశ్రోత్రియులగు బ్రాహ్మణులు మిక్కిలి దానపాత్రులు విశేషమయిన దారిద్ర్యదుఃఖము గలవారును అనాథులును ఆపన్నులును, యేకులమందు జనించి యున్నవారైనను దానపాత్రులేను. మాతృపితృభగినీ సోదరులుకూడ మిక్కిలి దానపాత్రులు.

ఇట్లు పగటివి యెనిమిదిభాగములు చేయగా నందులో మొదటిభాగమందుచేయతగిన కార్యమంతయు చెప్పబడెను.

రెండవభాగమందు వేదశాస్త్రాభ్యాసము చేయతగినది. వేదములను, వేదశాస్త్రములును, ధర్మజ్ఞానాదిశాస్త్రములనున్ను, బ్రాహ్మణశ్రేష్ఠుడగునతడు, తాను చదవవలయును, చదివించవలెను అనగా చదువుచెప్పవలయును, జపము చేయవలెను విచారముచేయవలయును, చూడవలయును.

* దేవతార్చనము కూడ ప్రాతరౌపాసనహోమానంతరమయినను నాలగవభాగమందు బ్రహ్మయజ్ఞానంతరమయినను చేయతగినది. అచ్చట విష్ణు, శివ, బ్రహ్మ, సూర్య, శక్తి, విఘ్నేశ్వరులు, యీమొదలగు దేవతలయందు అభీష్టదేవతను పూజచేయవలయును. అందులో కూడకలియుగమందు హరిహరదేవతల యొక్క పూజప్రశస్తమైనది. విష్ణుమూర్తిని ఆరాధనము చేయుటకంటె పుణ్యప్రదమైన వైదికకర్మమేదియునులేదు. అందువలన ఆదిమధ్యాంతరహితుడైనట్టి విష్ణుమూర్తిని ప్రతిదినమందు తప్పక ఆరాధనము చేయవలయును. మరియొకపక్షమందు పురాణపురుషుండగు భగవంతుడగు పరమేశ్వరుండగు సాంబపరబ్రహ్మమును, ప్రణవముచేతనైనను, రుద్రగాయత్రిచేతనయినను, త్ర్యంబకమంత్రముచేతనయినను, శివషడక్షరీ మహామంత్రముచేతనయినను, ఆరాధనము చేయవలయును. అందులోకూడ ప్రతిమాస్థండిలాదులకన్నను శాలగ్రామమందును బాణలింగమందున్ను పూజప్రశస్తమైనది. యేలనంటే ఆవాహనము మొదలగునది లేకనే నిరంతము దేవతాసన్నిధానము గలిగియున్నందువలనని తెలియదగినది. ఇందుకై శ్రీమద్భాగవతమందు "ఉద్వాసావాహనేనస్తఃస్థిరాయాముద్ధవార్చనే। అస్థిరాయాం వికల్పఃస్యాత్ స్థండిలేతుభవేద్ద్వయం" అని చెప్పబడియున్నది





అయితే మనుస్మృతియందు "ఋతామృతాభ్యాం జీవేతమృతేన ప్రమృతేనవా సత్యానృతాభ్యామపివానశ్వవృత్త్యాకదాచన" అనిచెప్పియున్నప్రకారము బ్రాహ్మణుడు ఉంఛశిలావృత్తులతో లేక అయాచితవృత్తితో లేకయాచనా భిక్షావృత్తితో లేక కర్షణావృత్తితో లేక వాణిజ్యవృత్తితో జీవించవలయును. ఇందులో వెనుక వెనుక చెప్పబడియున్నది. సంభవించకపోయిన పక్షమునందు ముందుముందు చెప్పబడియున్న దంగీకరించతగినది. అందులో ఉంఛశిలావృత్తులతో కలియుగమందు జీవనముగా నేరదుగనుక కలియుగమందు నిషిద్ధములు సేవావృత్తియెప్పటికిని చేయందగదు. మరియు "కుసూలకుంభీధాన్యోవాత్ర్యాహికః శ్వస్తనోపివా" అని వచనప్రకారము కుటుంబపోషణ విషయమై కుసూలధాన్యము గలవాడైనను అనగా పదిరెండుదినములకు చాలినంతధాన్యముగలవాడైనను కుంభీధాన్యము గలవాడైనను అనగా ఆరుదినములకు చాలినంత ధాన్యముగలవాడైనను మూడుదినములకు చాలినంత ధాన్యముగలవాడైనను రేపటికిమాత్రము చాలినంత ధాన్యముగల వాడైనను బ్రాహ్మణుడు జీవించవలెను. కృషివాణిజ్యములచేత జీవించుటయందు యీనియమము లేదు ప్రత్యహము ధాన్యయాచనముచేయుట మొదలగువిషయమునందు యీనియమము కృషివాణిజ్యములు రెండును బ్రాహ్మణునికి ఆపద్విషయములేనని కొందరు చెప్పియున్నారు. పరాశరస్మృతియందయితే "షట్కర్మసహితోవిప్రః కృషికర్మచకారమేత్" అని చెప్పియున్నందున అందుకు వ్యాఖ్యానకర్తలగు మాధవాచార్యులవారు కలియుగమందు కృషికర్మనుచేయించి జీవించుట బ్రాహ్మణునికి ముఖ్యధర్మమేనని వ్రాసియున్నందువలన వాణిజ్యము మాత్రము ఆపద్విషయమేగాని కృషికర్మము ఆపదితరకాలమందు కూడ ముఖ్యధర్మమేను అయితే అచ్చటమాధవాచార్యులవారుకు సీదమును అనగా వడ్డిచేత జీవించుటను బ్రాహ్మణునికి అపత్కాలమందుకూడ నిషేధించియున్నారు గనుక నెప్పటికిని చేయందగదు. ఆపత్కాలమందుగూడ బ్రాహ్మణునికి శూద్రునివలన ప్రతిగ్రహముకూడదు. త్రైవర్ణికులలో చేరియున్నవాడైనను రాజు అధర్మశీలుడై యున్నచో అతనిద్రవ్యమును ప్రతిగ్రహించరాదు బ్రాహ్మణుడైనను అధర్మశీలుడుగానున్నచో అతనిద్రవ్యమును గ్రహించరాదు తల్లి దండ్రులు ముసలివారై భార్య పతివ్రతయై పుత్రుడు బాలుడై యుండగా తానువసతిలేకయున్నవాడయితే యీచెప్పబడిన నియ

మయొక్కటియులేదు. శూద్రుని ద్విజసేవయే స్వవృత్తియని తెలియందగు అయితే ఆపత్కాలమందు కృషి మొదలగునది స్వవృత్తియని తెలియవలయు.

నాలగవభాగమందు మధ్యాహ్న స్నానముచేయదగినది. అనంతరముత్రిపుండ్రమును ధరియించుకొని యున్నవాడై మధ్యాహ్న సంధ్యను చేయవలయును. మధ్యాహ్నసంధ్యా వందనప్రయోగమును స్వశాఖానుసారము గురువువలన తెలిసికొనవలయును.

అనంతరము బ్రహ్మయజ్ఞము చేయదగినది. అందుకు ప్రయోగమును స్వశాఖానుసారము గురువువలన తెలిసికొనవలయును.

ప్రాతఃకాల హోమానంతరము దేవతార్చనము చేయకుండినచో నాలగవభాగమందు బ్రహ్మయజ్ఞానంతరము చేయదగినది.

అనంతరము అయిదవభాగమందు చేయదగినది చెప్పబడుచున్నది. కండణీ పేషణీ చుల్లీ ఉదకుంభః మార్జనీ అనునైదు హింసాస్థానములు పంచసూనములనంబడు ఈహింసాస్థానములనుంచి ప్రాప్తించిన హింసాదోషము పోవులకొరకై వైశ్వదేవము చేయతగినది. వైశ్వదేవమునకు ప్రాతఃకాలమునందే ప్రారంభముగాని అగ్నిహోత్రాదులయందువలె సాయంకాలమునందు ప్రారంభము చేయతగదు. అందువలన ప్రాతఃసాయం వైశ్వదేవ అని మొదలగు ప్రకారమే సంకల్పము చేయతగినది. పంచమహా యజ్ఞములు ప్రతిదినమందు చేయతగినవి. బ్రహ్మయజ్ఞము దేవయజ్ఞము భూతయజ్ఞము పితృయజ్ఞము మనుష్యయజ్ఞము అనునీయైదు పంచమహాయజ్ఞము లనంబడును. ఋగ్వేదులు మొదలగువారికి వైశ్వదేవము దేవయజ్ఞము మొదలగు మూడుయజ్ఞముల రూపమైనది. మనుష్యయజ్ఞము అనగామనుష్యులకు అన్నమునుపెట్టడము తైలము క్షారము మొదలగువాటిచే వర్జింపబడిన గృహమందు పక్వములగు హవిష్యాన్నములయందు నెయ్యినికలిపి వాటిచే గృహ్యాగ్నియందుగాని లౌకికాగ్నియందుగాని హోమముచేయవలయు. లౌకికాగ్నియందు హోమముచేయునపుడు యే అగ్నియందు అన్నము పక్వము చేయబడెనో ఆయగ్నియందు హోమముచేయవలెను. యీవైశ్వదేవము ఆత్మసంస్కారముకొరకున్ను అన్నసంస్కారముకొరకున్ను చేయదగినది. అందువలన విభాగముగాకయున్నవారికి వకటేపాకము అయివుండగా వేరుగా వైశ్వదేవము చేయపనిలేదు. విభక్తులకయితే వకటేపాకము అయివున్నప్పటికిని గూడ హవిష్యాః





తరముచేత వేరుగనేచేయవలయు. అవిభక్తులకు పాకభేదమయివుండగా వేరుగా వైశ్వదేవమును చేసినను చేయవచ్చును చేయకున్నచో చేయకబోవచ్చును. పాకము సంభవించక బోవుటయందు ఏకాదశి మొదలగుదినమందు తండులముల చేతనయినను పాలునెయ్యి పెరుగు ఫలములు ఉదకము మొదలగువాటిచేతనయినను చేయతగినది. యీ వైశ్వదేవ విషయమునందు ఇంక ననేకసంగతులున్ను శాఖాభేదముగా కొన్నివిశేషములున్ను ప్రాతఃసాయంవైశ్వదేవములకు తంత్రకరణమున్ను గ్రంథాంతరమందు చూడవలయును దేవయజ్ఞ భూతయజ్ఞ పితృయజ్ఞ మనుష్యయజ్ఞములయందు ప్రయోగవిశేషములున్ను గ్రంథాంతరమందు తెలియతగినవి. తమగృహ్యా సూత్రప్రకారము సంభవించునప్పుడు బహ్వృచులయొక్క గృహ్యాసూత్రప్రకారముగా ఉపనయనాది సంస్కారములున్ను పంచమహాయజ్ఞములు మొదలగునవిన్ని చేయందగును. ఇక్షుఖండములను ఉదకమును ఫలములను కందమూలమును తాంబూలమును క్షీరమును ఔషధమును వీటినిభక్షించినపిమ్మట కూడస్నానము దానము మొదలగు క్రియలనుచేయవచ్చును. అనిచెప్పటచేత స్నానమునుచేయుటకు పూర్వముకూడ వీనినిభక్షించవచ్చును. ఇది స్నానముచేయుటకు వసతిలేనపుడేనని తెలియందగు. పంచమహాయజ్ఞములలో నేదో యొక్కటి లోపించితేవక ఉపవాసమునుచేయవలయు. ధనికుడు మొదలగువానికయితే వక్కొక యజ్ఞము లోపించుటయందు సగముసగము కృఛ్రముప్రాయశ్చిత్తము.

అనంతరము బ్రాహ్మణులకు సర్వసాధారణమగు భోజనము మొదలగు విధానము చెప్పబడుచున్నది. బంగారుపాత్రయందైనను వెండిపాత్రయందైనను మామిడిపర్ణములతోచేయబడిన పాత్రమునందైనను భోజనము ప్రశస్తమైనది. కంచుపాత్రయందయితే నియతముగవక్కడే భోజనముచేయవలెను. మరియన్యుని కుపయోగించుకొనరాదు. యతికి బ్రహ్మచారికి విధవకుకాంస్యపాత్రయందుభోజనము తాంబూలము అభ్యంజనమున్ను కూడదు. మోదుగపర్ణములయందు యతులకుభోజనము ప్రశస్తము గృహస్థునికి భోజనముచేయుటయందు చాంద్రాయణముప్రాయశ్చిత్తము. ఈదోషము వల్లీపలాశవిషయమునందేనని స్మృత్యర్థసారమందు చెప్పబడినది. అరటిపర్ణములు నేరడిపర్ణములు పనసపర్ణములు వీటియందు భోజనము ప్రశస్తము జిల్లెడురావి మద్రిపత్రములయందు భోజనము

నిషిద్ధమై....... చతురస్రమండలమందు పరిశుద్ధమగు పాత్రనువుంచి పంచమహా యజ్ఞావశిష్టమగు ఘృతాదియుతమైన అన్నమును అని మొదలగు క్రమముగా భోజనమునుచేసి లేచునంతవరకు ప్రయోగవిధానమును ధర్మసింధువుయందు చూడవలయును భోజనమును తూర్పుముఖముగనైనను పశ్చిమముఖముగనైనను చేయవలయును దక్షిణముఖముగ భోజనముకీర్తినిచ్చునది. కామ్యమైనది ఉత్తర ముఖముగభోజనము మధ్యమము. ఆగ్నేయనైరృత్యాదిమూలలయందు ముఖ ముగలవాడై భోజనముచేయుటనిషిద్ధము. భోజనముచేయుచున్నవారల అన్యో న్యస్పర్శయందు పాత్రగతమైన అన్నమునుత్యజించవలెను. గృహస్థుడు ముప్పది రెండుగ్రాసములైనను అనియతగ్రాసములనైనను భక్షించవలయును. బ్రహ్మ చారికి గ్రాసనియతిలేదు. ముఖమునుంచి నిర్గతమైన అన్నమును మరలభక్షించుట మిక్కిలిదోషకరము వామహస్తముచేత జలపానముచేయరాదు. పాత్రగతమైన ఉదకమును పానముచేయగా మిగిలిన ఆయుదకమును మరియెప్పటికిని పానముచే యరాదు. ఇచ్చటననేక నియమములుగలవు. అవిధర్మసింధువు మొదలగు గ్రంథ ములయందు చూడవలయు అందులోవివేషసంగతులున్ను అచ్చటనే అవశ్యము చూడతగినవి ఇట్లు అయిదవభాగమందు చేయతగిన కార్యముచెప్పబడెను.

ఇతిహాసముపురాణము మొదలగువాటిచే ఆరవభాగమును యేడవభాగ మునున్ను వెళ్లించవలయును. యెనిమిదవభాగమందు లౌకికకార్యమునున్ను బహిఃప్రదేశమునందు సంధ్యావందనమునున్ను చేయవలయు. సాయంకాలమునం దువైశ్వదేవమునుచేయుచున్నచో మరలపాకమును చేయవలయు అతిధినిపూజిం చిమూడుఘడియలుపైన వకటిన్నరయామములోపల భోజనముజేశి శయనిం చవలెను. భోజనకాలమందు దీపముపోవుటయందు పాత్రనురెండుచేతుల లో సూర్యుని స్మరించి మరల దీపమునుచూచి పాత్రయందున్నయన్న మును భోజనముచేయవలయునుగాని ఇతరమగుయన్నమును భోజనముచేయరా దు. శ్రాద్ధదినమందును, శ్రాద్ధదినమునకు పూర్వదినమందును, వ్యతీపాతయం దును, వైధృతియందును, సంక్రాంతిదినమందును, ఈమొదలగు దినములయం దు రాత్రిభోజనముచేయరాదు. రాత్రియందు నాలగవయామము మొదటియా మము అనునీరెండుయామములను విద్యాభ్యాసములచేత వెళ్లించవలయు. రెండు యామములయందుమాత్రము శయనించునతడు ముక్తికిసాధకుడగుచున్నాడు.





తూర్పు దక్షిణము పశ్చిమము, వీటిలోనొకశిరస్సుగ శయనించవలయుగాని యొ కప్పుడైన యుత్తరశిరస్సుగా శయనించరాదు. వకటిన్నరయాముపైన స్వస్త్రీగ మనమునుచేయవలయు స్వస్త్రీగమనవిషయమైన సంగతులను విస్తారముగా ప్రకీ ర్ణకప్రకరణమందు వ్రాయబోవుచున్నాము.

ఇది ఆచారప్రకరణము ముగిసెను.



## వ్రతప్రకరణము.



ఇంకను వ్రతప్రకరణమును వ్రాయుచున్నాము మేషసంక్రాంతియందు పూర్వమందును పరమందున్ను పదిపదిఘడియలు పుణ్యకాలముః రాత్రియందు అర్ధరాత్రికన్నను పూర్వము సంక్రాంతియైనపుడయితే పూర్వదినముయొక్క పగటియందు ఉత్తరార్ధము పుణ్యకాలము అర్ధరాత్రికన్నను పరమందుసంక్రాంతియైనప్పుడయితే పరదినముయొక్క పగటియందు పూర్వార్ధముపుణ్యకాలము అర్ధరాత్రియందే సంక్రాంతియైనప్పుడయితే రెండుదినములుపుణ్యకాలము. మొదట చైత్రమాసమునందు వ్రతాదినిర్ణయము చెప్పబడుచున్నది. చైత్రశుక్లపాడ్యమియందు చాంద్రసంవత్సరారంభము. ఈసంవత్సరారంభమందు ఉదయకాలమునందున్న పాడ్యమిగ్రహించతగినది రెండుదినములయందు పాడ్యమి ఉదయకాలమునువ్యాపించుటయందును వ్యాపించకపోవుటయందును, పూర్వదినమునందున్న పాడ్యమిగ్రహించతగినది. చైత్రమాసము అధికమాసమగుటయందు సంవత్సరారంభ నిమిత్తమైన తైలాభ్యంగనమున్ను సంకలము మొదలగుదానియందు నూతనసంవత్సరనామమును కీర్తించుట మొదలగుదానిని ప్రారంభించుటయున్ను అధికమాసపాడ్యమియందే చేయతగినది. ప్రతిగృహమందు ధ్వజారోపణమున్ను నింబకుసుమభక్షణమున్ను సంవత్సరాదిఫల శ్రవణమున్ను నవరాత్రారంభమున్ను నవరాత్రోత్సవాది నిమిత్తకమైన అభ్యంగస్నానము మొదలగునదిన్ని నిజమాసపాడ్యమియందే చేయతగినది. ఈవత్సరారంభదినమునందు తైలాభ్యంగనము నిత్యమైనది. యీదినమందు ప్రపాదానమారంభించతదినది. ఈచైత్రశుక్లపాడ్యమికల్పాదితిథియని తెలియతగినది. యీప్రకారము వైశాఖశుక్లతదియయు ఫాల్గునకృష్ణతదియయు చైత్రశుక్ల పంచమి మాఘశుక్లత్రయోదశికార్తికశుక్లసప్తమి మార్గశిర శుక్లనవమి ఈతిథులుకూడ కల్పాదులని తెలియదగినది. యీకల్పాదితిథులయందు శ్రాద్ధమును చేయుటవలన పితృదేవతలకుతృప్తియగుచున్నది. చైత్రశుక్లతదియయందు శివమూర్తితోయుక్తమైన గౌరీదేవతను పూజించి ఆందోళనవ్రతమును మాసపర్యంతము చేయవలెను. ఇచ్చటతదియముహూర్తమాత్రమైనప్పటికిని పరదినమందున్నది చేయతగినదిగానిద్వితీయతోయుక్తమైనది చేయతగదు. ముహూర్తమనగా పగటియొక్కయు రాత్రియొక్కయు పదునైదవభాగముఅని తెలియదగినది. ఇదే చైత్రశుక్ల తదియయేమన్వాదియని తెలియదగినది. ఇచ్చటనే సమస్తములయినమన్వాదులయొక్క నిర్ణయము చెప్పబడుచున్నది. చైత్ర శుక్ల తదియయుపూర్ణిమయు జ్యేష్ఠమాసమందు పూర్ణిమయు ఆషాఢశుక్లదశమియుపూర్ణి



మయు శ్రావణబహుళాష్టమియు భాద్రపదశుక్ల తదియయు ఆశ్వీజశుక్ల నవమియు కార్తిక శుక్లద్వాదశియు పూర్ణిమయు పుష్య శుక్ల ఏకాదశియు మాఘశుక్ల సప్తమియు ఫాల్గునమందు పూర్ణిమయు అమావాస్య అనిపదునాలుగు మన్వాదులు తెలయదగినవి. యీమన్వాదితిథులు శుక్లపక్షమందున్నవి దైవకర్మయందును పిత్ర్యకర్మయందును పూర్వాహ్ణ కాలమును వ్యాపించినవి గ్రహించతగినవి. పూర్వాహ్ణకాలమయితే ఇచ్చట రెండుగా భాగింపబడిన పగటియొక్క పూర్వభాగము అని తెలియదగినది. అట్టిపూర్వాహ్ణ కాలమందే శ్రాద్ధముచేయతగినది. కృష్ణపక్షమందున్న రెండుమన్వాదులయితే దైవకర్మయందును పిత్ర్యకర్మయందును అయిదుగా భాగింపబడిన పగటియొక్క నాలగవభాగమగు అపరాహ్ణమును వ్యాపించినవి గ్రహించతగినవి. మన్వాదులయందు పిండరహితమైన శ్రాద్ధము చేయతగినది. యీమన్వాది శ్రాద్ధములచేత రెండువేలు సంవత్సరములు పితృదేవతలకు తృప్తియగుచున్నది. మన్వాది శ్రాద్ధమున్ను నిత్యమైనది. అందువల్లనే దీనినిజేయకబోవుటయందు త్వంభువఃప్రతిమానం అనే ఋగ్వేదమంత్రమునకు నూరుమార్లు ఉదకమందునిలిచి జపముప్రాయశ్చిత్తము చేయతగినది. యీప్రకారము ౯౬ శ్రాద్ధములున్ను నిత్యములైనవి ఆశ్రాద్ధములయితే అమాశ్రాద్ధములు ౧౨ యుగాది శ్రాద్ధములు ౪ మన్వాది శ్రాద్ధములు ౧౪ సంక్రాంతిశ్రాద్ధములు ౧౨ వైధృతిశ్రాద్ధములు ౧౨ పాతశ్రాద్ధములు ౧౨ మహాలయశ్రాద్ధములు ౧౫ అష్టకాశ్రాద్ధములు ౫ అన్వష్టకాశ్రాద్ధములు ౫ పూర్వేద్యుః శ్రాద్ధములు ౫ అని ౯౬ శ్రాద్ధములు తెలియదగినవి. అనంతరము దశావతారజయంతులు చెప్పబడుచున్నవి చైత్రశుక్లతదియయందు అపరాహ్ణకాలమందుమత్స్యావతారమువైశాఖపూర్ణిమయందు సాయంకాలము కూర్మావతారము భాద్రపదశుక్లతదియయందు అపరాహ్ణకాలమందు వరాహావతారము వైశాఖశుక్లచతుర్దశియందు సాయంకాలము నరసింహావతారము భాద్రపదశుక్లద్వాదశియందు మధ్యాహ్నమందు వామనావతారము. వైశాఖశుక్లతదియయందు మధ్యాహ్నమందు పరశురామావతారము. చైత్రశుక్లనవమియందు మధ్యాహ్నకాలమందు దాశరథీరామావతారము. శ్రావణబహుళాష్టమియందు అర్ధరాత్రికాలమందు శ్రీకృష్ణావతారము. ఆశ్వీనశుక్లద్వాదశియందు సాయంకాలము బుద్ధావతారము. శ్రావణశుక్లషష్ఠియందు సాయంకాలమందు కల్క్యవతారము. అని యీప్రకారము జయంతులు ఆయాకాలమునువ్యాపించినవి గ్రహించతగినవి. అందులో శ్రీరామజయంతి శ్రీకృష్ణజయంతి నరసింహజయంతి యీమూడుజయంతులే నిత్యములు ఇతరములు ఆయామూర్త్యుపాసకులచే చేయందగు.

చైత్ర శుక్ల పంచమియందు లక్ష్మీపూజనముచేయునది. చైత్ర శుక్లాష్టమి పునర్వసు నక్షత్రముచేతనున్ను బుధవారముచేతనున్ను కూడియుండెనేని ప్రాతఃకాలమునందు శాస్త్రవిధానప్రకారము స్నానముచేసితే వాజపేయయజ్ఞఫలముగలుగుచున్నది.

చైత్ర శుక్ల నవమి శ్రీరామనవమియని తెలియందగు పునర్వసు నక్షత్రముతోకూడిన చైత్ర శుక్ల నవమియందు మధ్యాహ్నమందు కర్కాటకలగ్నమందు సూర్యుడు మేషరాశియందుండగా అయిదుగ్రహములుచ్చంగతులై యుండగా శ్రీరాములవారిజననమైనది. మధ్యాహ్నమును వ్యాపించిన యీనవమియందు రామనవమీ ఉపోష్యముచేయతగినది పూర్వదినమందు మాత్రమేమధ్యాహ్నమందు నవమియుండగా అదేగ్రహించతగినది. రెండుదినములయందు మధ్యాహ్నకాలమును వ్యాపించుటయందును వ్యాపించకపోవుటయందును పరదినమందున్న నవమిగ్రహించతగినది అష్టమీ విద్ధమైన నవమిగ్రహించతగదు అందువలన పూర్వదినమందు సమస్తమధ్యాహ్నకాలమును నవమివ్యాపించియున్నను. దానినివిడిచి మధ్యాహ్నములో ఏకభాగమునువ్యాపించియున్నప్పటికిని నవమి పరదినమందున్నదే గ్రహించతగినది నవమ్యంతమందు పరదినము పారణముచేయవలయు జయంతీవ్రతములు మలమాసమందు చేయందగవు. యీ శ్రీరామనవమీ వ్రతము నిత్యముకామ్యమున్ను అని తెలియందగు.

చైత్ర శుక్ల నవమియందు కృష్ణస్వామికి ఆందోళనోత్సవముచేయతగినది. చైత్ర శుక్ల ద్వాదశియందు విష్ణుమూర్తికి దమనోత్సవముచేయతగినది. అది పారణదినమందు చేయతగినది. శివునికి చతుర్దశియందు చేయతగినది. చిత్రానక్షత్రముతోకూడిన చైత్రపూర్ణిమయందు చిత్రవస్త్రదానముసౌభాగ్యమునిచ్చునది.

చైత్రశుక్లైకాదశి మొదలుకొని లేక చైత్రపూర్ణిమ మొదలుకొని లేక మేషసంక్రాంతి మొదలుకొని వైశాఖస్నానము ప్రారంభముచేయతగినది. యీ వైశాఖస్నానమందు హవిష్యాశనము బ్రహ్మచర్యము మొదలగునవి నియమములు తెలియదగినవి. యీప్రకారము సంపూర్ణముగా స్నానముచేయుటకు శక్తిలేకపోవుటయందు కడపటత్రయోదశి మొదలగు మూడుదినములయందు స్నానము చేయవలెను. చైత్రబహుళత్రయోదశి శతతారనక్షత్రముతోకూడినది వారుణీ అని సంజ్ఞగలది. స్నానము మొదలగుదానిని చేయుటయందుగ్రహణాదిపర్వముతో సమానమైన ఫలమునిచ్చునది. ఇట్టివారుణి శనివారముతో యుక్తమయినచో మహావారుణి యనంబడు. మరియునీ మహావారుణి శుభయోగముతో కూడినచో మహావారుణియనియే చెప్పబడుచున్నది.





ఈయోగమందు కృష్ణపక్షాది పూర్ణిమాంతమాసము గ్రహించతగినది గాన వింధ్యదక్షిణదేశస్థుల కుపయుక్తమైన అమావాస్యాంతమాసమందు ఫాల్గునకృష్ణత్రయోదశి గ్రహించతగినది. వింధ్యోత్తరదేశస్థులకయితే నిదియే చైత్రకృష్ణత్రయోదశియగుచున్నది. వింధ్యోత్తరదేశస్థులకునువింధ్యదక్షిణ దేశస్థులకున్ను శుక్లపక్షమునందు మాసము భేదించుటలేదు కృష్ణపక్షమునందే మాసము భేదించుచున్నదనుటకు పూర్ణిమాంతమాసము అమావాస్యాంతమాసములను రెండుభేదములుగా శ్రుతిస్మృత్యాదిసమ్మతముగ వ్యవహరించుటయే కారణము. చైత్రకృష్ణచతుర్దశియందు శివసన్నిధియందు స్నానముచేయుటచేతనున్ను ఇది భౌమవార యుక్తమైనచో గంగయందు స్నానము చేయుటచేతనున్ను పిశాచత్వాభావము ఫలము. ఇది చైత్రమాసకృత్య నిర్ణయము ముగిసెను.

అనంతరము వైశాఖమందు వ్రతాదినిర్ణయము చెప్పబడుచున్నది. ఇచ్చట వృషభ సంక్రాంతియందు సంక్రాంతికన్నను పూర్వములగు పదునారుఘడియలు పుణ్యకాలము. రాత్రియందు సంక్రాంతియైనప్పుడయితే పూర్వమే నిర్ణయము చెప్పబడెను. యీ వైశాఖమాసమందు ప్రాతఃస్నానమున్ను తిలలచేత పితృతర్పణమున్ను ధర్మఘటదానమున్ను చేయతగినది. ఈవైశాఖమునందు బ్రాహ్మణులకు గంధములు హారములు పానకము కదళీఫలములు మొదలగు వాటిచేత వసంతమాధవ పూజచేయతగినది. ఈవైశాఖమాసమందు దేవునియందు విశేషముగ శ్రీగంధముతో పూజించుట మహాఫలదము. యెపుడు వైశాఖము అధికమాసమగుచున్నదో అపుడు కామ్యకర్మలను అధికమాసమునందే ముగింపుజేయుటశాస్త్రవిరుద్ధము గనుక రెండుమాసములయందు వైశాఖస్నానము హవిష్యాశనము మొదలగు నియమములు చేయతగినవి. చాంద్రాయణము మొదలగు నదయితే అధికమాసమునందు కూడముగింపు జేయదగినది. వైశాఖశుక్లతదియయందు గంగాస్నానము, యవహోమము, యవదానము, యవాశనము, ఇవి సర్వపాపహరములు. యెవ్వడు వైశాఖ శుక్లతదియందు కృష్ణమూర్తిని శ్రీగంధముచేత నలంకరింపబడిన వానిగ చేయుచున్నాడో అతండు వైకుంఠమున కుబోవుచున్నాడు. ఈ వైశాఖ శుక్లతదియ అక్షయతదియయని సంజ్ఞగలది. ఈ తదియయందు కొంచమైనను జపము హోమము పితృతర్పణము దానము మొదలగునది చేసిన నది అక్షయ్యమగును. ఈతదియరోహిణీ నక్షత్రముచేతను బుధవారముచేతనున్ను కలిసినచో మహాపుణ్యము నిచ్చునది. యీతదియయం

దుజపము హోమము మొదలగు కృత్యవిషయమై చెప్పబోవు యుగాదిదిన
మందువలె నిర్ణయము తెలియదగినది. ఈవైశాఖ శుక్లతదియకృతయుగాదియని
తెలియదగినది. ఇచ్చట యుగాది శ్రాద్ధము పిండరహితముగ చేయతగినది. శ్రాద్ధ
ముసంభవించక బోవుటయందు తిలతర్పణమైన నీదినమందు చేయతగినది. ఈయు
గాదికృత్యమునందు, మన్వాదిప్రకరణమున చెప్పబడిన నిర్ణయమే తెలియదగి
నది. ఈతృతీయయందు దేవతోద్దేశముచేతను పితృుద్దేశముచేతనున్ను పరమేశ్వ
రప్రీతికొరకు ఉదకకుంభదానము చేయదగినది. యుగాదియందు సముద్రస్నాన
ముచేయుట మహాఫలము నిచ్చునది. యుగాదియం దుపవాసము మహాఫలముని
చ్చునది. వైశాఖమాసము అధిక మాసమైనప్పుడు యుగాదిశ్రాద్ధము రెండుమా
సములయందు చేయతగినది. యుగాదిశ్రాద్ధమును చేయకబోవుటయందు నవస
ద్వావ, అని ఋక్కును నూరుమార్లు జపముచేయుట ప్రాయశ్చిత్తము. ఇదేతది
యపరశురామజయంతియని తెలియదగినది. ఇది రాత్రియందు ప్రథమయామ
మును వ్యాపించినది గ్రహించతగినది. పూర్వదినమందు మాత్రమే ప్రథమయా
మమును వ్యాపించుటయందు పూర్వదినము గ్రహించతగినది. రెండుదినముల
యందును రాత్రి ప్రథమయామమందు సమానముగ నైనను హెచ్చు తగ్గుగ
నైనను కొంతభాగమును వ్యాపించుటయందు పరదినమే గ్రహించతగినది. వైశా
ఖశుక్లసప్తమియందు గంగోత్పత్తియైనది. మధ్యాహ్నవ్యాపినియగు యీసప్తమి
యందు గంగాపూజనము చేయతగినది. రెండుదినములయందు మధ్యాహ్నమును
వ్యాపించుటయందు పూర్వదినమందున్న సప్తమి గ్రహించతగినది. వైశాఖమా
సమందు ద్వాదశియందు విష్ణుమూర్తిని పూజించవలయును అగ్నిష్టోమఫలము
నుబొందును. వైశాఖశుక్లచతుర్దశి నరసింహజయంతి యని తెలియవలెను. ఆచ
తుర్దశి సూర్యాస్తమయకాలమును వ్యాపించినది గ్రహించతగినది. రెండుదిన
ములయందు సూర్యాస్తమయ కాలమును వ్యాపించుటయందును వ్యాపించకపో
వుటయందున్ను పరదినమందున్నదే గ్రహించతగినది. స్వాతీనక్షత్రము శనివా
రము మొదలగుదానితో కలియుటయందు అది మిక్కిలి ప్రశస్తమైనది. పరది
నమందు బ్రాహ్మణులతోగూడ తిథ్యంతమందు పారణమునుచేయవలయును.
తిథి మూడుయామములకన్నను పైనన్ను వున్నపక్షమునకు ప్రాతఃకాలమునందే
చేయదగినది. వైశాఖపూర్ణిమయందు కృతాన్నసహితమైనయుదక కుంభదాన
ముచేత గోదానఫలముగలుగు. సువర్ణతిలలచే యుక్తమయిన పదిరెండు కుం





భములను దానముచేయుటవలన బ్రహ్మహత్యాపాపమువలన విడువంబడు. ఈది
నమందు శాస్త్రవిధానప్రకారముగ కృష్ణాజినదానముచేత భూదానఫలముగలు
గును. ఈదినమందు తిలస్నానము తిలహోమము తిలపాత్రదానము తిలతై
లముచేత దీపదానము తిలలచేత పితృతర్పణము తేనెతో యుక్తమైనదానము,
మహాఫలమునిచ్చునది.

వైశాఖశుక్లద్వాదశియందైనను పూర్ణిమయందైనను వైశాఖస్నానము
యొక్క ఉద్యాపనముచేయతగినది. ఇందుకు విధానమును ధర్మసింధువుయందు
చూడవలెను. ఈవైశాఖపూర్ణిమ మొదలుకొని జ్యేష్ఠశుక్లైకాదశీ పర్యంతము
జలమందున్న విష్ణుమూర్తియొక్క పూజోత్సవము చేయతగినది. వైశాఖామా
వాస్యభావుకదినము, అందుకు పరదినము కరిదినము, ఈరెండుదినములు శుభ
కార్యమునందు విడువతగినవి. ఇదివైశాఖమాస కృత్యనిర్ణయము ముగిసెను.

అనంతరము జ్యేష్ఠమాసమందు వ్రతాదినిర్ణయము చెప్పబడుచున్నది.
మిథునసంక్రాంతియందు పరమందున్న పదునారుఘడియలు పుణ్యకాలము. రా
త్రియందు సంక్రాంతియైనప్పుడయితే పూర్వమే నిర్ణయము చెప్పబడెను. జ్యేష్ఠ
మాసమందు పిండిచేత బ్రహ్మమూర్తినిచేసి వస్త్రములు మొదలగువాటిచే పూ
జింపవలయు. సూర్యలోక ప్రాప్తిగలుగును. జ్యేష్ఠశుక్లతదియయందు రంభావ్ర
తము చేయతగినది. ఆతదియపూర్వవిద్ధయైనది అనగా ద్వితీయతోకూడినది
గ్రహించతగినది. యెచ్చట పూర్వవిద్ధ గ్రహించతగినదిగా చెప్పబడుచున్నదో
అచ్చట అస్తమానమునకన్నను పూర్వము రెండుముహూర్తములకన్నను అధిక
ముగా వ్యాపించియున్నది గ్రహించతగినదిగాని తక్కువగానున్నది గ్రహించత
గదు. అచ్చటనున్న పరదినము సూర్యాస్తమానపర్యంతము పూర్వవిద్ధయగు తిథి
యున్నపుడు పూర్వవిద్ధనే గ్రహించవలయునని వచనమున్నప్పటికిన్ని పూర్వపద్ధను
విడిచి అఖండమగుటవల్లను శుద్ధయగుటవల్లనున్ను పరదినమందున్నదే గ్రహిం
చతగినది.

జ్యేష్ఠశుక్లదశమియందు గంగావతారము. ఇది దశహరా, అనుసంజ్ఞగ
లది. ఇచ్చట దశయోగము చెప్పబడినది. యెట్లన్నను, జ్యేష్ఠమాసము, ౧, శు
క్లపక్షము, ౨, దశమి, ౩, బుధవారము, ౪, హస్త, ౫, వ్యతీపాత, ౬, గ
రజ, ౭, ఆనందము, ౮, కన్యయందుచంద్రుడు, ౯, వృషభమందు సూర్యుడు,
౧౦, అని తెలియతగినది. బుధవారము హస్తనక్షత్రము కలిసితే ఆనందయో

గము, అని తెలియదగినది. ఇచ్చట దశమీ వ్యతీపాతలురెండు ముఖ్యములు. అందువలన యేదినమందు కొన్నియోగములుగల దశమి, పూర్వాహ్ణకాలమందు లభించుచున్నదో అపుడు దశహరావ్రతము చేయతగినది. రెండుదినములయందు పూర్వాహ్ణకాలమందు దశమియున్నపుడు యేదినమందు నీపదింటిలోపల అనేకములతో యోగముగలిగియుండునో అది గ్రహించతగినది. జ్యేష్ఠమాసము అధికమాసమైయుండగా ఆయధికమాసమునందే దశహరావ్రతము చేయతగినదిగాని నిజమాసమునందు చేయతగదు. "దశహరాసునోత్కర్షశ్చతుర్ష్వపియుగాదిషు" అను వచనము హేమాద్రియందుదహరింపబడియున్నందువల్లనని తెలియవలెను.

జ్యేష్ఠశుక్లైకాదశినిర్జలైకాదశియనంబడు. యీయేకాదశియందు నిత్యాచమనమునకు మాత్రముజలపానముచేసి ఇతరమగు జలపానమును చేయకబోవుట, యనునట్టియుపవాసమును చేయుటయందు పదిరెండు ఏకాదసులయందుపవాసమునుచేసినంత ఫలమువచ్చును. జ్యేష్ఠశుక్లద్వాదశియందు అహోరాత్రము త్రివిక్రమపూజను చేయుటవలన గవామయనము, అనుయజ్ఞము యొక్క ఫలసిద్ధియగుచున్నది. జ్యేష్ఠపూర్ణిమయందు తిలదానమువలన అశ్వమేధయజ్ఞఫలమువచ్చును. జ్యేష్ఠానక్షత్రముతో యుక్తమైన జ్యేష్ఠపూర్ణిమయందు ఛత్రములను పాదుకలను దానముచేయుటవలన రాజ్యమువచ్చును. జ్యేష్ఠపూర్ణిమయందువట సావిత్రీవ్రతము చేయతగినది. ఈవ్రతమందు త్రయోదశి మొదలగు మూడుదినములుపవాసము శక్తిలేకబోవుటయందయితే త్రయోదశియందునక్తము చతుర్దశియందు అయాచితము పూర్ణిమయందుపవాసము. ఇచ్చట చెప్పబోవు పూర్ణిమానిర్ణయము ననుసరించుటచేత పూర్ణిమయేదినమందు చేయదగియున్నదో, అట్టిపూర్ణిమ మూడవదిన మెట్లగుచున్నదో అట్లుత్రయోదశి మొదలగు మూడుదినములు గ్రహించతగినది. అచ్చట పూర్ణిమ సూర్యాస్తమానముకన్నను పూర్వము మూడుముహూర్తములకన్నను అధికముగా నున్నది చతుర్దశితోకూడినది గ్రహించతగినది. మూడుముహూర్తములకన్నను తక్కువగానున్నచో పరదినమందే గ్రహించతగినది. ఇచ్చట పారణము పూర్ణిమాంతమందు చేయతగినది. జ్యేష్ఠపూర్ణిమయందు జ్యేష్ఠానక్షత్రమందు బృహస్పతియు చంద్రుడున్ను రోహిణీనక్షత్రమందయితే సూర్యుడు అప్పుడు మహాజ్యేష్ఠియోగము, అచ్చట స్నానము దానముమొదలగునది చేయతగినది. ఈపూర్ణిమ.





యందు మన్వాది యగుటవలన పిండరహితమైన శ్రాద్ధము చేయతగినది. ఇచ్చట నిర్ణయము చైత్రమాస నిర్ణయమందు చెప్పబడినది. ఈమాసమందు బ్రాహ్మణులకొరకు చందనము వ్యజనముఉదకకలశము, మొదలగునది విష్ణుప్రీతికొరకు దానము చేయందగు ఇది జ్యేష్ఠమాసకృత్య నిర్ణయము ముగిసెను.

అనంతరము ఆషాఢమాసమందు వ్రతాదినిర్ణయము చెప్పబడుచున్నది. ఆషాఢమాసమందు దక్షిణాయనమను సంజ్ఞగల కర్కాటక సంక్రాంతి వచ్చుచున్నది. కర్కాటక సంక్రాంతియందు పూర్వము ముప్పదిఘడియలు పుణ్యకాలము. అందులోకూడ సంక్రాంతికి సమీపమందున్న ఘడియలు మిక్కిలి పుణ్యములు. రాత్రియందు అర్ధరాత్రికన్నను పూర్వమందున్ను పరమందున్ను సంక్రాంతియైనప్పుడుకూడ పూర్వదినమందు పుణ్యకాలము సూర్యోదయముపైన రెండు ఘడియలకన్నను పూర్వము సంక్రాంతియగుటయందు పరదినమందే పుణ్యకాలము. ఇచ్చట దానము ఉపవాసము మొదలగునది చేయందగు.

కర్కాటకము కన్యధనుస్సు కుంభము, ఈరాసులయందు సూర్యుడుండగా కేశకర్తనము మొదలగునది నిషిద్ధము. ఆషాఢమాసమందేక భక్తవ్రతమునుచేసితే బహుధనధాన్యప్రాప్తియు పుత్రప్రాప్తియు గలుగును. ఈమాసమందుపాదుకలు ఛత్రములు లవణము ఆమలకములు, ఇవి వామనమూర్తియొక్క ప్రీతికొరకు దానము చేయతగినవి. ఆషాఢశుక్లవిదియయందు శ్రీరామరథోత్సవముచేయతగినది. ఆషాఢమందు శుక్ల దశమియు పూర్ణిమయు మన్వాదియని తెలియదగినది. ఆషాఢశుక్లైకాదశియందు విష్ణుశయనోత్సవము చేయదగినది. అచ్చట పరుపుమొదలగుదానితో యుక్తమగు, రజతాది నిర్మితమైన మంచమందు, శయనించినట్టి శంఖాదిచతురాయుధములుగల, లక్ష్మీదేవిచేత వహింపబడినట్టి పాదములుగల, శ్రీవిష్ణు ప్రతిమను అనేకవిధములగు షోడశోపచారములచేత పూజచేయవలయు. ఆదినముపవాసముచేసి జాగరణమునుచేసి ద్వాదశియందు మరల పూజించి త్రయోదశియందు గీతము నృత్యము వాద్యము మొదలగు ఉత్సవమునుచేసి సమర్పించవలయును. ఈప్రకారమీ వ్రతము మూడుదినములచే సాధించతగినది. ఈవ్రతము అధికమాసమందు చేయతగదు. అనూరాధాప్రథమపాదముతో కలవకయున్న కాలమందు ద్వాదశియందు పారణముచేయతగినది. ఈయేకాదశియందే చాతుర్మాస్యవ్రతారంభము చేయతగినది. చాతుర్మాస్యవ్రతప్రారంభము గురుశుక్రమూఢము మొదలగు దానియందున్ను ఆశౌచ

ము మొదలగుదానియందున్ను చేయతగదు. రెండవది మొదలగు పర్యాయము నందారంభమయితే చేయతగును. ఈచాతుర్మాస్యవ్రతము శైవాదులుచేత గూడ చేయతగినది.

ఆషాఢశుక్లైకాదశి మొదలుకొని కార్తీకశుక్లద్వాదశిపర్యంతము చాతుర్మాస్యవ్రతమని తెలియందగు. ఈనాలుగుమాసములయందు హవిష్యాన్నమును అనగా హవిష్యద్రవ్యములను భక్షించవలయు. ఆషాఢశుక్లద్వాదశియందు శాకవర్జనవ్రతమును ఆరంభించి శ్రావణశుక్లద్వాదశివరకు చేయవలయును. ఆషాఢశుక్లద్వాదశియందు వామనపూజనముచేత నరమేధయజ్ఞముగలుగును. పూర్వాషాఢనక్షత్రముతోయుక్తమైన పూర్ణిమయందు అన్నముపానము మొదలగు దానిని దానముచేయుటచేత అక్షయ్యాన్నము మొదలగుదాని యొక్క ప్రాప్తిగలుగును. ప్రదోషకాలమును వ్యాపించినట్టి ఇదేపూర్ణిమయందు శ్రీశివునికిశయనోత్సవము చేయతగినది ఆషాఢపూర్ణిమయందైనను, శ్రావణపూర్ణిమయందైనను, శుక్లచతుర్దశియందైనను, శుక్లాష్టమియందైనను, శివునికి పవిత్రారోపణమునుచేయవలెను. పూర్ణిమయందు సన్యాసులకు చాతుర్మాస్యావాసనంకల్పాంగముగుటచేత క్షౌరమువ్యాసపూజమొదలగునది చేయతగినది. ఈకర్మయందు ఉదయకాలమును వ్యాపించినట్టి మూడుముహూర్తములుగానున్న పూర్ణిమ గ్రహించతగినది. చాతుర్మాస్యముయొక్క మధ్యభాగమందు యతివపనమును వర్జించవలయు. ఈనాలుగుమాసములున్ను యతినిరంతరమొక్కచోటనే యుండవలయును. అందులో మొదట క్షౌరకర్మనుచేసి ద్వాదశమృత్తికాస్నానములను ప్రాణాయామము మొదలగు విధానమునున్ను చేసి వ్యాసపూజను చేయవలయు. ఆషాఢకృష్ణవిదియయందు అశూన్యశయనవ్రతమును చేయవలయు. ఈవ్రతమందు లక్ష్మీయుక్తుడైన విష్ణువునుపర్యంకమందు పూజించవలయు. ఈవ్రతమందు రాత్రియందు చంద్రునికి అర్ఘ్యమునిచ్చి నక్తభోజనమునుచేయవలయు. ఇదే ప్రకారము నాలుగుమాసములయందు బహుళవిదియలయందు యీవ్రతమును చేసిపత్నీసహితుడగు విప్రవరునికొంకు శయ్యాదానమును, దక్షిణాలంకారసహితమైనప్రతిమాదానమున్నున్ను, చేయవలయు. ఈవ్రతమును చేయుటవలన అక్షయ్యమైనదాంపత్యమున్ను సుఖమున్ను సదాపుత్రధనాదులున్ను సర్వదాగార్హస్థ్యమున్ను యేడుజన్మములయందు గలుగుచున్నది. ఈవ్రతమందు చంద్రోదయవ్యాపినియగుతిథిగ్రహించతగినది. రెండుదినములయందు విదియయున్నపుడున్ను





లేకపోవుటయందున్ను పరదినమందే చేయతగినది. ఇది ఆషాఢమాసకృత్యనిర్ణయము ముగిసెను.

అనంతరము శ్రావణమాసమందు వ్రతాదినిర్ణయముచెప్పబడుచున్నది. సింహసంక్రాంతియందు పరములగుపదునారుఘడియలు పుణ్యకాలము రాత్రియందు సంక్రాంతియైనప్పుడయితే నిర్ణయముపూర్వమేచెప్పబడెను. ఈమాసమందు ఏకభక్తవ్రతము నక్తవ్రతము విష్ణుశివాదులకు అభిషేకమున్ను చేయందగును. శ్రావణమాసమునందు యథావిధిగసోమవార వ్రతముచేయదగినది. శక్తిగలవానిచేత ఉపవాసముచేయతగినది. లేకనక్తభోజనముచేయదగినది. ఈ ప్రకారము శ్రావణమాసమందు మంగళవారమందు గౌరీపూజకూడచేయతగినది శ్రావణశుక్లచవితి మధ్యాహ్నవ్యాపిని పూర్వదినముతో యుక్తమైనది గ్రహించతగినది. శ్రావణ శుక్లపంచమి నాగపంచమియని తెలియవలెను. ఇది యుదయకాలమందు మూడుముహూర్తములు వ్యాపించినదై పరదినవిద్ధమైనది గ్రహించతగినది. పరదినమందు పంచమి మూడు ముహూర్తములకన్నను తక్కువగా నున్నదై పూర్వదినమందు మూడుముహూర్తములకన్నను తక్కువగానుండిన చవితితో కూడియుండగా నపుడు పూర్వదినమందే గ్రహించతగినది. మూడుముహూర్తములకన్న నధికముగ నున్న చవితితో కూడియున్నపుడు రెండుముహూర్తములుగ నున్నను పరదినమందున్నదే గ్రహించతగినది. పరదినమందు ముహూర్తమాత్రమున్నచో నది గ్రహించతగదు. ఈపంచమియందు నాగములను పూజించవలయు. శ్రావణ శుక్లద్వాదశియందు, మాసమునుంచి చేయబడిన శాకవ్రతము సాంగమగుటకై బ్రాహ్మనునికి శాకదానమును చేయవలయు. అనంతరము శ్రావణశుక్ల ద్వాదశి మొదలు భాద్రపద శుక్లద్వాదశివరకు దధివర్జనవ్రతమును చేయవలయు. శ్రావణశుక్ల ద్వాదశియందు పారణదినమందు విష్ణుమూర్తికి పవిత్రారోపణమును చేయవలయు. పారణదినమందుద్వాదశి లేకపోవుటయందు త్రయోదశియందు పారణదినమందు చేయతగినది. అదినమునందు యేదోవకహేతువుచేతఅసంభవమందు శ్రవణనక్షత్రమందు పూర్ణిమయందు చేయతగినది. శివునికి పవిత్రారోపణమయితే చతుర్దశియందైనను పూర్ణిమయందైనను అష్టమియందయినను పూర్ణిమయందైనను చేయవలయు. యీప్రకారము దేవీగణేశ దుర్గాదిదేవతలకుచవితి తదియనవమి, అనుతిథులు కులాచారము ననుసరించి గ్రహించతగినవి. ఆయాతిథులయందు సంభవించక

బోవుటయందు సమస్తదేవతలకు శ్రావణపూర్ణిమయందైనను చేయవలయు. ఆదినమందు సంభవించకబోవుటయందు కార్తికపూర్ణిమవరకు గౌణకాలము తెలియదగినది. ఈపవిత్రారోపణము "అకుర్వాణోవ్రజత్యధః తస్యసాంవత్సరీపూజానిష్ఫలా" అని వచనమువల్ల నిత్యమైనది. గౌణకాలమునందుకూడ చేయకబోవుటయందు "తదాయుతం జపేన్మంత్రం స్తోత్రంవాపిసమాహితః" అని వచనమువల్ల పదివేలుసంఖ్యగా ఆదేవతయొక్క మూలమంత్రజపము ప్రాయశ్చిత్తముచేయతగినది. అచ్చట పూర్వదినమందు అధివాసనమున్ను పరదినమందు పవిత్రారోపణమున్ను రెండుదినములయందు సంభవించకబోవుటయందు తత్కాలాధివాసనపూర్వకమైన పవిత్రారోపణమున్ను చేయతగినది.

అనంతరము ఉపాకర్మకు కాలము చెప్పబడుచున్నది అచ్చట ఋగ్వేదులకు శ్రావణశుక్లపక్షమందు శ్రవణనక్షత్రము పంచమి హస్తనక్షత్రము, అనిమూడుకాలములు తెలియదగినవి. అందులో శ్రవణనక్షత్రము ముఖ్యకాలము. అది దొరకనపుడు పంచమి మొదలగు కాలము తెలియదగినది. అందులో రెండుదినములయందు శ్రవణమున్నపుడు పూర్వదినమునందు సూర్యోదయము మొదలుకొని ప్రవృత్తించిన శ్రవణనక్షత్రము రెండవదినమందు సూర్యోదయముపైన మూడుముహూర్తములున్నట్టులయితే అప్పుడు ధనిష్ఠాయోగప్రశస్తత్వమువలన పరదినమందే ఉపాకర్మచేయతగినది. పరదినమందు మూడుముహూర్తములకన్నను తక్కువగానున్నచో సంపూర్ణవ్యాప్తియుండుటవలన పూర్వదినమందే చేయతగినది. ఎప్పుడయితే పూర్వదినమందు సూర్యోదయమున లేకయున్నదై పరదినమునందు సూర్యోదయానంతరము రెండుముహూర్తములున్నట్టులయితే అప్పుడుపరదినమందేచేయతగినది. ఇందుకుకారణము ఉత్తరాషాఢా విద్ధకునిషేధమేనని తెలియదగినది. పరదినమందు రెండుముహూర్తములకన్నను తక్కువగానున్నదై పూర్వదినమందుఉత్తరాషాఢానక్షత్రముతో వేధయుండగానపుడు పంచమిమొదలగుకాలము గ్రహించతగినది. పంచమిహస్తనక్షత్రము, అనిరెండుకాలములు ఉదయకాలమునందున్నవి మూడుముహూర్తములు వ్యాపించియున్నవి గ్రహించతగినవి. ఇట్లు గ్రహించుటకు దొరకకున్నపుడు పూర్వవిద్ధమైనది గ్రహించతగినది. ఈప్రకారముభాద్రపద శుక్లపక్షమందుకూడ శ్రవణము పంచమిహస్త, అని మూడుకాలములయొక్క నిర్ణయము తెలియదగినది. అచ్చట ఋగ్వేదులచేత పూర్వాహ్ణమందుపాకర్మముచేయతగినది.





అనంతరము యజుర్వేదులకు వుపాకర్మకాలము చెప్పబడుచున్నది. ఋగ్వేదులకు శ్రవణనక్షత్రము యెట్లు ముఖ్యకాలమోసర్వయజుశ్శాఖాజనితులకు నట్లనే శ్రావణపూర్ణిమ ముఖ్యకాలము. పూర్ణిమఖండ తిథియయివుండగా అనగా సంపూర్ణముగా వ్యాపించక దినమును కొంతభాగము వ్యాపించియుండగా నిర్ణయమేమన్నను, అచ్చట పూర్ణిమ పూర్వదినమందు వకముహూర్తము పైన నెప్పుడైనను ఆరంభించి రెండవదినమందు ఆరుముహూర్తములు వ్యాపించినదయితే సర్వయజుశ్శాఖాజనితులచేత పరదినమే ఉపాకర్మము చేయతగినది— పూర్ణిమశుద్ధతిథియయి ఆదినము అహోరాత్రముండినదై పరదినమందు కూడ సూర్యోదయకాలమును వ్యాపించి యుండినదయితే అపుడు సర్వయజుశ్శాఖాజనితులచేత పూర్వదినమే ఉపాకర్మము చేయదగినది. పూర్వదినమందు వక ముహూర్తముపైన నెప్పుడైనను ఆరంభించినదై రెండవదినమందు రెండుముహూర్తములు గాని మూడుముహూర్తములుగాని వ్యాపించినదై ఆరుముహూర్తములకన్నను తక్కువగానుండగా నప్పుడు తైత్తిరీయులచేత పరదినమున్ను తైత్తిరీయశాఖకన్న నితరశాఖలయందు జనియించిన వారిచేత పూర్వదినమున్ను గ్రహించ తగినది. పూర్వదినమందు వకముహూర్తముపైన నెపుడైనను ఆరంభించినదై రెండవ దినమందురెండుముహూర్తములకన్నను తక్కువగానుండినను క్షయవశమువలన బొత్తిగాలేకపోయినను, అప్పుడు సర్వయజుశ్శాఖా జనితులచేత పూర్వదినమే చేయదగినది. హిరణ్యకేశులు, తైత్తిరీయులు, వీరలకు మాత్రము శ్రావణపూర్ణిమముఖ్యకాలము. అది దొరకనపుడు శ్రావణమాసమున హస్తనక్షత్రము గ్రహించ తగినది. శ్రావణశుక్లపంచమి తత్సూత్రములయందు చెప్పకబోవుటవలన గ్రహించతగదు. భాద్రపదమాసమందు కూడ పూర్ణిమహస్తనక్షత్రము, అనునీరెండుకాలములే గ్రహించితగినవని విశేషము. ఆపస్తంబులకు శ్రావణపూర్ణిమముఖ్యకాలము అది సంభవించక బోవుటయందు భాద్రపదబూర్ణిమయని విశేషము తెలియదగినది. బౌధాయనులకు శ్రావణపూర్ణిమముఖ్యకాలము దోషముండుటచేత అది సంభవించక బోవుటయందు ఆషాడపూర్ణిమ గ్రహించ తగినదని విశేషము తెలియవగినది.

అనంతరము కాణ్వులు మాధ్యందినులు మొదలగు కాత్యాయనసూత్రజనితులకు యీసామాన్య నిర్ణయముగాక విశేషనిర్ణయమేమన్నను, శ్రవణనక్షత్రయుక్తమైన శ్రావణపూర్ణిమయైనను కేవల పూర్ణిమయైనను హస్తానక్షత్రయుక్తమైన పంచమియైనను కేవలపంచమి యైనను ముఖ్యకాలము. శ్రావణమాసమందు యేదో విఘ్నమువలన ఉపాకర్మము జరగకయుండగా భాద్రపదమాసగతపూర్ణిమా పంచములయందు జేయతగినది.

అనంతరము సామవేదుల కుపాకర్మకాలము చెప్పబడుచున్నది. భాద్రపదశుక్లపక్షమందు హస్తనక్షత్రము ముఖ్యకాలము. సంక్రాంతి మొదలగుదోషముచేత భాద్రపదమందు సంభవించక బోవుటయందు శ్రావణమాసమున హస్తనక్షత్రము గ్రహించతగినదని నిర్ణయ సింధువుయందు చెప్పబడినది. హస్తనక్షత్రము ఖండ నక్షత్రము అయి వుండగా రెండు దినములయందు అపరాహ్ణకాలమును పూర్తిగా వ్యాపించి యుండినను అపరాహ్ణములో వకభాగమునువ్యాపించియుండినను, పరదినమందే ఉపాకర్మముచేయగగినది- పూర్వదినమందుమాత్రము అపరాహ్ణకాలమును పూర్తిగావ్యాపించియుండుటయందు పూర్వదినమందే ఉపాకర్మముచేయ దగినది- సామవేదులకు అపరాహ్ణకాలము ఉపాకర్మకాలమనిశాస్త్రిమువలన పూర్వదినమందే అపరాహ్ణకాలమును హస్తనక్షత్రముస్పృశించుట యందైనను, రెండుదినముల యందున్న అపరాహ్ణకాలమును స్పృశించకబోవుటయందైనను, పరదినమందేఉపాకర్మము - సామవేదులకు సింహమందు సూర్యుడుండగా నుపాకర్మవిధానమయితేనో శ్రావణ మాసమందు హస్తనక్షత్రమైనను పూర్ణిమయైనను సూర్యుడుసింహమందుండగా సంభవించినట్లయితే అపుడుసింహమందు సూర్యుడుండగా నుపాకర్మమును చేయవలయును గాని కర్కాటకమందు సూర్యుడుండగా నుపాకర్మను చేయరాదని విచారించి శ్రావణమాసగతములైన హస్తపూర్ణిమలయొక్క వ్యవస్థనుగురించినదని తెలియవలయు - ఇతరశాఖాజనితులకు సూర్యుడుసింహమందున్నపుడు ఉపాకర్మకువిధిగానినిషేధముకానిలేదు.

అనంతరము అథర్వవేదులకు ఉపాకర్మకాలముచెప్పబడుచున్నది. శ్రావణపూర్ణిమయందైనను భాద్రపదపూర్ణిమయందైనను, ఉపాకర్మముచేయదగినది





పూర్ణిమఖండతిథియయివుండగా సూర్యోదయకాలముననున్నదియైసంగవకాలమునువ్యాపించియున్నతిథిగ్రహించతగినది.

అనంతరముసమస్త వేదశాఖాజనితులకు ఉపాకర్మవిషయమును గురించి సాధారణమైన నిర్ణయము చెప్పబడుచున్నది. శ్రావణభాద్రపద మాసములయందున్నట్టితమతమ గృహ్యసూత్రముల యందుచెప్పబడిన కాలములయందుగ్రహణము, సంక్రాంతి, ఆశౌచము, మొదలగుదోషములు సంభవించుట యందు సర్వప్రకారములుగా ఉపాకర్మలోపము ప్రాప్తించుచుండగా ఇతరశాఖాజనితులనుగురించి చెప్పియున్నకాలములయం దుపాకర్మనుచేయవలెను. అచ్చటఆపస్తంబులుబౌధాయినులు సామవేదులు మొదలగువారికి శ్రావణభాద్రపద మాసములయందున్న పంచమిపూర్ణిమమొదలగుదానికి కూడసామాన్యముగ గ్రహించుట ప్రాప్తించియుండగా, నర్మదానదియొక్క ఉత్తరదేశమందు సూర్యుడు సింహమందుండగాపంచమిమొదలగు దానికిగ్రహణమనియు, నర్మదాదక్షిణ భాగమందు సూర్యుడు కర్కాటకమందుండగా శ్రావణపంచమి మొదలగుదానికి గ్రహణమనియు, వ్యవస్థకౌస్తుభగ్రంథమందు చెప్పబడియున్నది. సమస్తశాఖాజనితులచేతశ్రావణమాసముయొక్క ముఖ్యకాలమందు వర్షములేకబోవుటచేతయెర్రనివడ్లు మొదలగు ఔషధులయొక్క ప్రాదుర్భావములేకబోవుట గాని, ఆశౌచము మొదలగునదిగాని, సంభవించితేభాద్రపదమాసమందు శ్రవణనక్షత్రము మొదలగుదానియందు చేయతగినది. సర్వశాఖాజనితులకు గృహ్యసూత్రముల యందుచెప్పబడినముఖ్యకాలదినమందు గ్రహణముగాని సంక్రాంతిగానియున్నపుడు గ్రహణముసంక్రాంతిలేనట్టిపంచమి మొదలగునవి గ్రహించతగినవి. గ్రహణము, సంక్రాంతి, అనుదానియొక్క యోగమయితే ఉపాకర్మసంబంధముగల అహోరాత్రమందున్నదైఆదినముఅర్ధరాత్రికన్నను పూర్వము గడచిన దినముఅర్ధరాత్రికన్నను పైనను, అనియెనిమిది యామముల యందున్నదై, శ్రవణనక్షత్రము పూర్ణిమ మొదలగు తిథులచేతస్పృశించక బోయినప్పటికిని ఉపాకర్మకు దోషమును గలుగజేయునదని తెలియవలయు. నూతనముగాయుపనయనముజేయబడినవారికి ప్రథమోపాకర్మమును గురుశుక్రుల అస్తమానముమొదలగు కాలమందున్ను అధికమాసము. మొదలగుదానియందున్ను గురువుసింహమందుండగనున్ను చేయరాదు. రెండవపర్యాయము మొదలగుచోట ఉపాకర్మము అయితే అస్తమానము

మొదలగు కాలమందు కూడ చేయదగినది. మలమాసమందయితే రెండవపర్యాయము మొదలగుచోట ఉపాకర్మము కూడ చేయరాదు. నూతనోపనీతులకు శ్రావణమాసమందున్నట్టి పంచమి, హస్త, శ్రవణము, మొదలగు కాలములయందు గురుశుక్రుల అస్తమానము మొదలగు ప్రతిబంధముచేత ఉపాకర్మము యొక్క ఆరంభము లేకపోవుటయందు భాద్రపదమాసమందున్న పంచమి శ్రవణమొదలగునవి గ్రహించతగినవి—"ఉపాకర్మదినేథవా" అని వచనము ననుసరించి ప్రకృతము సర్వశిష్టులు ఉపాకర్మదినమందే ఉత్సర్జన కర్మనుచేయుచున్నారుగాన ఉత్సర్జన కాలనిర్ణయమును శాస్త్రానుసారము వేరుగా వ్రాయుటవలన యుపయోగములేదని వ్రాయము—ఈ ఉపాకర్మోత్సర్జనములు రెండున్ను ఇతర బ్రాహ్మణులతో గూడ కలిసి చేయునట్టి విషయమందు అప్పుడు లౌకికాగ్నియందు చేయవలయు. వకడేచేయు విషయమందు అప్పుడు తన స్మార్తాగ్నియందు చేయవలయు. కాత్యాయనులచేతనయితే స్మార్తాగ్నియందే హోమము చేయవలెనుగాని లౌకికాగ్నియందు హోమము చేయరాదు. ఈ ఉపాకర్మోత్సర్జనములను చేయకపోవుటయందు దోషముగలదు గనుక నీరెండు నిత్యములనుటకు "ఉపాకర్మోత్సర్జనంచపవిత్రదమనార్పణే" అని వచనముగలదు. కాబట్టి ప్రతి సంవత్సర మీరెండు చేయదగినవి. ఈ ఉపాకర్మోత్సర్జనములయందు ప్రయోగము తమతమ గృహ్యసూత్రము ననుసరించి తెలియందగును. ఈ యుపాకర్మవిషయమందు నదులకు రజోదోషములేదు. ఉపాకర్మదినమందు బ్రహ్మాది దేవతలున్ను ఋషులు మొదలగువారికిన్ని జలమందు సాన్నిధ్యముగలదు. ఆకారణమువలన నదులయందు స్నానము జేయుటచేత సమస్తదోషక్షయము గలుగును. ఋషిపూజన స్థానమందున్న జలమును స్పృశించుటచేతనుపానము జేయుటచేతను సర్వకామ ప్రాప్తిగలుగును.

శ్రావణపూర్ణిమయందు ఆశ్వలాయనులు శ్రవణాకర్మ, సర్పబలి, ఈ రెండిటిని రాత్రియందు చేయవలయు. తైత్తిరీయులు సర్పబలినిమాత్రమే చేయవలెను. కాత్యాయనులున్ను సామవేదులున్ను శ్రవణాకర్మ, సర్పబలి అను నీరెండిటిని చేయవలయు. శ్రవణాకర్మ, సర్పబలి, ఆశ్వయుజీకర్మ, ప్రత్యవరోహణము మొదలగు పాకసంస్థకర్మలను తమతమ కాలములయందు చేయకపోవుటయందు ప్రాజాపత్యకృఛ్రము ప్రాయశ్చిత్తమును చేయవలయునుగాని కా





లాంతరమందు ఆకర్మలను చేయరాదు. శ్రవణాకర్మ మొదలగు పాకసంస్థకర్మలు భార్య ఋతుమతియైయున్నపుడు గూడచేయవలయును. ప్రథమారంభమునయితె చేయరాదు. ఈ విషయమందు పూర్ణిమ, అస్తమానము మొదలుకొని కర్మనుచేయుటకు చాలినంతకాలమును పూర్వదినమందు వ్యాపించియున్నదయితె పూర్వదినము గ్రహించతగినది. అట్లులేక పూర్ణిమ మరి యేవిధముగనున్నను పరదినమే గ్రహించతగినది. ప్రయోగము తమతమ సూత్రములయందుచూచి తెలియతగినది.

శ్రావణ కృష్ణాష్టమియందు జన్మాష్ట మీవ్రతము చేయదగినది. ఆయష్టమి శుద్ధాష్టమి, విద్ధాష్టమి, అని రెండువిధములు. పగటియందుగాని రాత్రియందుగాని యేదినమందు సప్తమితో గూడకయుండునో ఆదినమందష్టమి శుద్ధయనంబడు. పగటియందుగాని రాత్రియందుగాని యేదినమందు సప్తమితో గూడియుండునో ఆదినమందష్టమివిద్ధయనంబడు. ఆవిద్ధాష్టమికూడ రెండువిధములు. రోహిణీనక్షత్రముతో గూడినది, రోహిణితో కూడనది, యని తెలియవలయు. శుద్ధయై అధికముగానున్న కేవలాష్టమియందు పూర్వదినమే గ్రహించతగినది. విద్ధయై అధికముగానున్న అష్టమి అయితె పూర్వదినమందే అర్ధరాత్రిని వ్యాపించి యుండగా పూర్వదినము గ్రహించతగినది. రెండుదినములయందున్ను అర్ధరాత్రిని వ్యాపించి యున్నను, వ్యాపించక పోయినను, పరదినమే గ్రహించ తగినది. అనంతరము రోహిణితో యోగమగుట యందు శుద్ధయై సమముగానున్న అష్టమియందైనను శుద్ధియై న్యూనముగానున్న అష్టమియందైనను కొంచమైనా రోహిణీయోగమైతె అచ్చట సందేహములేదు. శుద్ధయైఅధికముగానున్న అష్టమియందు, పూర్వదినమందుగాని రెండుదినములయందుగాని రోహిణియోగమయితె పరదినమందు గ్రహించతగినది. శుద్ధయై అధికముగానున్న అష్టమియందు పరదినమందే రోహిణీనక్షత్ర యోగముండుటయందు అష్టమి ముహూర్తమాత్రముగనున్నను పరదినమే గ్రహించతగినది. విద్ధయైఅధికముగానున్న అష్టమియందు, పూర్వదినమందే అర్ధరాత్రి కన్నను పూర్వమైనను అర్ధరాత్రియందైనను రోహిణీయోగమందు పూర్వదినమే గ్రహించతగినది. రెండుదినములయందున్ను అనను పరదినమందు మాత్రమే అయినను, అర్ధరాత్రియందు గాని అర్ధరాత్రికన్న నితరకాలమందుగాని రోహిణీయోగమందు పర

దినమేనని తెలియదగినది. ఈప్రకారము కౌస్తుభాది నవీనగ్రంథములయందుమా ధవాచార్యమతము ననుసరించి చెప్పబడినది. ఇచ్చట జన్మాష్టమీ వ్రతముజయంతి వ్రతములని రెండువ్రతములు గలవు. అష్టమికి రోహిణీయోగములేని సంవత్సరమునందు జయంతి వ్రతములోపించుచున్నది. ఆసంవత్సరమందు జన్మాష్టమీ వ్రతమే చేయతగినది. అష్టమికి కొంచమైనను రోహిణియోగ మేసంవత్సరమందుగలిగియుండునో, ఆసంవత్సరము జయంతీవ్రతము గలదు "యస్మిన్వర్షే జయంత్యాఖ్య యోగోజన్మాష్టమీ తథా। అంతర్భూతాజయంత్యాం స్యాద్ధృక్షయోగ ప్రశస్తతః" అని మాధవాచార్య వచనాను సారముగా నేసంవత్సరమునందు జయంతీయోగము గలదో ఆసంవత్సరమందు జయంతీ వ్రతాంతర్భావముగాజన్మాష్టమీవ్రతము చేయదగినది అనగాజయంతీదినమందు అర్ధరాత్రియనెడుకర్మకాలమునందు అష్టమిమొదలగునది లేకబోయినప్పటికిన్ని "యాంతిథింసమనుప్రాప్య ఉదయంయాతి భాస్కరః। సాతిథిఃసకలాజ్ఞేయాదానాధ్యయన కర్మసు" అనెడి సాకల్యవచనముచేత కర్మకాలవ్యాప్తిగలదని భావించి రెండువ్రతములున్ను తంత్రముతో చేయదగినవి. రెండు వ్రతములనున్ను చేయక బోతేమహాదోషముగలదు, చేసితేమహాఫలముగలదు, గాబట్టియీరెండువ్రతములున్ను నిత్యములుకామ్యములున్ను అగుచున్నవి. ఈవ్రతమందు బుధసోమ వారములయొక్కయోగము ప్రశస్తతను గలుగజేయునదేగాని రోహిణీనక్షత్రమువలె వ్రతదినమును నిర్ణయించునది గాదు ఈవ్రతమందు శ్రీకృష్ణపూజా విధానముప్రయోగధర్మశాస్త్రి గ్రంథములయందు చూడవలయును.

అనంతరము రెండవదినమందు భోజనరూపమైన పారణము వ్రతాంగముగాచెప్పబడినది. దానియొక్కకాలము నిర్ణయింపబడుచున్నది. కేవలతిథియందుపవాసమును చేసియుండగాతిథివెళ్లిపోయిన పిమ్మటను, నక్షత్రముతో యుక్తమైనతిథియందుపవాసమును చేసియుండగా ఆరెండువెళ్లిపోయిన పిమ్మటను, పారణమునుచేయవలయు. యెప్పుడయితే తిథినక్షత్రములలో నొక్కటి పగలువెళ్లిపోవునో, ఆరెండు వెళ్లిపోవలయునంటే రాత్రియందు సంభవించునున్నదో, అపుడు పగటియందేరెండింటిలో నొక్కటివెళ్లిపోయిన పిమ్మటపారణమును చేయవలయు. యెప్పుడయితే పగటి యందొక్కటైనను వెళ్లిపోవుటలేదో అపుడుఅర్ధరాత్రికన్నను పూర్వమువక్కటి వెళ్లిపోయినపిమ్మటనైనను, రెండువెళ్లిపోయినపిమ్మటనైనను, పారణమును చేయవలయు. యెప్పుడయితేనిశీథకాలముచేత న్యవధానములేనట్టిపూర్వక్షణమందు వక్కటివెళ్లిపోవునో, లేకరెండును వెళ్లిపోవునో, అపుడునిశీథమందైనప్పటికిన్ని పారణమును చేయవలెను.





శ్రావణఅమావాస్యయందు పరిశుద్ధుడై దర్భలను తీసికొనిరావలయును. వాడనటువంటి ఆదర్భలనేమరలవాడుచుండ వలయును ఇట్లు చెప్పుటచేత వాడిన దర్భలను వాడరాదు. బ్రాహ్మణునికి నాలుగుదర్భలచేతను క్షత్రియునికి మూడు దర్భలచేతను, వైశ్యునికి రెండు దర్భలచేతను, శూద్రునికి వకదర్భచేతను పవిత్రమును చేయవలయు. అట్లుగాక సర్వవర్ణములవారికి రెండు దర్భలచేతనయినను పవిత్రమును చేయవలయు.

అనంతరము భాద్రపదమాసమందున్న వ్రతాదులయొక్క నిర్ణయము చెప్పబడుచున్నది. కన్యాసంక్రాంతియందు సంక్రాంతికన్నను పరమందు పదునారుఘడియలు పుణ్యకాలము. భాద్రపదమాసమందు ఏకాన్నాహార వ్రతమువలన ధనము ఆరోగ్యము మొదలగు ఫలముగలుగును. ఈ మాసమందు హృషీకేశ ప్రీతికొరకు గుడౌదనము లవణము మొదలగు దానియొక్క దానముచేయతగినది. భాద్రపద శుక్లతదియయందు హరితాళికా వ్రతము చేయవలెను. ఈవ్రతమందు తదియముహూర్తమునకన్న తక్కువగానున్నదైనా, పరదినమందే గ్రహించతగినది. శుద్ధాధికయగు తదియయందుకూడ అరువై ఘడియలుగల తదియనువిడిచి పరదినమందు శేషించిన తదియ గ్రహించతగినది. యీవ్రతమందు భవానీశివులయొక్క పూజయు ఉపవాసమున్ను స్త్రీలకు నిత్యమైనది. శుక్లచవితియందు వరసిద్ధి వినాయక వ్రతము చేయునది. ఆచవితి మధ్యాహ్నవ్యాపి నిగ్రహించతగినది. రెండుదినములు పూర్తిగా వ్యాపించినను కొంచమైనను వ్యాపించకబోయినను పూర్వదినము గ్రహించతగినది. రెండుదినములయందు సమముగనైనను హెచ్చుతక్కువగనైనను, వ్యాపించుటయందు కూడ పూర్వదినము గ్రహించతగినది. పూర్వదినమందు కొంచమైనను మధ్యాహ్నస్పర్శలేక పరదినమందు మాత్రమే మధ్యాహ్న స్పర్శగలిగియుండగా, పరదినమేగ్రహించ తగినది. పూర్వదినమునందు కొంతభాగము మధ్యాహ్నమును వ్యాపించినదై పరదినమందు సంపూర్ణముగ మధ్యాహ్నమును వ్యాపించినదయితే అపుడు పరదినమే గ్రహించతగినది. ఈప్రకారము మాసాంతరమందు కూడ

నిర్ణయమును తెలియవలయు. ఈచవితి ఆదివార భౌమవారములతో కూడితే ప్రశస్తమైనది. ఈచవితియందు చంద్రదర్శనముగలిగితే మిథ్యాపవాదదోషముగ గలుగును. చంద్రదర్శనము గలిగితే, ఆదోషము పోవుటకై "సింహః ప్రసేనమవధీత్సింహోజాంబవతాహతః। సుకుమారక మారోదీ స్తవహ్యేషస్యమంతకః" అనెడు శ్లోకముయొక్క జపమును చేయవలయును ఈవ్రతమందు విఘ్నేశ్వర పూజావిధానమును కల్పమందు చూడవలెను. భాద్రపద శుక్లపంచమి ఋషిపంచమి గనుగ ఋషిపూజనమునుచేసి కర్షణాదిరహితమైన భూమియందు జనించినశాకమునే ఆహారముచేయవలెను. ఈపంచమి మధ్యాహ్న వ్యాపిని గ్రహించతగినది. రెండుదినములయందు మధ్యాహ్నమును వ్యాపించినను, మధ్యాహ్నమును వ్యాపించకబోయినను, పూర్వదినమే గ్రహించదగినది. భాద్రపదశుక్లషష్ఠిసూర్యషష్ఠియని తెలియునది. ఈషష్ఠిసప్తమితో కూడినది గ్రహించతగినది. యీదినమందు సూర్యపూజనమును పంచగవ్య ప్రాశనమునున్ను చేయుటవలన అశ్వమేధయజ్ఞఫలము గలుగును. ఈషష్ఠియందే, షణ్ముఖస్వామి దర్శనమువలన బ్రహ్మహత్యాది పాపనాశనము గలుగును. భాద్రపదశుక్లాష్టమి దూర్వాష్టమియని తెలియదగినది. అది పూర్వదినమందున్నది గ్రహించతగినది. ఈఅష్టమిజ్యేష్ఠామూలనక్షత్రములతో కూడినదయినను, అట్టిదిదొరకనపుడు కేవలాష్టమియైనను గ్రహించతగినది. ఈదూర్వాపూజనవ్రతముకన్యయందుసూర్యుడుండగను, ఆగస్త్యోదయమైవుండగనున్ను, వర్జించతగినది. ఈవ్రతము స్త్రీలకు నిత్యమైనది. ఈఅష్టమియందు కేవలాష్టమీప్రాధాన్యము చేతనైనను, కేవలజ్యేష్ఠానక్షత్రప్రాధాన్యము చేతనైనను, జ్యేష్ఠాదేవిపూజావ్రతము చేయదగినది. అందులో దాక్షిణాత్యులు కేవల జ్యేష్ఠానక్షత్రమందే చేయుచున్నారు. అనూరాధానక్షత్రమందు ఆవాహనము, జ్యేష్ఠానక్షత్రమందు పూజనము, మూలనక్షత్రమందు విసర్జనము, అని ఆవ్రతముమూడుదినములయందు చేయతగినది.

భాద్రపద శుక్లైకాదశియందయినను, ద్వాదశియందయినను పారణానంతరము విష్ణుమూర్తికి పరివర్తనోత్సవము చేయదగినది. అందుకై "శ్రుతేశ్చమధ్యేపరివర్తమేతి" అనువచనమువలన మూడుభాగములు చేయబడిన శ్రవణనక్షత్రముయొక్క మధ్యభాగముతో యోగము ఏకాదశియందుండగా ఏకాదశియందే చేయదగినది. ద్వాదశియందుండగా ద్వాదశియందే చేయదగినది.





రెండుదినములయందు నక్షత్రముచేత యోగములేక పోవుటయందు, ద్వాదశియందేచేయతగినది, అని మొదలగునట్టి వ్యవస్థతెలియదగినది. ఆదినమందు సంధ్యాకాలమందు విష్ణుమూర్తిని పూజించి ప్రార్థించవలయును.

అనంతరము శ్రవణద్వాదశీ వ్రతము చెప్పబడుచున్నది. అందులో యేదినమందు ముహూర్తమాత్రము మొదలగునట్టి స్వల్పమయినను ద్వాదశికిశ్రవణనక్షత్రముతో యోగము యేదినమందు గలుగునో ఆదినమందుపోష్యము చేయతగినది. యెప్పుడు పూర్వదినమందేకాదశితో కూడినదైన ద్వాదశిపరదినమందున్నదయి రెండుదినములయందు కూడశ్రవణముతో యోగముగలుగునో అప్పుడు పూర్వదినమందు ఏకాదశి, ద్వాదశి, శ్రవణము, అనిమూడు కలియుటయనునట్టి విష్ణుశృంఖలయోగమువలన పూర్వదినమే ఉపవాసము చేయతగినది. ఈవిష్ణుశృంఖలయోగము సూర్యోదయము మొదలురాత్రిప్రథమయామాంతమునందు సంభవించినచో గ్రహించతగినది. ఈవిష్ణుశృంఖలయోగమందు రెండువ్రతములయొక్క ఉపవాసమును తంత్రముచేత ఏకాదశియందే చేసిద్వాదశియందుచెప్పబోయెడుపారణానిర్ణయమును అనుసరించి పారణమును చేయవలెను. ఈవిష్ణుశృంఖలయోగములేనపుడు సూర్యోదయమందున్న ద్వాదశియందు సూర్యోదయకాలమందున్న ద్వాదశియందు సూర్యోదయకాలమందు శ్రవణనక్షత్రముండగా, ఆదినమందు ఉపవాసముచేయతగినది. రెండుదినములయందు సూర్యోదయమందు ద్వాదశియు శ్రవణనక్షత్రమున్ను వుండగా పూర్వదినము గ్రహించతగినది. ఈప్రకారమెచ్చట ఏకాదశ్యుపవాసము వొంబడిగనే శ్రవణద్వాదశ్యుపవాసము వచ్చుచున్నదో అచ్చట రెండువ్రతములున్ను నిత్యములగుటవలన శక్తునిచేత రెండుఉపవాసములుచేయతగినవి. రెండువ్రతములకున్ను వకదేవతయగుటవలన పారణాలోపదోషములేదు. తాను అశక్తుడయితే ఏకాదశియందు ఫలాహారము మొదలగుదానినిజేసి ద్వాదశియందు నిరశనమును చేయవలయును. ఇట్లుజేసితే ఏకాదశీవ్రతలోపములేదు. ఇందుకు "శ్రవణేనయుతాచేత్స్యాద్ద్వాదశీసాహివైష్ణవైః స్థాత్రైశ్చోపోషణీయాస్యాత్త్యజేదేకాదశీంతథా" అని మాధవాచార్యవచనము ప్రమాణము. త్యజేదేకాదశీం, అనుటకు ఫలాహారముఅనియే అర్థముగానిభోజనమని అర్థముగాదు. ఇచ్చట ద్వాదశియందు శ్రవణనక్షత్రముతో యోగములే

కభోయి ఏకాదశియందు శ్రవణనక్షత్రయోగమందు తంత్రముచేత శ్రవణద్వాదశీవ్రతముచేయదగినది.

అనంతరము ఈవ్రతమందు పారణానిర్ణయము చెప్పబడుచున్నది. ద్వాదశి, శ్రవణము, ఈరెండు వెళ్లిపోయినపిమ్మట పారణమును చేయుట ముఖ్యపక్షము. రెండింటిలో నొక్కటి వెళ్లిపోయినపిమ్మట పారణమును చేయుటగౌణపక్షము అచ్చట విష్ణుశృంఖలయోగములేనప్పుడు త్రయోదశియందు ద్వాదశీశ్రవణములు రెండును వెళ్లిపోయినపిమ్మట పారణమును చేయనలెను. విష్ణుశృంఖలయోగమున్నచోట నయితే పూర్వదినమందు తంత్రముగా చేయబడిన రెండుఉపవాసములకున్ను పరదినమందు శ్రవణనక్షత్రముకన్నను ద్వాదశియధికముగానుండగా, శ్రవణము నతిక్రమించి ద్వాదశియందు పారణమును జేయవలయు. అయితే ద్వాదశికన్నను శ్రవణము అధికముగా నున్నచో ఏకాదశీవ్రతపారణావిషయమై ద్వాదశిని యుల్లంఘించుటయందు దోషము చెప్పబడియుండుటవలన ద్వాదశియందే పారణమును చేయవలయు. అందులో శ్రవణమధ్యభాగమును పారణమం దువిడువడము ఆవశ్యకమైనను దానినికూడ ద్వాదశియందు పారణము చేయుటకు అనుకూలకాలమున్నప్పుడు మాత్రమే విడువవలయును. ఒకవేళసంగవకాలముపైన కూడద్వాదశియు శ్రవణమధ్యభాగమున్ను వున్నప్పుడు సంగవకాలమువెళ్లిపోయిన పిమ్మటనే పారణమునుచేయవలయును. ముఖ్యము ద్వాదశియందే పారణమును చేయవలయును. శ్రవణ మధ్యభాగమందు పారణమును చేయరాదని యీచెప్పుట భాద్రపదమాసగతమైన శ్రవణ ద్వాదశీవ్రతముయొక్కపారణయందు మాత్రమే గాని మాఖఫాల్గునమాస కృష్ణపక్షములయందున్న శ్రవణద్వాదశీ వ్రతములయొక్క పారణయందుగాదు. ఏలనంటే, మాసాంతరగతమైన శ్రవణభాగమందు విష్ణుపరివర్తనోత్సవము లేకబోవుటవల్లనని తెలియదగినది. ఈశ్రవణద్వాదశీవ్రతమును జేయుటయందు మహాఫలము గలుగును. ఈసమస్తనిర్ణయము మాసాంతరగతమైన శ్రవణద్వాదశీ వ్రతమందు కూడయూహించతగినది. శ్రవణద్వాదశీవ్రతమందు నదీసంగమమందు స్నానముజేసి కలశమందు సువర్ణవికారుడై నటువంటి జనార్దను డనేనామముగలిగి నటువంటివిష్ణుమూర్తిని పూజించి వస్త్రము యజ్ఞోపవీతము పాదుకలుఛత్రమ్ము, మొదలగుదానిని సమర్పణముజేసి ఉపవాసమునుజేసి పారణదినమందు పెరుగుఅన్నముతో





కూడి నటువంటిన్ని వస్త్రముతో చుట్టఁబడి నటువంటి జలపూర్ణకుంభమునున్ను, ఛత్రము మొదలగు దానిచేతకూడి నటువంటిన్ని పూజించి నటువంటిన్ని పరివారసహితమై నటువంటి ప్రతిమనున్ను, దానము చేయవలయును.

అనంతరము వామనజయంతి నిర్ణయింప బడుచున్నది. శ్రవణనక్షత్రముతోకూడిన భాద్రపదశుక్ల ద్వాదశియందు మధ్యాహ్నకాలమందు వామనమూర్తియొక్క ఉత్పత్తియైనది. ఈదినమందు మధ్యాహ్నకాలమందు నదీసంగమప్రదేశమందు స్నానముజేసి, సువర్ణవికారమై నటువంటి వామనమూర్తిని పూజించి అర్ఘ్యమును బంగారుపాత్రముచేత దానము చేయవలయును. పరదినమందు పరివారసహితమైన వామనప్రతిమను బ్రాహ్మణునికొరకు దానముచేయవలయును. ఇదేద్వాదశియందు రాత్రియందు దేవపూజనుచేసి ఆరాత్రియందు సంభవించకబోవుటయందు పగటియందే అయినను చేసి దధివ్రతమును నివేదనముచేసి దధిదానముజేసి దుగ్ధవ్రతమునుగురించి సంకల్పమును చేయవలయును.

అనంతరము భాద్రపదశుక్లచతుర్దశియందు అనంతవ్రతము చేయతగినది. ఇచ్చట సూర్యోదయకాలమందు మూడుముహూర్తములు వ్యాపించిన చతుర్దశి గ్రహించతగినదని ముఖ్యపక్షము. అది దొరకనపుడు రెండుముహూర్తములుండిన చతుర్దశి గ్రహించ తగినదని అనుకల్పము. రెండుముహూర్తముల కన్నను తక్కువెగానున్నదయితే పూర్వదినమందున్న చతుర్దశి గ్రహించతగినది. రెండుదినములయందు సూర్యోదయమును వ్యాపించుటయందు సంపూర్ణమగుటవలన పూర్వదినమందున్న చతుర్దశి గ్రహించ తగినది. ఈవ్రతమందు పదునాలుగుగ్రంథులచే కూడి నటువంటిదోరమందు అనంతపూజ మొదలగువిధానమున్ను అనంతవ్రతోద్యాపనమునున్ను కౌస్తుభగ్రంథమందు చూడందగును. సూర్యునికి వృషభసంక్రాంతియైన పిమ్మట యేడవదినమందు అగస్త్యమహర్షి అస్తమానమును జెందుచున్నాడు. సింహసంక్రాంతియైనపిమ్మట నిరువది యొకటవదినమందు ఉదయమును చెందుచున్నాడు. అచ్చట కన్యాసంక్రాంతి కన్నను పూర్వము యేడు దినములలోపల అగస్త్య పూజనమున్ను అగస్త్యార్ఘ్యము మొదలగునదిన్ని చేయుదగినది. భాద్రపదపూర్ణిమయందు ప్రపితామహునికన్నను పరమందున్నట్టి సపత్నీకులగు వసురుద్రాదిత్యస్వరూపులయిన తండ్రిమొదలగు ముగ్గురిని గురించియు, పత్నీసహితులైన మాతామహుడు మొదలగుముగ్గురిని గురించియున్ను

శ్రాద్ధమునుచేయవలెను. ఇది పార్వణశ్రాద్ధమగుటవలన అపరాహ్ణకాలమందు
పురూరవార్ద్రవదేవయుక్తముగునట్లు పిండసహితమగునట్లు చేయవలయును. ఇది
ప్రోష్ఠపదీశ్రాద్ధమనిచెప్పంబడును.

అనంతరము మహాలయము నిర్ణయింపంబడుచున్నది. అచ్చటశక్తునిచేత
భాద్రపదకృష్ణపక్షమందు పాడ్యమిమొదలుకొని అమావాస్యాంతము, తిథివృద్ధి
యందుపదునారు మహాలయములు చేయతగినవి. వృద్ధిక్షయములు లేకబోవుట
యందు పదునైదు మహాలయములేచేయతగినవి. తిథిక్షయమందు పదునాలుగు
మహాలయములెచేయతగినవి. అశక్తునిచేతనయితే, పంచమిమొదలగు తిథుల
యందైనను, షష్ఠిమొదలగు తిథులయందైనను, అష్టమిమొదలగుతిథులందైనను
దశమిమొదలగుతిథులయందైనను, ఏకాదశిమొదలగుతిథులయందైనను, అమా
వాస్యాంతము మహాలయములు చేయదగినవి. కేవలాశక్తునిచేత, అనిషిద్ధమగు
యేదోవకదినమందుసకృన్మహాలయముచేయతగినది. పాడ్యమిమొదలుకొనిఅమా
వాస్యాంతముమహాలయమును చెయుపక్షమందు చతుర్దశియందు కూడ మహాల
యమును చేయవలయు. పంచమిమొదలు అమావాస్యాంతమైన తిథులయందు
మహాలయమునుచేయుట, అనిమొదలగు అయిదుపక్షములయందు చతుర్దశినివి
డిచిబెట్టి ఇతరతిథులయందు మహాలయములనుచేయవలయు. సకృన్మహాలయ
మందుకూడచతుర్దశిని విడువవలయు. సకృన్మహాలయమందు పాడ్యమి, షష్ఠి,
ఏకాదశి, చతుర్దశి, శుక్రవారము, జన్మనక్షత్రము, జన్మనక్షత్రమునకు పదియ
వనక్షత్రము, పందొమ్మిదవనక్షత్రము, రోహిణి, మఖ, రేవతి, అనునవివర్జించతగి
నవి. వకానొక గ్రంథమందు త్రయోదశిసప్తమి ఆదివారము మంగళవారము,
అనునవికూడవర్జించ తగినవనిచెప్పబడినది. పితృమృతతిథియందు సకృన్మహాల
యమునుచేయుపక్షమందయితే, నందతిథిమొదలగు దానియందు నిషేధములే
దు. ఇందుకు "అశక్తః పితృపక్షేషుకరోత్యేకదినేయతః। నిషిద్ధేపి దినేకుర్యాత్పిం
డదానంయథావిధి" అనువచనము ప్రమాణము. మృతతిథియందు మహాలయ
ముచేయుటసంభవించక బోతేనిషిద్ధతిథిమొదలగు దినమును విడిచిఇతరదినమందు
మహాలయమును చేయవలయు. సన్యాసులకు మహాలయమయితే అపరాహ్ణకాల
మును వ్యాపించినట్టి ద్వాదశియందే పిండసహితముగచేయతగినది కాని ఇతరతిథి
యందుచేయరాదు. "శాస్త్రిద్ధంశస్త్రహతస్యైవచతుర్దశ్యాంప్రకీర్తితం" అనుని





యమముచేతప్రతి సాంవత్సరిక శాస్త్రిద్ధాతిరిక్తశ్రాద్ధమునకు చతుర్దశియందునిషే
ధమువలన, చతుర్దశియందు మృతుడైనవానికి కూడమహాలయమును చతుర్దశి
యందు చేయరాదు. మహాల యమందు కన్యార్కుడు ప్రశస్తతను గలుగజే
యువాడే గాని నిమిత్తముగాదు. ఈచెప్పబడిన కాలము ముఖ్యకాలము. అమా
వాస్యాంతములో సంభవించకబోతే ఆశ్వినశుక్లపంచమి లోపల యేదోవక
తిథియందు మహాలయము చేయతగినది. అంతలోపల సంభవించకబోతే వృశ్చి
కసంక్రాంతి వచ్చునంతలోపల వ్యతీపాత, ద్వాదశి, మొదలగుపర్వమందు చేయ
దగినదని గౌణకాలము తెలియదగినది. మృతదినమందున్ను మహాలయమం
దున్ను శ్రాద్ధమును పక్వాన్నముచేతనే చేయదగినదిగాని ఆమాన్నముమొదలగు
దానిచేత చేయరాదు. "మహాలయేగయాశ్రాద్ధే మాతాపిత్రోర్మృతేహని।
కృతోద్వాహోపికుర్వీత పిండదానం యథావిధి" అను వచనానుసారముగా
మహాలయమందును, గయాశ్రాద్ధమందును, మాతాపితృవుల మృతదినమం
దును, నూతనముగ వివాహమునుజేసికొన్నవాడైనను యథావిధిగ పిండదాన
మును చేయవలయు. మహాలయములయందు ప్రయోగమున్ను తద్విశేషము
లున్ను ప్రయోగధర్మశాస్త్రగ్రంథములయందు చూడవలయును. అయితే ఈమ
హాలయవిషయమందు కావలసియున్న కొన్నిసంగతులను వ్రాయుచున్నాను.
"అన్వష్టకాసువృద్ధౌచప్రతిసాంవత్సరేతథా। మహాలయేగయాయాంచసపిండీక
రణాత్పురా। మాతుః శ్రాద్ధం పృథక్కార్యమన్యత్ర పతినాసహ" అనువచనము
వలన, అన్వష్టకాశ్రాద్ధమందు, వృద్ధిశ్రాద్ధమందు, ప్రతిసాంవత్సరికమందు, మ
హాలయమందు, గయాశ్రాద్ధమందు, సపిండీకరణము కన్నను పూర్వమందు,
తల్లియొక్క శ్రాద్ధమును వేరుగా జేయవలయును. ఇతరవిషయమందు ఆయమప
తియొక్క శ్రాద్ధముతోకూడ చేయవలయును. మహాలయమందు ధూరిలోచనసం
జ్ఞలుగల విశ్వేదేవతలు గ్రహించతగుదురు. మహాలయమందు పార్వణార్థమందు
అగ్నౌకరణమును చేయవలయు. ఏకోద్దిష్టగణార్థము అగ్నౌకరణమును చేసినను
చేయకబోయినను యుక్తమేను. భార్యరజస్వలయయివుండగా కాలాంతరములుం
డుటవలన సకృన్మహాలయమును చేయరాదు. అమావాస్యయందు రజస్వలయ
యివుండగా ఆశ్వయుజ శుక్లపంచమిలోపల గౌణకాలమందు మహాలయముచే
యతగినది. అయితే పాకమును ఆరంభము చేసినపిమ్మట భార్యరజస్వలయయిన

ప్పుడు ఆభార్యను మరియొక గృహమందుంచి ఆదినమందే మహాలయమునుచేయవలయును. ‘‘వృద్ధౌతీర్థేచసన్యస్తేతాతేచపతితేసతి। యేభ్య ఏవపితాదద్యాత్తేభ్యోదద్యాత్స్వయంసుతః॥ముండనంపిండదానంచప్రేత కర్మచసర్వశః। సజీవత్పితృకః కుర్యాద్గుర్విణీపతిరేవచ’’ అని మొదలగువచనములవలన వృద్ధిశ్రాద్ధమందు, తీర్థశ్రాద్ధమందు, ఇతరశ్రాద్ధములయందు కూడ తండ్రి సన్యస్తుడయి వుండుటయందు, పతితుడగుటయందు, తండ్రియెవ్వరికి దానమును చేయునో, పుత్రుడువారలకు దానముచేయవలయు. అయితే ముండనమును పిండదానమును ప్రేతకర్మనున్ను సర్వప్రకారములుగా జీవత్పితృకుడున్ను గర్భిణీపతియున్ను చేయరాదు. ఇదియునుంగాక పిండదానము మొదలగు విస్తారకర్మను చేయుటయందు శక్తిలేనివానిచేత కూడ సాంకల్పవిధానము చేయతగినది. మాతాపితృవులమరణమందు ప్రథమసంవత్సరమందు మహాలయముచేసినను చేయకపోయినను యుక్తమేను. మహాలయము మలమాసమందు చేయతగదు. ప్రతిసాంవత్సరికశ్రాద్ధదినమునందు సకృన్మహాలయ శ్రాద్ధమును చేయరాదు. మరియొకదినమందు చేయవలయును. పాడ్యమి మొదలుకొని అమావాస్యాంతము మహాలయమునుచేయుట, యీమొదలగు పక్షములయందయితే, ప్రతిసాంవత్సరిక శ్రాద్ధదినమందేపాకాంతరముచేత మహాలయముచేయునది. మహాలయానంతరము దర్శశ్రాద్ధముఅమావాస్యయందు పాకాంతరముచేత చేయతగినది. ఇట్లు అమావాస్యయందు ప్రతిసాంవత్సరికము ప్రాప్తించితే మూడుపాకములుచేత మూడుశ్రాద్ధములు చేయతగినది.

ఈఅపరపక్షమందు భరణీశ్రాద్ధమును చేయుటవలన గయాశ్రాద్ధఫలముగలుగును. భరణీశ్రాద్ధమును పిండసహితముగను, షడ్దైవతముగను, సంకల్పవిధానముచేత చేయవలయు. భరణీశ్రాద్ధము కామ్యము, గయాశ్రాద్ధఫలమును గోరియున్నవానిచేతప్రతిసంవత్సరముచేయతగినది.‘‘నదైవంనాపివాపిత్ర్యంయావత్పూర్ణోనవత్సరః’ అని మొదలగువచన మువలనసమస్తమగు ఆమాశ్రాద్ధము మొదలైన శ్రాద్ధమునకు, మొదటిసంవత్సరము నందునిషేధమువలన నున్నుసంవత్సరాంతమందేపితృత్వముప్రాప్తించు చున్నందువలననున్ను రెండవసంవత్సరమందే చేయుటకొరకుయుక్తమైనది. ఈయపరపక్షమందు సప్తమిమొదలగు మూడుదినములయందు అష్టకాశ్రాద్ధముచేయ తగిది నవమియందుఅన్వష్టక్యశ్రాద్ధముచేయ





తగినది. ఇదినిత్యముఈనవమి అవిధవానవమియని తెలియదగినది. ఈఅవిధవానవమీశ్రాద్ధమందుజీవత్పితృకునిచేతనైనప్పటికిని,గర్భిణీపతిచేతనైనప్పటికిని,పిండదానముచేయతగినది. అనంతరము ఈఅపరపక్షముయొక్క ద్వాదశియందుసన్యాసులకు మహాలయముచేయదగినది. అనంతరముత్రయోదశియందు శ్రాద్ధముచేయదగినది ఇదినిత్యమైనది. మఘానక్షత్రమందు కూడశ్రాద్ధముచేయదగినది. సూర్యుడుహస్తనక్షత్రనుందుండగా మఘానక్షత్రముతోయుక్తమైనత్రయోదశిగజచ్ఛాయ యని సంజ్ఞగలది. దీనియందు శ్రాద్ధమువలన విశేషఫలముగలుగును. ఇచ్చటమహాలయశ్రాద్ధమున్నుయుగాదిశ్రాద్ధమున్ను ప్రాప్తించి యుండగా మఘాత్రయోదశీశ్రాద్ధము,మహాలయశ్రాద్ధము, యుగాదిశ్రాద్ధము,అనిమూడింటినితంత్రముచేతచేయదగినది. ‘‘అంగానామైక్యంప్రధాన మాత్రభేద స్తంత్రం’’ అనివచనము వలనతంత్రముఅనగా అంగములకైక్యము ప్రధానమునకు మాత్రముభేదము, అనిఅర్థము. అనంతరము యీచతుర్దశియందు తండ్రిమొదలగు ముగ్గురిలోపలయొకనికైనను శస్త్రము విషము అగ్ని మొదలగునదియేనిమిత్తముగా గలదుర్మరణముచేతమృతుడైనవానికి శ్రాద్ధముచేయదగినది. విధిప్రాప్తమయిన అగ్నిజలాదిమరణమందు చతుర్దశీ శ్రాద్ధము చేయదగదు. అయితే యుద్ధము ప్రాయోపవేశము, ఈరెండిటియందు మరణమునకు విధిప్రాప్తత్వమున్నను ఈశ్రాద్ధముచేయదగినది. ఇచ్చట ఏకోద్దిష్ట విధానముచేత శ్రాద్ధమును చేయుటయందు అపరాహ్ణమునే వ్యాపించినచతుర్దశి గ్రహించతగినది. ఇతరస్థలమందు ఏకోద్దిష్టవిషయమందయితేమధ్యాహ్నమును వ్యాపించినతిథి గ్రహించతగినది. సూర్యచంద్రులిద్దరునుహస్తనక్షత్రమందుండగా ఆయమావాస్య గజచ్ఛాయయని తెలియదగినది. ఆతిథియందు శ్రాద్ధముదానము మొదలగునది చేయదగినది. ఆశ్వినశుక్లపక్షపాడ్యమియందు ఉపనయనము గాకుండినయట్టి వాడైనప్పటికిని, దౌహిత్రునిచేత, సపత్నీకమాతామహునియొక్క పార్వణము మేనమామయున్నప్పటికిని అవశ్యముగాచేయదగినది. మాతామహియున్నచో మాతామహపార్వణముమాత్రముచేయదగినది. ఈపార్వణశ్రాద్ధము జీవత్పితృకునిచేత కూడచేయదగినది. ఇచ్చట అపరాహ్ణవ్యాపిని యగుతిథి గ్రహించతగినది. భాద్రపదకృష్ణపక్షమందు భౌమవారము, వ్యతీపాత, రోహిణి, వీటితోకూడినట్టిషష్ఠి కపిలాషష్ఠియని తెలియదగినది. ఇచ్చట సూర్యుడు హస్తనక్షత్రమందుండగా ఫలవిశేషముగలదు. ఈ

యోగము పగటియందు గ్రహించతగినది గాని రాత్రియందు గ్రహించతగదు. ఈకపిలాషష్ఠియందు హోమము చేయబడినదిన్ని దానము చేయబడినదిన్ని సమస్తము కోటిగుణమగును. ఇది అలభ్యయోగమగుటవలన దర్శశ్రాద్ధమందువలె షడ్దైవతమగు శ్రాద్ధముచేయునది. ఈయోగమందు సూర్యోద్దేశముగవ్రతముచేయందగు.

అనంతరము ఆశ్వయుజమాసమందున్న వ్రతాదులయొక్క నిర్ణయముచెప్పబడుచున్నది. తులాసంక్రాంతియు మేషసంక్రాంతియు, ఈరెండు విషువమని సంజ్ఞగలవి. తులాసంక్రాంతియందు పూర్వమందుపదునైదుఘడియలుపరమందు పదునైదుఘడియలు పుణ్యకాలముఆశ్వినశుక్లపాడ్యమియందు దేవీపూజారూపమైన నవరాత్రవ్రతముయొక్క ఆరంభము చేయదగినది. ఆనవరాత్రారంభము సూర్యోదయానంతరము మూడుముహూర్తములు వ్యాపించిన పాడ్యమియందు చేయదగినది. అదిదొరకనప్పుడు రెండుముహూర్తములు వ్యాపించినదైనను గ్రహించతగును. సర్వప్రకారములుగా అమాయుక్తపాడ్యమియందు చేయరాదని అనేకగ్రంథసమ్మతము. అయితే పరదినమందు ముహూర్తముకన్నను తక్కువగావ్యాపించియున్నను, సూర్యోదయకాలమును స్పృశించకబోయినను, దర్శయుక్తమైనదికూడా గ్రహించతగినది. పాడ్యమి ఆరువైఘడియలుగానుండి పరదినము ముహూర్తద్వయాది ప్రమాణముగలదైయుండగా పూర్ణత్వమువలన పూర్వదినమే గ్రహించతగినది ఈకర్మయందు బ్రాహ్మణుడు మొదలగు నాలుగువర్ణములకును అధికారముగలదు అచ్చట బ్రాహ్మణునిచేత జపహోమాన్నబలినైవేద్యములచేత సప్తశత్యాదులచేతను సాత్వికమైనపూజచేయదగినది. క్షత్రియ వైశ్యులు సాత్విక పూజనుమాత్రమైనను, రాజససాత్వికపూజలను రెండిటినిన్ని అయినను, చేయవలయు. శూద్రులు మొదలగువారలు తామసపూజను తామేచేసి సాత్వికపూజను బ్రాహ్మణద్వారా చేయించవలెను. స్త్రీశూద్రులు పురాణోక్తమంత్రములను పఠించుటయందు కూడ అధికారములేనివారలు పురాణోక్తమంత్రములను మాత్రము శ్రవణము చేయుటయందు అధికారముగలదు. మ్లేచ్ఛులు మొదలగువారికయితే బ్రాహ్మణద్వారముగనైనప్పటికిని జపముహోమము సమంత్రకపూజ, వీటినిచేయించుటయందు కూడనధికారములేదు. మ్లేచ్ఛాదులచేత దేవినుద్దేశించి ఆమాంసకలోపచారములను సమర్పించినట్లు మనస్సుచేత భావనము మాత్రముచేయదగినది.





అనంతరము నవరాత్ర వ్రతమందు గౌణపక్షములెవ్వి యనిన,, తదియ మొదలు నవమ్యంతము యేడుదినములయినను పంచమి మొదలు అయిదుదినములైనను, సప్తమిమొదలు మూడుదినములైనను, అష్టమిమొదలు రెండుదినములయినను, దేవీపూజచేయదగినది. వకదినముమాత్రము దేవీపూజచేయుటయందు కేవలాష్టమియందైనను కేవలనవమియందైనను. చేయవలయు. యీపక్షములలోపల తమతమ కులాచారముననుసరించిగాని, ప్రతిబంధము మొదలగుదానిచేతపూర్వపక్షము సంభవించకబోవుట ననుసరించిగాని, వ్యవస్థతెలియదగినది. యీనవరాత్రముచేయకున్నచో దోషముగలదుగాననిత్యము. చేసితేఫలముగలదుగాన కామ్యము కూడానని తెలియవలయు. ఈనవరాత్రమందు కలశస్థాపనము అఖండదీపము సువాసినీభోజనము మంత్రజపపారాయణము మొదలగు కార్యములుతమతమ కులాచారానుసారముగా చేయదగినవి. కులాచారమునందులేని కార్యములను మాత్రముచేయరాదు. ఈనవరాత్రవ్రతప్రయోగమును ప్రయోగధర్మశాస్త్రిగ్రంథములయందు చూడవలెను యీశారదనవరాత్రోత్సవముమలమాసమందునిషిద్ధమైనది. శుక్రమూఢము మొదలగుదానియందయితె చేయవచ్చును. అయితేనవరాత్రవ్రతముయొక్కప్రథమారంభమును చేయరాదు. ఆశౌచముగలిగియున్నచోసమస్తవిధానము బ్రాహ్మణద్వారముగాచేయించవలెను. ఉపవాసము మొదలగుశారీరనియమమును తానేచేయవలెను.

అనంతరము పంచమియందు ఉపాంగలలితావ్రతము చేయదగినది. ఇచ్చట పంచమి అపరాహ్ణకాలమును వ్యాపించినది గ్రహించతగినది. అపరాహ్ణమేతత్పూజాకాలము. పరదినమందుమాత్రమే అపరాహ్ణమును వ్యాపించుటయందు పరదినమే గ్రహించతగినది. అట్లుగాక నితరసమస్తపక్షములయందున్ను పూర్వదినమే గ్రహించతగినది ఆశ్వయుజ శుక్లపక్షమందు మూలనక్షత్రమందు పుస్తకములయందు సరస్వతీ పూజనుచేయవలెను. “మూలేషుస్థాపనం దేవ్యాః పూర్వాషాఢాసుపూజనం । ఉత్తరాసుబలిందద్యాచ్ఛ్రవణేనవిసర్జయేత్ ”అని వచనమువలన మూలనక్షత్రమందు ఆవాహనమును పూజనున్నుచేయవలెను. పూర్వాషాఢానక్షత్రమందు ఆవాహనరహితమైన పూజనుమాత్రమే చేయవలెను. ఉత్తరాషాఢానక్షత్రమందు బలిదానమును తదంగభూతమైన పూజనున్నుచేయవలయు శ్రవణమందు విసర్జనాంగభూతమైన పూజను విసర్జనమునున్ను

చేయవలెను. అచ్చట సూర్యాస్తమానముకన్నను పూర్వము మూడు ముహూర్తములు వ్యాపించినట్టి మూలనక్షత్రముయొక్క మొదటిపాదమందు సరస్వత్యావాహనముచేయదగినది. అట్లులేని యట్టి ఇతరసమస్తపక్షములయందున్ను రెండవపాదము మొదలగుదానియందు పరదినమందే ఆవాహనము "ఆదిభాగోనిశాయాంతు, అని మొదలగు విశేషవచనమువలన శ్రవణప్రథమపాదము రాత్రిభాగమందున శ్రవణమునుగురించియున్నందు దైనప్పటికిని దానియందే విసర్జనమును చేయవలయు. రాత్రిప్రథమయామపర్యంతమే ఈవిశేషవచనము గ్రహించ తగినదని ధర్మసింధుయందు వ్రాయబడినది. సప్తమిమొదలగు మూడు దినములయందు పత్రికాపూజనము చేయదగినది. అనంతరము మహాష్టమి నవమితోకూడినదై ఘడియమాత్రమైనను ఉదయమునందున్నది గ్రహించ తగినది. ఇతరపక్షముల యందంతయు సప్తమితోకూడినది గ్రహించతగినది. రెండుదినముల యందష్టమి సూర్యోదయమందున్నచో పూర్ణమగుటవలన పూర్వదినమేగ్రహించ తగినది. అయితే నవమిక్షయతిథియై పర దినమందు కొంచమైనను లేక యున్నచో అప్పుడు సూర్యోదయ మందున్న అష్టమిని విడిచి సప్తమితోకూడిన అష్టమినే గ్రహించతగినది. అష్టమియందు పుత్రవంతునిచేత కేవలముగ నుపవాసము చేయందగదు. మహానవమి బలిదానవ్యతిరిక్త సకల విషయములయందు అష్టమితో కూడినది గ్రహించతగినది. అది అష్టమీ దినమందు సాయంకాలమున మూడుముహూర్తములు వ్యాపించియుడినచోటనే అని తెలియదగినది. బలిదానమందయితే దశమితోకూడినది గ్రిహించతగినది. నవమి దినద్వయమందు సూర్యోదయమందున్నచో పూర్ణమగుటవలన పూర్వదినమే గ్రిహించతగినది. ఇచ్చట కొన్నినిర్ణయములు ధర్మసింధువుయందు చూడవలెను. ఈనవరాత్రిమందు తాను పూజ మొదలగుదానిని చేయుటయందు శక్తిలేనివాడయితే మరియొకనిచేత చేయించవలయు. విస్తారముగ పూజను చేయుటయందుఅశక్తుడయితే షోడశోపచారపూజను చేయవలయు. మిక్కిలి అశక్తుడయి తేపంచోపచారపూజను చేయవలెను. నవమియందు పూజను చేశి హోమమును చేయవలయు. ఆహోమమును జపదశాంశముగా చేయవలయు. కులాచారము ననుసరించిన మంత్రములచేత, నెయ్యిచేతను తెల్లనూలచేతను మిశ్రమైనపాయసముచే హోమముచేయవలెను. అనంతరము బలిదా





నవిషయమందు మాషాదిమిశ్రమైన యన్నముచేగాని కూష్మాండముచేగాని చేయవలెను. ఘృతముతోగాని యవపిష్టాదులతోగాని సింహవ్యాఘ్రనర మేషముల లో దేనినైన చేసి ఖడ్గముతో నరకవలయు. బలిదానమంత్రాదిప్రకారము నిర్ణయసింధువుయందు చూడవలయు. ఇచ్చట శతచండీసహస్రచండీ ప్రయోగము కౌస్తుభగ్రంథమందు చూడవలయు. ఆశౌచము ప్రాప్తించియుండగా నవమియందు హోమమును ఘటాదిదేవతోత్థాపనమునున్ను బ్రాహ్మణద్వారముగా చేయించితాను పారణమునుచేసి ఆశౌచాంతమందు బ్రాహ్మణభోజనము దక్షిణాదిదానమున్ను చేయదగినది.

అనంతరము పారణావిసర్జనములకు కాలము చెప్పబడుచున్నది. విసర్జనము దశమియందు చేయదగినది. విసర్జనానంతరము ఆదినమందే పారణమును చేయవలెను. ఈవిసర్జనపారణములయందు నిర్ణయమునంతయు ధర్మసింధువుయందు చూడవలెను. అనంతరము విజయదశమి నిర్ణయింప బడుచున్నది. ఆదశమిపరదినమందే ఆపరాహ్ణమును పూర్తిగయైనను కొంచమైనను వ్యాపించుటయందు పరదినమే గ్రహించతగినది. రెండుదినములయందు అపరాహ్ణమును వ్యాపించుటయందు లేక వ్యాపించక పోవుటయందున్ను పరదినమందు శ్రవణముతో యోగమున్న పక్షమందు, యేదినమందు శ్రవణముతో యోగముగలదో ఆదినమే గ్రహించతగినది. యెప్పుడు దశమి పూర్వదినమందే అపరాహ్ణమును వ్యాపించినదై, పరదినమందే మూడుముహూర్తముల కధికముగా నుండినదై పరదినమందే అపరాహ్ణమందు శ్రవణముతో యోగము గలిగియుండునో అప్పుడు కూడపర దినమే గ్రహించతగినది. ఈచెప్పియున్న ప్రకారములకన్న నితరప్రకారముల యందయితే పూర్వదినమే గ్రహించతగినది. ఈవిజయదశమియందు అపరాజితాపూజనము, సీమోల్లంఘనము, శమీపూజనము, దేశాంతరప్రయాణమును గోరువారికి ప్రయాణమున్ను, చేయదగినది. ఇచ్చట విజయ ముహూర్తమందు దేశాంతరమును గురించి ప్రయాణమును జేయవలయునని యిచ్ఛయించినవారు ప్రయాణమును జేయవచ్చును. విజయము హూర్తస్వరూపము "ఈషత్సంధ్యామతిక్రాంతః కించిదుద్భిన్నతారకః । విజయోనామకాలోయం సర్వకార్యార్థసిద్ధిదః' అని తెలియదగినది. ఇచ్చట చంద్రతారాదిబలములు లేక పోయినను ప్రయాణము చేయవచ్చును. ఈవిజయ ముహూర్తమందు దశమియుండినప్పుడే ప్ర

యాణము చేయవలయు ఏకాదశియుండగా చేయరాదు. రాజులయొక్క పట్టాభిషేకమందు నవమితోకూడిన దశమి శ్రవణముతో కూడినదైనను గ్రహించతగదు. మరియేమన్నను ఉదయకాలమునకున్న దశమియే గ్రహించతగినది.

ఆశ్వయుజ శుక్లమందు దశమినైనను ఏకాదశినైనను పూర్ణిమనైనను మొదలుకొని ముహూర్తమాత్రము శేషించిన రాత్రియందు తీర్థము మొదలగు దానియందుపోయి ప్రత్యహము మాసపర్యంతము కార్తికస్నానము చేయదగినది. కార్తికమాసము నందంతయు నిత్యస్నానము చేయువాడై జితేంద్రియుడై హావిష్యద్రవ్యములనే భక్షించువాడై శాంతుడై జపములను చేయువాడై సమస్తపాపములవలన విడువబడును. ఈకార్తికస్నానమును, ప్రాతఃస్నానప్రాతఃసంధ్యలనుచేసి చేయవలెను. ఈప్రకారము మాసస్నానము చేయుటయందు శక్తిలేకపోతే మూడుదినములు స్నానము చేయవలయు. ఇతరములయిన కార్తికమాసవ్రతములనున్ను ఇప్పుడే ఆరంభము చేయవలయును. విష్ణుపూజా సేవాదికార్యములున్ను కార్తికమాసమున చేయదగినవి. ఈవిచారము పురాణధర్మశాస్త్రగ్రంథములయందు చూడతగినవి. కార్తికమందు దీపములదానము సర్వదానములకన్ననధికము. కార్తికమందు కొన్నివర్జ్యద్రవ్యములు గలవు. అవి ధర్మశాస్త్రము వలన తెలియదగినవి. కార్తకమాసమందు పురాణేతిహాసములను శ్రవణముచేయవలయును. ఆశ్వీజశుక్లద్వాదశియందు దుగ్ధవ్రతమును సమర్పణముచేసి దుగ్ధదానముచేసి ద్విదళవ్రతమును సంకల్పించవలయు. ఈదినముమొదలు మాసపర్యంతము ఆకాశదీపమును దానముచేయుటవలన మహాలక్ష్మీప్రాప్తిగలగును. ఆశ్వీజపూర్ణిమయందు కోజాగరవ్రతము చేయదగినది. ఇచ్చట లక్ష్మీంద్రులయొక్కపూజయున్ను జాగరణమున్ను అక్షక్రీడయున్ను చేయదగినది. ఈపూర్ణిమయందు ఆశ్వయుజీకర్మను ఆశ్వలాయనులు చేయవలయు. దీనినిర్ణయము ప్రయోగమున్ను గ్రంథాంతరమందు చూడవలయును. అట్లనే ఆగ్రయణకాలనిర్ణయము ధర్మసింధువుయందు చూడతగినది. ఆగ్రయణమును మలమాసమందు చేయరాదు. మరియు గురుశుక్రాదిమౌఢ్యమందు కూడచేయరాదని కొందరు చెప్పియున్నారు. ఆశ్వీన శుక్లచవితి కరకచతుర్థియని తెలియ దగినది. ఇది చంద్రోదయకాలమునువ్యాపించినది గ్రహించతగినది. ఆశ్వీజకృష్ణద్వాదశి గోవత్సద్వాదశియని తెలియునది అది ప్రదోషవ్యాపిని గ్రహించతగినది. ఈద్వాదశియందు దూడతో





సమానమైనవర్ణముగలిగినట్టిన్ని దూడతోగూడినట్టిన్ని ప్రచురక్షీరము లిచ్చునట్టి గోవును పూజించి గోవుయొక్కపాదమందు రాగిపాత్రముచేత అర్ఘ్యమునివ్వవలయు. ఆదినమందు తైలపక్వము స్థాలీపక్వము గోక్షీరము, గోఘృతము, గోదధి గోతక్రము, వీనిని వర్జించవలయును. నక్తముమాషాన్నభోజనము భూశయ్యాబ్రహ్మచర్యము, ఇవి చేయదగినవి. ఈద్వాదసిమొదలు అయిదుదినములయందు పూర్వరాత్రియందు నీరాజనవిధానమును “నీరాజయేయుర్దేవాంశ్చవిప్రాన్గాశ్చతురంగమాన్ । జ్యేష్ఠాన్ శ్రేష్ఠాన్ జఘన్యాంశ్చ మాతృముఖ్యాశ్చయోషితః” అని నారదులు చెప్పియున్నారు. త్రయోదశియందు అపమృత్యునాశనము గురించి యమునికొరకు సూర్యాస్తమయ ప్రదోషమందు గృహమువెలుపట దీపమును పెట్టవలయును.

చంద్రోదయకాలమును వ్యాపించిన ఆశ్వీజకృష్ణ చతుర్దశియందు నరకభయముగలవారిచేత తిలతైలముచే అభ్యంగస్నానము చేయదగినది. ఇచ్చట చంద్రోదయకాలము మొదలు సూర్యోదయకాలములోపల శ్రేష్ఠము తత్పూర్వతత్పరకాలములు గౌణకాలములు అచ్చట పూర్వదినమందు మాత్రమే చంద్రోదయకాలమును వ్యాపించినచో పూర్వదినము గ్రహించతగినది. పరదినమందుమాత్రమే వ్యాపించినచో పరదినము గ్రహించతగినది. రెండుదినములయందు వ్యాపించినచో పూర్వదినము గ్రహించతగినది. రెండుదినములయందున్ను చంద్రోదయమును వ్యాపించకయున్నచో ఉషఃకాలైకదేశవ్యాపిని గ్రహించతగినది. అదికూడ దొరకనప్పుడు పరదినమందు చంద్రోదయకాలమునందు అభ్యంగస్నానము చేయదగినది. అభ్యంగస్నానానంతరము తిలకాదినిధరించి కార్తికస్నానముచేయదగినది. కార్తికస్నానానంతరము యమతర్పణము చేయదగినది. అనంతరము ప్రదోషసమయమందు దేవాలయము, మఠము, ప్రాకారోద్యానములు, వీథులు, గోవాజిహస్తిశాలలు, వీనియందు మనోహరములైన దీపములనుంచవలయును. ఇదేప్రకారమే మూడుదినములయందు ప్రదోషమందుంచవలయు. ఈచతుర్దశీఅమావాస్యల ప్రదోషములయందు నరులుఉల్కాహస్తులు కావలయు అనగా దూముదారి తిప్పవలయు. ఈచతుర్దశియందు నక్తభోజనముమహాఫలదము అనంతరము ఆశ్వీజ అమావాస్యయందు ప్రాతఃకాలమందు అభ్యంగమున్ను ప్రదోషమందు దీపదానము లక్ష్మీపూజనము మొదలైనది చేయదగినది. ఇది ఆశ్వీజమాసనిర్ణయము ముగిసెను.

అనంతరము కార్తీకమాస నిర్ణయము చెప్పబడుచున్నది. వృశ్చిక సంక్రాంతియందు సంక్రాంతికన్నను పూర్వమందు పదునారు ఘడియలు పుణ్యకాలము శేషము పూర్వమందువలె తెలియదగినది. కార్తిక శుక్లపాడ్యమియందున్ను ఆశ్వీన కృష్ణపక్షముయొక్క చతుర్దశ్యమావాస్యలయందున్ను అభ్యంగనము ఆవశ్యకము. మూడుదినములయందున్ను చేయుటవలన ఫలవిశేషముగలదు గనుక కామ్యము చేయకపోతే నరకాదిదోషముగలదు గనుక నిత్యము. ఈపాడ్యమియందు చేయదగిన కార్యములనుగురించి పాడ్యమియొక్క నిర్ణయము ధర్మశాస్త్రమందు చూడవలెను. ఇచ్చట బలిపూజనమును సూర్యోదయాదిగా పది ముహూర్తములు పాడ్యమియుండినయెడల ఆదినముచేయవలయు. తొమ్మిది ముహూర్తములకన్నను పాడ్యమి తక్కువగానున్నచో పూర్వవిద్ధమైన పాడ్యమియందు చేయవలయు ఈదినమందు లక్ష్మీపూజ కుబేరపూజమొదలైనదికూడ చేయతగినది. కార్తీక శుక్ల ద్వితీయయమ ద్వితీయయనంబడును. ఈద్వితీయయందు ప్రయత్న పూర్వకముగా భగినీహస్తమువలన భోజనముచేయదగినది. అందుచేత ధనధాన్యసుఖలాభముగలుగు. వస్త్రాలంకారములచేత సమస్తభగినులను పూజించవలయును. స్వభగిని లేకపోతే పిత్రాదులయొక్క భగినులను పూజించవలెను. భగినికికూడ భ్రాతృపూజనముచేత భ్రాతకు చిరజీవనమున్ను అవైధవ్యమున్ను గలుగును. ఇది చేయకపోతే సప్తజన్మములయందు భ్రాతృనాశముగలుగును. ఈద్వితీయ పూర్వదినమందుమాత్రమే అపరాహ్ణమును వ్యాపించియుండుటయందు పూర్వదినముగ్రహించతగినది. ఇతర సర్వపక్షములయందు పరదినమేగ్రహించతగినది. ఈద్వితీయయందు యమునాస్నానమున్ను, అపరాహ్ణకాలమందు చిత్రగుప్తయమదూత సహితయమ పూజనముయమునికొరకు అర్ఘ్యదానమున్ను చేయదగినది. భౌమవారయుక్తమైన కార్తికశుక్ల షష్ఠియందు వహ్నినిపూజించి వహ్నిప్రీతికొరకు విప్రభోజనము చేయించతగినది. కార్తిక శుక్ల నవమియుగాదియని తెలియదగినది. ఏకాదశిమొదలు అయిదుదినములయందు భీష్మపంచక వ్రతముచేయదగినది. దీని నిర్ణయము ధర్మసింధువుయందున్ను దీనివ్రతప్రయోగము కౌస్తుభమందున్ను చూడవలెను. కార్తికమాసమందు ఏకాదశిమొదలైన పర్వమందు చంద్రతారాబలములుండగా "కార్తికే శుక్లతాదీక్షా నృణాంజన్మవిమోచనీ" అని వచనమువలన శివవిష్ణుమంత్రగ్రహ





ణాదిరూపమైన దీక్షచేయదగినవి. ఈశుక్లైకాదశియందే ధాత్రీమూలమందు దేవపూజనుచేయవలెను. రేవతీ నక్షత్రయోగములేనట్టి కార్తిక శుక్ల ద్వాదశియందు పారణముచేయదగినది. ఈద్వాదశియందు విష్ణుప్రబోధోత్సవము చేయదగినది. అందులో ద్వాదశికి రేవత్యంత్యపాదముతో యోగముగలిగియుండినట్టి రాత్రి ప్రథమభాగమందు ప్రశస్తమైనది. అది దొరకనపుడు అదేరాత్రియందు ద్వాదశియుండగా రేవతీనక్షత్ర సామాన్యముతో యోగముండినా గ్రహించవలెను. అది దొరకనపుడు రాత్రి ప్రథమభాగమందు కేవల ద్వాదశియుండినను గ్రహించవలయును. ఇట్లనే కేవలరేవతియుండినను గ్రహించవలయు ద్వాదశీరేవతులు రెండున్ను రాత్రియందు లేకపోతే పగటియందేచేయవలయు ద్వాదశీమధ్యమందు చేయదగినదని కౌస్తుభమందుగలదు. ఇందుకు దేశాచారము వేరుగావున్నది గనుక ఈశాస్త్రనిర్ణయమునువిడిచి దేశాచారానుసారము ప్రబోధోత్సవముచేయదగినది. ఆదేశాచారమేమనగా "పారణాహేపూర్వరాత్రౌ" అని వచనమునునుసరించి పారణదినమందు రాత్రి పూర్వభాగమందు ద్వాదశి లేకపోయినప్పటికిని త్రయోదశియందే పారణదినమందు ప్రబోధోత్సవమును చేయుచున్నారు. ఇదియునుంగాక దేశాచారానుసారముగా తులసీవివాహమున్ను పారణదినమందు ప్రబోధోత్సవకర్మతోకూడ తంత్రత్వముచేతనే చేయవలయును అయితే శాస్త్రనిర్ణయమేమన్నను, తులసీ వివాహమునకు నవమిమొదలు మూడుదినములయందైనను ఏకాదశిమొదలు పూర్ణిమాంతములోపల యేదోవకదినమందైనను కార్తిక శుక్లాంతర్గత వివాహనక్షత్రములయందైనను చేయదగియుండుటవలన అనేకకాలములుగల వని తెలియదగినది. చాతుర్మాస్యవ్రతసమాప్తిన్ని కార్తికమాస వ్రతోద్యాపనమునున్ను చతుర్దశియందైనను పూర్ణిమయందైనను చేయవలయును. అనంతరము వైకుంఠచతుర్దశీనిర్ణయము చెప్పబడుచున్నది. పూర్వదినమందు ఉపవాసముచేసి అరుణోదయమును వ్యాపించిన చతుర్దశియందు శివమూర్తినిపూజించి ప్రాతఃకాలమందు పారణముచేయవలయు రెండుదినములయందు అరుణోదయమును వ్యాపించియుండుటయందు పరదినమందు అరుణోదయమందు పూజను పూర్వదినమందు ఉపవాసమునున్ను చేయవలయును. రెండుదినములయందు వ్యాపించకపోవుటయందు చతుర్దశితోకూడిన అహోరాత్రమందే అరుణోదయమందు పూజను పూర్వదినమందు ఉపవాస

మునున్ను చేయవలయు. కొందరయితే విష్ణుపూజయందు చతుర్దశి అర్ధరాత్రి నివ్యాపించినది గ్రహించతగినది రెండుదినములయందు వ్యాపించుట నిశీథప్రదోషములను రెండిటిని వ్యాపించినది గ్రహించతగినదని చెప్పియున్నారు. పరవిద్ధయైన ఈచతుర్దశియందు కార్తికవ్రతోద్యాపనాంగమగుటచేత ఉపవాసమును చేసి అధివాసనమునువుంచి "రాత్రౌజాగరణంకుర్యాద్గీతవాదిత్రమంగళైః। నరాణాంజాగరేవిష్ణోర్గీతంనృత్యంచకుర్వతాం। గోసహస్రంచదదతాంఫలంచసముదాహృతం" అని మొదలగు వచనములచేత చేయదగియున్నట్టి గీతనృత్యవాద్య విష్ణుచరిత పఠనాదులచేత హరిజాగరమునుచేసి పరవిద్ధపూర్ణిమయందు భార్యాసహితుడైన ఆచార్యునివరియించి అతోదేవా, అని రెండుమంత్రములచేత తిలపాయసమును హోమముచేసి గోదానముచేయతగినదని కార్తికమాస వ్రతోద్యాపనము తెలియదగినది. కార్తిక శుక్ల ద్వాదశియు పూర్ణిమయున్ను మన్వాదియని తెలియదగినది. కార్తికపూర్ణిమయందు చాతుర్మాస్యవ్రత సమాప్తి చేయదగినది. చాతుర్మాస్యలయందు చేయబడిన కామ్యవ్రతములనుగురించి చాతుర్మాస్యవ్రతసమాప్తియందు సాంగమగుటకొరకు దానములను చేయవలయును. ఇందుకు కామ్యవ్రతములనున్ను సాంగతార్థదానములనున్ను సర్వము ధర్మసింధువుయందు చూడవలెను. ఇదియునుగాక లక్షప్రదక్షిణలక్ష నమస్కారలక్ష వర్తివ్రతములు మొదలగునవికూడ చాతుర్మాస్యయందు చేయతగినవి. తత్ఫలతన్నిర్ణయములు ధర్మసింధువుయందు చూడతగినవి. ఇదేప్రకారము గోపద్మవ్రతమును ఆషాఢ శుక్లైకాదశి మొదలగుదినమందు ప్రారంభించి ప్రతిదినమందు ముప్పదిమూడు గోపద్మములనువ్రాసి గంధపుష్పములఛేత పూజించి అన్ని సంఖ్యలుగల అర్ఘ్యనమస్కారప్రదక్షిణలనుచేసి కార్తికద్వాదశియందు ముప్పదిమూడు అపూపములవాయనమును యివ్వవలయును. ఈప్రకారము అయిదు సంవత్సరములుచేసి ఉద్యాపనమును చేయవలయు. కార్తిక పూర్ణిమయందు కృత్తికానక్షత్రయోగముండుటయందు మహాపుణ్యత్వముగలదు. రోహిణీయోగమునందు మహాకార్తికీత్వముగలుగును. కార్తికపూర్ణిమయందు కృత్తికాయోగముండగా యెవ్వడు షణ్ముఖస్వామియొక్క దర్శనమునుచేసికొనునో అతండు యేడుజన్మములయందు ధనాఢ్యుడై వేదపారగుడగు విప్రుడగును. సూర్యుడు విశాఖయందుండగా యేదినము చంద్రనక్షత్రము కృత్తికగానుండునో ఆదినమందు





పద్మకయోగముగలదు. ఇది పుష్కరతీర్థమందుస్నానముజేయుటకొరకు మిక్కిలి ప్రశస్తమైనది. కార్తికపూర్ణిమయందు దానవిశేషములిచ్చుట ప్రశస్తమైనది. వృషోత్సర్గముకూడ అతిప్రశస్తమైనది. కార్తికకృష్ణపక్షమందు అష్టమి కాలాష్టమియని తెలియదగినది. ఇది మధ్యాహ్నవ్యాపినిగ్రహించతగినది. ఇచ్చట కాలభైరవస్వామిని పూజించి మూడుఅర్ఘ్యములివ్వవలయును. ఉపవాసము జాగరణమున్ను చేయదగినది.

అనంతరము మార్గశిరమాసమందున్న వ్రతాదులయొక్క నిర్ణయము చెప్పబడుచున్నది. ధనుఃసంక్రాంతియందు సంక్రాంతికన్నను పరమందు పదునారుఘడియలు పుణ్యకాలము. ఇతరమైనవిషయము పూర్వమందు చెప్పబడెను. మార్గశిర శుక్లపంచమియందు నాగపూజదాక్షిణాత్యులకు ప్రసిద్ధమైనది. ఇది షష్ఠితోకూడినది గ్రహించతగినది. మార్గశిర శుక్ల షష్ఠి చంపాషష్ఠియని తెలియదగినది. ఇది మహారాష్ట్రులయందు ప్రసిద్ధమైనది. ఏతన్నిర్ణయము ధర్మసింధువుయందు చూడతగును. ఇదే స్కందషష్ఠియని తెలియదగినది. అది పూర్వవిద్ధ గ్రహించతగినది. అనంతరము సప్తమియందు సూర్యవ్రతము చేయదగినది. మృగశిరతోయుక్తమైన పూర్ణిమయందు లవణదానము చేయుటయందు సుందరరూపముగలుగును. మార్గశిర పూర్ణిమయందు దత్తాత్రేయోత్పత్తియైనది. ఇది ప్రదోషవ్యాపినిగ్రహించతగినది. మార్గశిర శుక్ల చతుర్దశియందైనను పూర్ణిమయందైనను ఆశ్వలాయనులచేత ప్రత్యవరోహణముచేయతగినది. ఇచ్చట కర్మకాలమునువ్యాపించిన తిథిగ్రహించతగినది. మార్గశిరమాసము మొదలయిన నాలుగుమాసములయొక్క కృష్ణాష్టములయందు అష్టకాశ్రాద్ధములున్ను అందుకు పూర్వమందున్న సప్తములయందు పూర్వేద్యుఃశ్రాద్ధములున్ను అందుకుముందున్న నవములయందు అన్వష్టక్యశ్రాద్ధములున్ను చేయతగినవి. ఇచ్చట విశేషము ధర్మసింధువుయందు చూడతగినది. అచ్చట అష్టకాశ్రాద్ధమందు అపరాహ్ణమును వ్యాపించిన అష్టమిగ్రహించతగినది. అష్టమిననుసరించుటచేత పూర్వపరదినములయందు పూర్వేద్యుఃశ్రాద్ధాన్వష్టక్యశ్రాద్ధములు చేయతగినవిగాని సప్తమినవములకు అపరాహ్ణవ్యాప్తిని అపేక్షించరాదు. ఇచ్చట విశేషములు ధర్మశాస్త్రగ్రంథములయందు చూడతగినవి. అష్టకాశ్రాద్ధలోపమందు ప్రాజాపత్యమైనను ఉపవాసమైనను ప్రాయశ్చిత్తము. అన్వష్టక్య

శ్రాద్ధలోపమందు నూరుమార్లు ఏభిర్ద్యుభిః సుమనాః, అని మంత్రజపముచేయ
దగినది.

అనంతరము పుష్యమాసనిర్ణయము చెప్పబడుచున్నది. పగలుమకరసం
క్రాంతియైనపుడు సంక్రాంత్యనంతరము నలువదిగడియలు పుణ్యకాలము. ఘడి
యమొదలుగా కొంచము పగటికాలము శేషించియుండగా మకరసంక్రాంతియై
నపుడు సంక్రాంతికిసమీపమందున్న పూర్వకాలమందు పగటియందే స్నానము
శ్రాద్ధము దానము భోజనము, అనునవి చేయతగినవి. రాత్రియందెప్పుడైనను
మకరసంక్రాంతియైనచో పరదినము పుణ్యము. అందులోకూడ పరదినపూర్వభా
గము మిక్కిలి పుణ్యము. అందులోకూడ సూర్యోదయానంతరము అయిదుఘడి
యలు మిక్కిలి విశేషపుణ్యములు. ఇదేప్రకారము పగటియందు సంక్రాంతి
యైనప్పుడుకూడ సంక్రాంతికి సమీపమందున్న ఘడియలు మిక్కిలి పుణ్యములు.
యెంతమాత్రము సంక్రాంతికి దూరకాలమో అంతమాత్రము ఆఘడియలు
తక్కువగా పుణ్యమునిచ్చునవి. సంక్రాంతులయందు స్నానశ్రాద్ధదానాదులు
నిత్యములు. ఇచ్చటదానవిశేష తత్ఫలములు పురాణధర్మశాస్త్రగ్రంథముల
యందు చూడవలెను. బుధవారముతోకూడిన పుష్యశుక్లాష్టమియందు స్నాన
జపహోమతర్పణ బ్రాహ్మణభోజనములు చేయదగినవి. పుష్యశుక్లైకాదశి మన్వా
దియని తెలియదగినది. అనంతరము మాఘస్నానము నిర్ణయింపబడుచున్నది.
పుష్యశుక్లైకాదశి యందయినను పూర్ణిమయందైనను అమావాస్యయందైనను
మాఘస్నానము నారంభించవలయు. మాఘమాసమందు ద్వాదశియందైనను
పూర్ణిమయందైనను ముగించవలయు. ఇది యొకపక్షము మరియొకపక్షమందు
మకరసంక్రాంతి ప్రవేశదినము మొదలు కుంభసంక్రాంతివచ్చునంతవరకు చేయ
వలయు. అరుణోదయముమొదలు ప్రాతఃకాలమువరకు స్నానకాలము. ఈమా
ఘవ్రతనియమములు అనేకములు పురాణధర్మశాస్త్రగ్రంథములయందు అవ
శ్యము చూడతగినవి. ఈమాఘస్నానము నిత్యము కామ్యము అని రెండురూప
ములైనది. పుష్యమాసమందు అమావాస్య సూర్యవారము వ్యతీపాతశ్రవణము,
వీటితోకూడితె అర్ధోదయమగును యోగవిశేషముగలదు. ఇది కోటిసూర్యగ్రహ
ములతో సమానమైన పుణ్యకాలము. ఈయోగములో కొంచమున్యూనమ





యితే మహోదయమని చెప్పంబడును. ఇందునుగురించి పరియోగము హేమా
ద్రియందు చూడతగినది.

అనంతరము మాఘమాసము నిర్ణయింపబడుచున్నది. కుంభసంక్రాంతి
యందు పూర్వము పదునారుఘడియలు పుణ్యకాలము. మాఘమాసమందు వేణీ
స్నానము అతివిశేషఫలప్రదము మాఘమందు తిలపాత్రదానము, సాలగ్రామదా
నము, ప్రయాగయందు వేణీదానము, ప్రయాగయందు మోక్షార్థము దేహ
త్యాగము, తిలభోజన తిలదాన తిలహోమాదులు, ప్రశస్తములు మాఘశుక్ల
చవితియందుండి రాజోద్దేశముగా నక్తవ్రతముండి రాజపూజయు తిలలడ్డుకాదినై
వేద్యము తిలభక్షణమున్ను చేయతగినది. ఇది ప్రదోషవ్యాపిని గ్రహించతగినది.
ప్రదోషవ్యాపినియైన ఇదే చవితియందు కుందపుష్పములచేత శివస్వామినిపూ
జించి ఉపవాసమును నక్తభోజనమును చేయవలెను లక్ష్మీప్రాప్తిగలుగు. మాఘ
శుక్లపంచమి వసంతపంచమియని తెలియదగినది. దీనియందు వసంతోత్సవారంభ
ముచేయతగినది. మాఘశుక్లసప్తమిరథసప్తమియని తెలియదగినది. అది అరు
ణోదయవ్యాప్తిని గ్రహించతగినది. రెండుదినములయందు అరుణోదయమును
వ్యాపించియుండగా పూర్వదినము గ్రహించతగినది. ఈవ్రతమందు షష్ఠియందు
ఏకభుక్తవ్రతమునుచేసి సప్తమియందు అరుణోదయమందు స్నానమును చేయవ
లెయును. ఇది మన్వాదికూడ నని తెలియదగినది. మాఘశుక్లాష్టమి భీష్మాష్టమి
యని తెలియదగినది. ఈఅష్టమియందు భీష్మోద్దేశముగా యెవ్వరు శ్రాద్ధమునుచే
యుచున్నారో వారు సంతతి గలవారగుచున్నారు. ఇచ్చట శ్రాద్ధము కామ్యము
తర్పణము నిత్యమైనది. అపసవ్యముచేత తర్పణముచేసి సవ్యముచేత నర్ఘ్యముని
వ్వవలయు. ఇచ్చట జీవత్పితృకునికూడ అధికారము గలదు. ఇచ్చట మధ్యాహ్న
మును వ్యాపించిన అష్టమి గ్రహించతగినది. మాఘశుక్లద్వాదశియందు తిలో
త్పత్తియైనది. దీనియందు ఉపోష్యముచేసి తిలస్నానమును తిలలచేత విష్ణుపూజ
నమును తిలనైవేద్యము, ఈమొదలగు సర్వము తిలలచే చేయతగినది. మాఘపూ
ర్ణిమపరవిద్ధ గ్రహించతగినది. దీనియందు విశేషముగ బ్రాహ్మణభోజనమును, దం
పతులకు వస్త్రాభరణములచేత పూజను, నానావిధదానములను, విష్ణుప్రీతికొరకు
దానముచేయవలయు. అనంతరము మాఘస్నానసాంగత్వముకొరకు ఉద్యాపనము
చేయవలయు.

అనంతరము శివరాత్రి నిర్ణయింపబడుచున్నది. ఇది నిశీథవ్యాపిని గ్రహించతగినది. నిశీథమనగా రాత్రియందు యెనిమిదవ ముహూర్తము. అచ్చట పరదినమందు మాత్రము అర్ధరాత్రిని వ్యాపించియుండగా పరదినము గ్రహించతగినది. పూర్వదినమందు మాత్రమే వ్యాపించియుండగా పూర్వదినము గ్రహించతగినది. రెండుదినములయందున్ను అర్ధరాత్రిని వ్యాపించకబోయినను పరదినమే గ్రహించతగినది. రెండుదినములయందున్ను సంపూర్ణముగా వ్యాపించినా పరదినమే గ్రహించతగినది. రెండుదినములయందున్ను కొంతకొంతభాగము వ్యాపించినా పరదినమే గ్రహించతగినది. రెండుదినములలో వకదినమందు పూర్తిగా వ్యాపించినదై వకదినమందు కొంతభాగము వ్యాపించినచో యేదినమందుపూర్తిగావ్యాపించియుండునో ఆదినము గ్రహించతగినది. ఈచతుర్దశి ఆదివారభౌమవారయోగమందును శివయోగయోగమందున్ను మిక్కిలి ప్రశస్తమైనది. పరదినమందు ప్రాతఃకాలమందు పారణము చేయతగినది. వ్రతప్రయోగములు సవిస్తరముగా ధర్మసింధువుయందు చూడతగినవి. మాఘామావాస్య యుగాదియని తెలియదగినది. మాఘామావాస్యయందు శతతారయోగము గలిగినచో మిక్కిలి పుణ్యకాలము. ఇచ్చట శ్రాద్ధముచేయుటవలన మిక్కిలి తృప్తిగలుగును. ధనిష్ఠానక్షత్రయోగమందయితే తిలాన్నముచేత శ్రాద్ధము చేయతగినది. దానిచేత పదివేలుసంవత్సరము పితృతృప్తిగలుగును.

అనంతరము ఫాల్గునమాసమందున్న వ్రతాదులయొక్క నిర్ణయము చెప్పబడుచున్నది. మీనసంక్రాంతియందు సంక్రాంతికన్నను పరమందు పదునారుఘడియలు పుణ్యకాలము ఫాల్గుణమందు గోవ్రీహివస్త్రదానము గోవిందప్రీతికొరకుచేయతగినది. ఫాల్గుణ శుక్లపాడ్యమి మొదలు పదిరెండుదినముల పర్యంతముపయోవ్రతము చేయదగినదని శ్రీమద్భాగవతమందు చెప్పబడినది. ఫాల్గునపూర్ణిమమన్వాదియని తెలియదగినది. ఈపూర్ణిమయేహోళికయని తెలియదగినది. ఇది ప్రదోషకాలమును వ్యాపించినదై భద్రాకరణసహితమైనది గ్రహించతగినది. ఇచ్చట విశేషనిర్ణయము ధర్మసింధువుయందు చూడతగినది. దీనియందుహోళికాపూజనమును చేయవలయు. హోళికాదినము గ్రహణదినము భావుకదినము అయనదినము ప్రేతదాహదినము, ఈ అయిదుదినములున్ను ఈదినములకు పరమందున్న కరిసంజ్ఞగల అయిదుదినములున్ను సకలశుభకర్మలయందు





వర్జించతగినవి. ఫాల్గునమాసమందు నియమముతో గోవిందమూర్తిని దోళయందుంచిన నరుడు గోవిందపురమును గురించి పోవలయును. ఫాలుగునామావాస్యమన్వాదియని తెలియదగినది. ఇది ఫాల్గుణమాసనిర్ణయముముగిసెను

ఇంకను యీవ్రతప్రకరణమందు పరిశేషించిన వ్రతాదులుకొన్ని నిర్ణయింపబడుచున్నవి. మేషసంక్రాంతియందు మేషదానముచేయతగినది. వృషభమందు గోదానముచేయతగినది. మిథునమందు వస్త్రాన్నాదిదానము కర్కాటమందుఘృతధేనుదానము సింహమందు ఛత్రము సువర్ణము, కన్యయందు గృహము వస్త్రము, తులయందు తిలలుగోరసములు, వృశ్చికమందు దీపము, ధనస్సుయందు వస్త్రము యానము. మకరమందు కాష్ఠములు అగ్నియు కుంభమందు గోవుజలముతృణము, మీనమందు భూమియుహారములున్ను దానము చేయతగినవి. ఈఈదానములు తత్తత్సంక్రాంత్యనుసారముగా ముఖ్యములు ఇట్లనే ఇతర సకలదానము లనుకూడ చేయవలయును గాని చేయకపోరాదు. ‘‘సంక్రాంతిషుయథాకాలస్తదీయేష్వయనేతథా’ అని వచనము ననుసరించి ఆయాసంక్రాంతిసంబంధములైన అయినదినములయందు కూడ ఆయాసంక్రాంతులయందు యోగ్యమైనస్నానదానాదికము చేయతగినది. ఈకాలమందు సామాన్యతః సంక్రాంతికియిరువైయొకదినములు పూర్వమునందు అయనప్రవేశమగుచున్నది. వృషసింహవృశ్చికకుంభములయందు సంక్రాంతివిష్ణుపదమని సంజ్ఞగలది. మిథునకన్యాధనుర్మీనములయందు సంక్రాంతిషడశీతియని సంజ్ఞగలది. మేషతులలయందు సంక్రాంతివిషువమనిసంజ్ఞగలది. కర్కాటకమకరములయందు సంక్రాంతిఅయనమని సంజ్ఞగలది. విష్ణుపదసంక్రాంతికన్నను షడశీతి సంక్రాంతిపుణ్యవిశేషముగలది. షడశీతికన్నను విషువము పుణ్యవిశేషముగలది. విషువముకన్నను అయనము పుణ్యము యెవ్వనియొక్క జన్మనక్షత్రమందు సూర్యసంక్రాంతియగునో అతనికి ధనక్షయము మొదలయిన పీడగలుగును. తత్పరిహారముకొరకు పద్మపత్రాదియుక్తజలముచేత స్నానము చేయతగినది. విషువాయన సంక్రాంతులు పగటియందు గలిగితే దానివెనుకటి రాత్రియందును ముందురాత్రియందును ఆపగటియందును అధ్యాపనాధ్యయనములను వర్జించవలెను. రాత్రియందు గలిగితె వెనుకటిపగటియందును ముందు పగటియందును ఆరాత్రియందును వర్జించవలెను.

రెండు సంక్రాంతులతోకూడిన మాసము క్షయమాసమనంబడును. సంక్రాంతిలేని మాసము అధికమాసమనంబడును. ఈరెండిటికిని మలమాసమనినా

మము కూడగలదు. ఈమలమాసనిర్ణయము మలమాసకార్యాకార్యములున్ను ధర్మశాస్త్రగ్రంథములయందు చూడవలెను. అయినను ఇచ్చట కొంచముగా వ్రాయుచున్నాను. అనన్యగతికమైన నిత్యమునైమిత్తికము కామ్యమున్ను మలమాసమునందు చేయతగినది. సగతికమైన నిత్యము నైమిత్తికము కామ్యమున్ను వర్జించతగినది. చైత్రాది మలమాసములయందు మృతులైనవారికి ఏకానేక సమయమందు బహుకాలముచేత అదేమాసమే మలమాసముప్రాప్తించియుండగా మలమాసమునందే ప్రతిసాంవత్సరీక శ్రాద్ధమును చేయవలయు. చైత్రాదిశుద్ధమాసమందు మృతులైనవారికయితె ప్రత్యాబ్దికశ్రాద్ధమును మలమాసమందుచేయరాదు శుద్ధమాసమైన చైత్రాదిమాసమందే చేయవలయు. శుద్ధమాసమందు మృతులైనవారికయితె ప్రథమాబ్దికమును మలమాసమందే చేయవలయును గాని శుద్ధమాసమందు చేయరాదు. ద్వితీయాబ్దికమయితె శుద్ధమాసమందే చేయవలయును. ఏకాదశాహాంత కర్మనుసపిండీకర్మనున్ను మలమాసమందు కూడ చేయవయును. రెండవమాసికము మొదలగుశ్రాద్ధమునయితె మలమాసమందు నుశుద్ధమాసమందున్ను ఆవృత్తిచేత రెండుమార్లు చేయవలయు. క్షయమాసమందు శ్రాద్ధనిర్ణయము నయితె ధర్మసింధువుయందు చూడవలయు. యేదిమలమాసమందు వర్జించతగినదో అది గురుశుక్రులయొక్క అస్తబాల్యవార్ధకములయందుకూడ సింహమందు సూర్యుడున్నపుడు కూడవర్జించతగినది. సింహస్థసూర్యాపవాదము గ్రంథాంతరమందు చూడవలెను.

సామాన్యముగ తిథినిర్ణయమున్ను, కర్మవిశేషమందు నిర్ణయమున్ను, వ్రతపరిభాషయున్ను, ధర్మసింధువుయందు చూడవలెను. అనంతరము ఏకాదశీనిర్ణయము చెప్పబడుచున్నది. అచ్చట ఏకాదశ్యుపవాసము రెండువిధములు. భోజనమును చేయకూడదనే మాటను పాలించుట రూపమైనది మొదటిది వ్రతరూపమైనది రెండవది మొదటిదానియందు పుత్రవంతుడైన గృహస్థుడు మొదలగువారికి కృష్ణపక్షమందుకూడ అధికారముగలదు. వ్రతరూపమైన ఉపవాసమయితే అపత్యయుక్తులయిన గృహస్థులచేతనున్ను కృష్ణపక్షమందున్ను చేయదగదు. మరియేమన్నను సమంత్రకమైన వ్రతసంకల్పమునుచేయక యథాశక్తిగా నియమయుక్తమైన భోజనవర్జనమునే చేయవలయును. ఈప్రకారము తిథిక్షయమందున్ను శుక్లైకాదశియందున్ను తెలియదగినది. శయనీ బోధన్యేకాదసుల





కు మధ్యమందుండిన కృష్ణపక్షైకాదసులయందు సాపత్యగృహస్థులు మొదలగు సర్వులకున్ను అధికారముగలదు. కామ్యవ్రతమును చేయుటయందయితే పక్షద్వయమందు సర్వమాసములయందు చేయవచ్చును. అచ్చటయే నిషేధమున్ను లేదు. ఈ ఏకాదశీవ్రతము శైవులు వైష్ణవులు సౌరులు మొదలగు సర్వులకున్ను నిత్యమైనది. అది యేలననగా చేయకబోతే "అర్కపర్వద్వయేరాత్రౌ చతుర్దశ్యష్టమీదివా। ఏకాదశ్యామహోరాత్రంభుక్త్వాచాంద్రాయణంచరేత్" అని ప్రత్యవాయమున్నందువల్లనని తెలియదగినది. సంపత్తుమొదలగు ఫలము గలుగుచున్నందువలన కామ్యము కూడనగుచున్నది. ఎనిమిది సంవత్సరములు మొదలు యెనబది సంవత్సరముల పర్యంతము ఏకాదశీవ్రతమందు అధికారముగలదు. శక్తునికయితే యెనబది సంవత్సరములపైనకూడ నధికారముగలదు. శక్తితారతమ్యానుసారము "నక్తంహవిష్యాన్నమనోదనంవా ఫలంతిలాఃక్షీరమథాంబుచాజ్యం। యత్పంచగవ్యంయదివాపివాయుః ప్రశస్తమత్రోత్తరముత్తరంచ" అని వచనానుసారముగా యేదో వకపక్షము నాశ్రయించవలయునుగాని ఏకాదశీత్యాగమును చేయరాదు. అశక్తపతిపుత్రాద్యుద్దేశముచేత స్త్రీపుత్రభగినీభ్రాత్రాదులచేత ఏకాదశీవ్రతమును చేయుటయందు నూరుయజ్ఞములు చేసినంత పుణ్యమువచ్చును. వైష్ణవులకు స్మార్తులకున్ను ఏకాదశ్యుపవాసమును గురించి దిననిర్ణయమున్ను ద్వాదశీ నిర్ణయమున్ను ధర్మసింధువుయందు చూడతగినది. ఇష్టిపిండపితృయజ్ఞదర్శ శ్రాద్ధాద్యనేక నిర్ణయములుకూడ ధర్మసింధువుయందు చూడతగినవి.

అనంతరము గ్రహణనిర్ణయము చెప్పబడుచున్నది. చంద్ర సూర్యగ్రహణము యెంతకాలము చాక్షుషదర్శన యోగ్యమైనదో అంతకాలము పుణ్యకాలము. అందువలన గ్రస్తాస్తవిషయమందు అస్తమానానంతరము ద్వీపాంతరమందు గ్రహణమున్నప్పటికిని దర్శనయోగ్యముగాకబోవుటవలన పుణ్యకాలముగాదు. అస్తమయమువరకే పుణ్యకాలము. ఈప్రకారముగ్రస్తోదయ విషయమందుకూడఉదయాత్పూర్వము పుణ్యకాలముగాదు. మేఘాదిప్రతిబంధముచేత చాక్షుషదర్శనము సంభవించకబోవుటయందు శాస్త్రీము మొదలగు దానిచేత స్పర్శమోక్షకాలములను తెలిసికొని స్నానదానాదులను చేయవలయు. ఆదివారము సూర్యగ్రహణముసోమవారమందు చంద్రగ్రహణముచూడామణియని సంజ్ఞగలది. ఆయోగమం

దుస్నానాదికము అనంతఫలము. గ్రహణస్పర్శకాలమందు స్నానము, మధ్యకాలమందు హోమము దేవతార్చనము శ్రాద్ధము, విడుచుచుండగా దానము, మోక్షానంతరము స్నానము, చేయుతగినదని క్రమము తెలియదగినది. అచ్చట స్నానజలములయందు తారతమ్యము "శీతముష్ణోదకాత్పుణ్యమపారక్యం పరోదకాత్ । భూమిష్ఠముద్ధృతాత్పుణ్యం తతఃప్రస్రవణోదకం ॥ తతోఽపి సారసం పుణ్యం తతః పుణ్యంనదీజలం । తత స్తీర్థ నదీగంగా పుణ్యాపుణ్య స్తతోఽంబుధిః" అను ప్రకారము తెలియదగినది. గ్రహణమందు స్నానమును సచైలముగా చేయవలయునుజాతాశౌచమందున్న మృతాశౌచమందున్న గ్రహణనిమిత్తమైన స్నానదానశ్రాద్ధాదికమును చేయవలయునుగాని విడువరాదు. మూడుదినములైనను ఒకదినమైనను ఉపవాసముచేశి గ్రహణమందుస్నానదానాదులను చేయుటయందు మహాఫలముగలదు. పుత్రవద్గృహస్థునికి గ్రహణసంక్రాంత్యాదులయందుఉపవాసమునుచేయరాదు. గ్రహణమందు గోభూహిరణ్యధాన్యాది దానము మహాఫలప్రదము. తపస్సున్ను వేదశాస్త్రవిద్యలున్ను గల బ్రాహ్మణుడు ముఖ్యమైనదానపాత్రము. సత్పాత్రమందు దానముచేసితే పుణ్యవిశేషముగలదు. అయితే "సర్వంగంగా సమంతోయం సర్వేవ్యాస సమాద్విజాః । సర్వంభూమి సమం దానం గ్రహణేచంద్రసూర్యయోః" అని వచనముగ్రహణపుణ్యాధిక్యమును తెలియజేయునదేగాని పాత్రవిశేషమందు దానముజేయుటచే గలిగెడు పుణ్యవిశేషమును బోధించునదిగాదు. పాత్రవిశేషమందు పుణ్యవిశేషమును బోధించునట్టి వచనమేమనగా "సమమబ్రాహ్మణేదానం ద్విగుణంబ్రాహ్మణబ్రువే । శ్రోత్రియేశతసాహస్రం పాత్రేత్వానంత్యమశ్నుతే" అని తెలియదగినది. గ్రహణమందుశ్రాద్ధమును ఆమముచేతగాని సువర్ణముచేతగాని చేయవలయును. గ్రహణమందు తులాదానము మొదలగునది సంపదగలవానిచేత చేయతగినది. గురూపదిష్టమైన స్వస్వేష్టదేవతా మంత్రజపము గాయత్రీజపమున్ను అవశ్యము గ్రహణమునందు చేయతగినదిగాని అట్లుచేయని పక్షమునకు మంత్రమాలిన్యముగలుగును. గ్రహణకాలమందు శయినించితే రోగముగలుగు. మూత్రముజేసితే దారిద్ర్యముగలుగు. పురీషముజేసితే కృమిజన్మమువచ్చును. మైథునముజేసితే గ్రామసూకరజన్మమువచ్చును. అభ్యంగనముచేసికొనిన కుష్టురోగమువచ్చును. భోజనముచేసితే నరకమువచ్చును. పూర్వమందు పక్వముచేయబడిన యన్నముజలము





గ్రహణానంతరము వర్జించతగినది. సూర్యగ్రహణమందు గ్రహణయామము కన్నను పూర్వము నాలుగుయామములు వేధకాలము చంద్రగ్రహణమందయితే మూడుయామములు వేధకాలము. వేధకాలమందు, భోజనముచేయరాదు. బాలవృద్ధాతురులకు ఆరుముహూర్తములయినా మూడుముహూర్తములయినా వేధకాలము. శక్తునికి వేధకాలమందు భోజనముచేయుటయందు మూడుదినములు ఉపవాసము ప్రాయశ్చిత్తము. గ్రహణకాలమందు భోజనము చేయుటయందు ప్రాజాపత్యకృచ్ఛ్రము ప్రాయశ్చిత్తము. చంద్రునియొక్క గ్రస్తోదయమందు పూర్వము పగలుభోజనముచేయరాదు. గ్రస్తాస్తమందయితే పరదినమందు రాత్రిచంద్రుని చూచి స్నానముచేశి జలాహరణపాకాదులనుచేశి భోజనముచేయవలయును. యెవ్వనియొక్క జన్మరాశియందుగాని జన్మనక్షత్రమందుగాని గ్రహణము గలుగునో అతనికి విశేషముగా అనిష్టముగలుగును. లేక బింబదానమైనా చేయదగినది. యెవ్వనికి జన్మరాశిమొదలగుదానియందు గ్రహణముగలుగునో అతనిచేత గ్రస్తబింబము చూడదగదు. ఇతరులచేతకూడ పటజలాదివ్యవధానముచేతనే గ్రస్తబింబము చూడదగినదిగాని ప్రత్యక్షముగా చూడతగదు. సూర్యగ్రహణము పట్టునప్పుడు చంద్రగ్రహణము విడుచుకాలమందు పితృతర్పణము చేయవలెను.

సముద్రమందు పూర్ణిమ అమావాస్య మొదలయిన పర్వదినములయందు స్నానముజేయవలయు. శుక్రవారమంగళవారములయందు స్నానమును వర్జించవలెను. అశ్వత్థమును సముద్రమునున్ను సేవించవలయుగాని స్పర్శనముమాత్రము వక్కానొక సమయమందైననుకూడదు. అయితే శనివారమందు అశ్వత్థమును, పర్వమందు సాగరమునున్ను స్పృశించవలెను సేతువుయందు సముద్రస్నానము జేయుటయందు కాలనియమములేదు.

తిథివిశేషమందు నక్షత్రవిశేషమందు వారాదులయందున్న విధినిషేధముధర్మసింధువుయందు చూడవలెను.

ఇది వ్రతప్రకరణము ముగిసెను.

## ప్రకీర్ణప్రకరణము.

అనంతరము ప్రకీర్ణక విషయములను కొంచముగావ్రాయుచున్నాము.

సర్వఋతువులయందు స్త్రీలుకుసాధారణములైననియమములెవ్వియనగా, మూడుదినములుతాను స్పృశించతగనిదై యుండి అభ్యంగము అంజనముస్నానముదివాస్వాపము అనగా పగలునిద్రించడం అగ్నిస్పర్శము దంతధావనము సూర్యాలోకనము, వీటినివిడువవలయును. నేలమీదశయనించవలయును. అంజలి

చేతనైనను తామ్రమలోహపాత్రముచేతనైనను ఉదకమునుపానము చేయరాదు. రజస్వల మరియొకరజస్వలను శూద్రాదులనున్ను స్పృశించరాదు. నాలగవదినమందు రజోనివృత్తియైనపిమ్మటపతి సంపర్కమందు శుద్ధిగలదు. అయిదవదినమందుదైవపిత్ర్యకర్మయందుశుద్ధిగలదు. నాలగవదినమందు రజోనివృత్తిగాకుండినచో పతి సంపర్కమందు కూడశుద్ధిలేదు. రజస్వలాస్త్రీజ్వరాదులచేత ఆతురాలయి నాలగవదినమందు స్నానముజేయుటకై శక్తిలేనిదయిన పక్షమందు అపుడు ఆస్త్రీనిమరియొకస్త్రీఅయినను నరుడైనను పదిమార్లుస్పృశించి స్నానము చేయవలయును ఆచమనముచేయవలయును. ప్రతిస్నానమందున్ను ఆతురునికి మరియొకమరియొక వస్త్రమును ధరింయింపజేయవలయును. కడపటి స్పృశింపబడినసమస్తవస్త్రములకు త్యాగమును జేయవలయు. ఆర్ద్రవస్త్రము మొదలగుదాని వ్యవధానము చేతశుద్ధవస్త్రమును గ్రహించిన పిమ్మట బ్రాహ్మణభోజనమువల్లను పుణ్యాహవాచనమువల్లనున్ను శుద్ధిగలుగును. ఇతరవిధములచేత ఆతురులగుసమస్తాతురులకున్ను ఇదేప్రకారముశుద్ధి విధింపబడుచున్నది. ముఖ్యకాలమందుగర్భాధానముచేయుటయందు గురుశుక్రాస్తము అధికమాసము మొదలగు దోషములేదు. రజస్వల అగుటకన్నను పూర్వమేభార్యా గమనముచేయుట యందు బ్రహ్మహత్యాదోషము గలదు. ఋతువుయందుగమనము ఆవశ్యకము అట్లుగాకపోయినచో భ్రూణహత్యా దోషముగలుగును. ఋతుకాలమయితేరజోదర్శనదినము మొదలు పదునారు దినములని తెలియవలెను. అందులో మొదటి నాలుగుదినములు పదనొకండవదినము పదుమూడవదినము, ఈదినములయందుగమనమునువర్జించి మిగిలినపది దినములయందు భార్యాగమనమును చేయవలయును. అందులోకూడ పంచపర్వములు, శ్రాద్ధము, ఏకాదశి, ఉపవాసదినము, యీ మొదలగు దినములను విడిచిఇతరదినములయందు భార్యాగమనమునుచేయవలయును. మరియుమఖా, మూల, పాతయోగము, మొదలగువాటిని వర్జించవలయును. ఋతుకాలముకన్ననితరకాలమందు భార్యాగమనమును వర్జించవలయు ఇట్లునియమముగా భార్యాగమనము చేయడము బ్రహ్మచర్యవ్రతమని తెలియవలెను. అయితే ఇట్లుచేయుటవలన స్త్రీకిమిక్కిలిఅసంతోషము గలిగియుండినచో నిషిద్ధదినములను విడిచిఋతుకాలమందున్ను అరుతుకాలమందున్ను భార్యాగమనముచేయవచ్చును. ఇట్లుచేసితేదోషములేదు బ్రహ్మచర్యమునకు మాత్రము హానికలుగును. పగటియందు భార్యాగమనముమిక్కిలి నిషిద్ధము. అనేకభార్యలు గలవానికి ఏకకాలమందేవారికి ఋతువులుసంభవించినపుడు వివాహక్రమముచేతనైనను ఋతుక్రమముచేతనైనను భార్యాగమనము చేయదగినది. వ్యాధిబం





ధనప్రవాసాదులవలన ఋతువుయందు భార్యాగమనముసంభవించక పోయినను దోషములేదు. వృద్ధావంధ్యావ్యభిచారిణ్యాది దోషయుక్తురాలయిన భార్యయొక్కగమనముచేయరాదు.

దత్తపుత్రుణిగ్రహించేవిషయమునందు గ్రహించతగినవాడు గ్రహించతగనివాడు, అనువానియొక్కవిచారముచేయబడుచున్నది. బ్రాహ్మణులకు సోదరభ్రాతృపుత్రుడు ముఖ్యుడగుటవలన ప్రథమమందు గ్రహించతగును. అతడు దొరకనపుడు సగోత్రుడైనసపిండుడైన యొకానొకసాపత్న్య భ్రాతృపుత్రుడైనను గ్రహించతగును. అతడుదొరకనపుడు అసగోత్రుడైన సపిండుడైన మాతులకులమందు బుట్టినవాడు పితృష్వస్రాదికులమందు బుట్టిన వాడు గ్రహించతగును. అతడు దొరకనపుడయితే అసపిండుడై సమానగోత్ర మందు బుట్టినవాడు గ్రహించతగును. అతడుకూడ దొరకనపుడయితే అసపిండుడై పృథగ్గోత్రుడైయున్న వాడైనను గ్రహించతగును. అసగోత్రసపిండుల యందు భాగినేయ దౌహిత్రులను వర్జించవలయును. భ్రాతకలిగియున్నట్టి దత్తపుత్రునినే గ్రహించవలయును. అందులోకూడ జ్యేష్ఠపుత్రుని గ్రహించరాదు దానము చేయరాదు. బ్రాహ్మణాదివర్ణముగల వారిచేత సమానవర్ణుడైన దత్తపుత్రుడే గ్రహించతగును. అందులోకూడ స్వదేశీయ స్వగృహ భాషాసంయుక్తుడగు వానినే గ్రహించవలెను. అయితే “భ్రాతృణామేకజాతానా మేకశ్చేత్పుత్రవాన్భవేత్ । సర్వేతేతేనపుత్రేణ పుత్రిణోమనురబ్రవీత్” అని వచనమువలనా సోదరభ్రాతృపుత్రుడు దత్తపుత్రునిగా గ్రహించకపోయినను అప్రజత్వప్రయుక్తదోష నివృత్తిద్వారా పితృఋణాపాకరణాదిపారలౌకిక సుఖముమాత్రము గలుగుటకై కొదవలేదు. మరియేమనగా తనభార్యకన్నను పూర్వమే మదీయ పిండదాన ధనగ్రహణములయందు ఇతడు అధికారికావలయునని కోరికెయున్నచో అతనిని దత్తపుత్రునిగా గ్రహించవలయును. కోరికెలేనిచో గ్రహించరాదు. దత్తపుత్రగ్రహణము శాస్త్రవిధానము ననుసరించి చేయదగినది. పతివుండగా పత్యాజ్ఞానుసారముగనే స్త్రీచేత దత్తపుత్రుడు గ్రహించతగును దానము చేయదగును. పత్యాజ్ఞలేకున్నచో గ్రహించతగదు దానముచేయతగదు. విధవయైన స్త్రీచేతకూడ పతిజీవించియున్నకాలములో దత్తపుత్రుని గ్రహించమని చెప్పి యుండగనైనను, తనతో చెప్పకపోయినా పుత్రగ్రహణవిషయమైన పత్యభిప్రాయమున్నట్లు ఆప్తముఖమువలన తెలియుచుండగనైనను, పుత్రుడు గ్రహించతగును. ఈ రెండువిధములుగను పతిఆజ్ఞ లేకపోవుటయందుకూడ ఆ యాశాస్త్రమువల్ల నిత్యకామ్యవ్రతాది ధర్మాచరణమందువలెనే పుత్రప్రతిగ్రహణ

మంచఃకూడ నాపుత్రస్యలోకోస్తి, అని మొదలగు సామాన్యశాస్త్రమువల్లనే విధవకు అధికారముగలదు. అట్టి స్త్రీకి పుత్రుని గ్రహించుటయందు ప్రతిబంధముచేత వృత్తిలోపపిండ విచ్ఛేదాదులనుజేయు నతడు నరకప్రాప్తిగల వాడగునో ఇందుకు "యోబ్రాహ్మణస్యవృత్త్యైతు ప్రతికూలంసమాచరేత్। విద్ధ్యజాంతుకృమీణాంస్యాత్" అని శాస్త్రమేప్రమాణము. ఈవిషయమును కౌస్తుభాది గ్రంథములయందు విస్తారముగచూడవచ్చును. స్త్రీలచేత పుత్రస్వీకారవిషయమందు వ్రతాదులయందువలెనే బ్రాహ్మణద్వారముగనే హోమము మొదలగు దానిని చేయించవలయును. పుత్రుని గ్రహించి ప్రతిగ్రహించినవానిచేత జాతకర్మము మొదలగు సంస్కారములనైనను చూడాకర్మము మొదలగు సంస్కారములనైనను చేయవలయును. అని ముఖ్యపక్షము అసంభవమందు సగోత్రసపిండులయందు కృతోపనయనుడైనప్పటికిన్ని వివాహితుడైనప్పటికిన్ని అసంజాతపుత్రుడైన దత్తపుత్రుడు గ్రహించతగును. అసపిండసగోత్రులయందు కృతోపనయనుడైనప్పటికిన్ని వివాహముగాక యున్నవాడే గ్రహించతగునని తెలియగినది. భిన్నగోత్రుడయితే అకృతోపనయనుడే గ్రహించతగును.

పరగోత్రమందు జనియించిన దత్తపుత్రునికి ఉపనయనముమాత్రముపాలకునిచేత చేయబడినదయినను, ఉపనయనానంతరము పుత్రుని గ్రహించుటయందైనను దత్తపుత్రునిచేత అభివాదనము శ్రాద్ధము మొదలగు కర్మలయందు రెండు గోత్రములయొక్క ఉచ్చారణము చేయదగినది. చౌలము మొదలగుసంస్కారమును పాలకుడే చేసియున్నప్పుడు పాలకైకగోత్రమే ఉచ్చరించతగినది. వివాహమందయితే సర్వదత్తకునిచేత జనకపాలకులనే యిద్దరుతండ్రులయొక్క గోత్రప్రవరములకు సంబంధించిన కన్యకవర్జించతగినది. ఇచ్చట యేడుపురుషులపర్యంతము అయిదుపురుషుల పర్యంతముఅని పురుష నియమము కనబడదు. ఆకారణముచేత శతపురుషానంతరము కూడ ద్విగోత్రము పోచాలదు. సాపిండ్యమయితే జనకగోత్రముచేత ఉపనయనము చేయుటయందు జనకపితృమాతృవులయొక్క కులమందు యేడుపురుషుల పర్యంతము అయిదుపురుషుల పర్యంతము తెలియదగినది. పాలకమాతృపితృవులయొక్క కులమందు మూడుపురుషులపర్యంతము గృహీతృగోత్రముచేత ఉపనయనము మాత్రము చేయబడుటయందు జనకపాలకపితృవులయొక్క కులమందు అయిదుపురుషుల పర్యంతము సాపిండ్యము మాతృకులమందయితే మూడుపురుషుల పర్యంతము. జాతకర్మము మొదలగు ఉపనయనాంతములయిన సంస్కారము పాలకునిచేత చేయబడినచో పాలక పితృకులమందుయేడుపురుషుల పర్యంతము పాలకమాత్రకులమందు అయిదు పురుషులపర్యం





తము సాపిండ్యము జనకకులమందు మూడుపురుషులపర్యంతము సాపిండ్యము. ఈ ప్రకారము దత్తకసంతతికికూడ సాపిండ్యము తెలియదగినది. ఈవిషయమునందు ఇతర సంగతులున్ను ఇందుకు మూలమున్ను ధర్మసింధువుయందు చూడతగినది. దత్తకుని గ్రహించినపిమ్మట ఔరసుడు జనియించితే దత్తకుడు నాలగవఅంశమునుపొందదగిన వాడేనని సమానాంశమును పొందదగిన వాడుగాదు.

ఉపనయనవిషయమందు కొంతసంగతిని వ్రాయుచున్నాము. తల్లిరజస్వలయయివుండినప్పుడున్ను, తండ్రి సమక్షమందు కర్తలయిన మాతులుడు జ్యేష్ఠభ్రాత మొదలగు వారియొక్క భార్య రజస్వలయయి వున్నప్పుడున్ను, ఉపనయనము వివాహము మొదలగునది చేయరాదు. నాందీశ్రాద్ధానంతరము తల్లిరజస్వలయయివుండగా భ్రాత మొదలగు మరియొక కర్తయున్నప్పటికిన్ని సన్నిహితమైనముహూర్తాంతరము దొరకనప్పుడు శాంతినిచేసి చేయవలయును. అట్లు లేనప్పుడు మరియొక ముహూర్తమునందే నని తెలియవలెను. త్రిపురుషాత్మకకులమందు ఆరుమాసములలోపల మౌంజీ వివాహరూపమైన మంగళానంతరము ముండనాఖ్యమైన చూడాకర్మ మొదలగుదానిని చేయరాదు. సంకటమునందు సంవత్సరభేదమందు చేయతగినది. నాలుగు పురుషులపర్యంతము కులమందు సపిండీకరణము మాసికశ్రాద్ధములు, ఏతదంతమైన ప్రేతకర్మము ముగియుటకన్నను పూర్వము చూడాకర్మము మొదలగు ఆభ్యుదయికమైన కర్మను చేయరాదు. ప్రారంభానంతరముసూతకము ప్రాప్తించుటయందు కూష్మాండీఋక్కులచేత ఘృతమును హోమముచేసి గోదానముచేసి చూడాకర్మము ఉపనయము వివాహము మొదలగు దానిని చేయవలయును. కుమారునికి ఉపనయనకాలమందు గాని కన్యయొక్క వివాహమందు గాని బృహస్పత్యానుకూలము లేకబోవుటయందుశౌన్యకాద్యుక్తమైనబృహస్పతిశాంతి చేయదగినది. పునరుపనయనము మూడువిధములుగా తెలియదగినది. యెట్లన్నను, ప్రత్యవాయ నిమిత్తకమైన ప్రాయశ్చిత్తభూతమైన పునరుపనయనము మొదటిది. ఇదియు జాతకర్మాది సంహితమైనది. జాతకర్మాదిరహితమైనది. ప్రాయశ్చిత్తాంతరసహితమైనది, కేవలమైనది, అని యనేకవిధములైనది చేయబడిన యుపనయనమునకు ఉక్తకాలము మొదలగు అంగ వైగుణ్యముచేత వైఫల్యప్రాప్తియందు రెండవది వేదాంతరాధ్యయనముకొరకు విహితమైనది మూడవది.

అనంతరము అధ్యయనధర్మములు వ్రాయబడుచున్నవి. వేదారంభమందున్ను వేదావసానమున్ను గురువుయొక్క పాదోపసంగ్రహణము చేయదగినది. ఆదియందు ప్రణవము నుచ్చరించి వేదము నధ్యయనముజేసి కడపట ప్రణవమునుచ్ఛ

శించి భూమిని స్పృశించి విరమించవలెను. రాత్రియొక్క మొదటియామమందు న్ను కడపటియామమందున్ను వేదాధ్యయనము చేయవగినది. ఇతరములైనరెం డుయామములయందు శయనించినవాడు బ్రహ్మమునుజెందును. గురువును తండ్రి నితల్లినిన్ని మానించవలయునుగాని యెక్కసమయమందైనను ద్రోహించరాదు.

అనంతరము వివాహవిషయమందు కొన్నిసంగతులను వ్రాయుచున్నాము. "అనన్య పూర్వికాం కాంతామసపిండాంయవీయసిం । అరోగిణీం భ్రాతృమతీ మసమానార్షగోత్రజాం" అని యాజ్ఞవల్క్యాదిమహర్షులచేత చెప్పబడినకన్యావి శేషణములయందు కాంతత్వము నిరోగిత్వము భ్రాతృమత్వముగాక ఇతరవిశేష ణములులేక పోయినపుడు ఈలోకమందున్ను పరలోకమందున్ను పాతిత్యముగ లుగుటవలన అవిటికి అర్థమును విస్తరించి వ్రాయుచున్నాను. అనన్యపూర్వికస్త్రీ లుఅనగా పురుషాంతరులు పూర్వమందు గలిగియున్నస్త్రీలు అనియర్థము. మన స్సుచేత దానము చేయబడినస్త్రీలు, వాక్యముచేత దానము చేయబడినస్త్రీలు అగ్ని సమీపమును పొందినస్త్రీయి, సప్తపదీకర్మము గలిగినస్త్రీయి, అనుభవిం పబడినస్త్రీయి, గర్భము ధరియించిన స్త్రీయి, ప్రసవించిన స్త్రీయి, అని పున ర్భవాస్త్రీలు యేడువిధములుగా నుందురు గనుక వారికన్న నితరమైనస్త్రీయే అ నన్యపూర్వికయని తెలియవలెను. సప్తపదీవిధానముకన్నను పూర్వమునందు మొ దట చెప్పబడిన మూడువిధములుగానున్న పునర్భవాస్త్రీలకు సంకటమందు మరి యొకనిచేత వివాహమగుచున్నది. సప్తపదీవిధానమయినపిమ్మట నయితే బలత్కా రముగా వివాహము చేయబడినదై యుండినప్పటికిన్ని మరియొకరికి యివ్వదగదు. అసపిండయగు కన్యను అనగా వక్కటిగానే యుండిన పిండము యేస్త్రీకి లేదో అట్టికన్యను, అని వకయర్థము. సమానమగు అనగా నొక్కటియగు పిండదానక్రియ కుమూలమైన పురుషశరీరము యేస్త్రీకిలేదో అట్టికన్యను, అని మరియొకఅర్థము. అచ్చట పిండదుడైన తనకన్నను పూర్వమందు నాలగవ అయిదవ ఆరవపురుషు లుఅను ముగ్గురు లేపమునుచెందువారు మొదటి రెండవ మూడవ పురుషులుఅ నుముగ్గురు పిండమును చెందువారు యేడవ పురుషుడు వారికి పిండము నిచ్చు వాడు ఇట్లు సాపిండ్యము యేడుపురుషుల పర్యంతము సంబంధముగలది. ఇందు కు ప్రమాణము. శ్లో॥ లేపభాజ శ్చతుర్థాద్యాః తత్రాద్యాః పిండభాగినః । పిం డద స్సప్తమశ్చైషాంసా పిండ్యంసాప్తపౌరుషం' అని మాత్స్యపురాణవచనము గలదు. ఈమూడు సంబంధములలో యేసంబంధమైనా వక్కటియగు పిండదాన క్రియయందు గలిగియుండునో అది నిర్వాహ్య సాపిండ్యమని కొందరి మతము. అందువలన స్త్రీలకునున్ను పతులతోకూడా కర్తృత్వమున్నందువలన సాపిండ్యము





సిద్ధించుచున్నది. మూలపురుషుని సంబంధమైన వకశరీరముయొక్క అవయవము లతోనే అన్వయముచేత అవయవసాపిండ్యమగుచున్నదని మరియొకమతము. అయితే యేవిధముగనయిను అన్నదమ్ముల భార్యలకు అన్యోన్యముగా యీ అవ యవసాపిండ్యము సంభవించదు. అయినను ఆధారత్వముచేత వకశరీరముయొ క్క అన్వయము తెలియదగినది యేలననగా వకమూలపురుషుని అవయవముల కు పుత్రద్వారా ఆస్త్రీలయందు ప్రవేశమువలనని తెలియదగినది. ఈరెండుమ తములయందున్ను గయాక్షేత్రముమొదలగుచోట మిత్రుడు మొదలగు యతనికి కూడ పిండముచెందుట యున్నందువలనను. పకశరీరముయొక్క అన్వయమునకు యేడవపురుషునికన్నను పరమందున్న నూర్ధ్వపురుషులయందుకూడ నుండుట వలనను, అతిప్రసంగమనేదోషము ప్రాప్తించుచుండగా "వధ్వావరస్యవాతాతః కూటస్థాద్యదిసప్తమః । పంచమీచేత్తయోర్మాతాతత్సాపిండ్యం నివర్తతే' అని మొదలగు వచనములచేత కన్యయొక్క తండ్రియైనను వరునియొక్క తండ్రియైన ను మూలపురుషుణి మొదలుకొని యేడవపురుషుడై యున్న పక్షమునకు ఆకన్య యొక్క తల్లియైనను వరుణియొక్క తల్లియైనను అయిదవసంఖ్యకు సరియైన స్త్రీ యైయున్నపక్షమునకు అప్పటికి ఆసాపిండ్యము నివర్తించుచున్నదిగాన ఆయతిప్ర సంగదోషమునకు నిరాసముగలదు. మాతృత్వ సంబంధము పితృత్వ సంబంధ ము మొదలగు సంబంధమున్నప్పుడే, యీ రెండువిధములయిన నియమమును స్వీకరించుచున్నందువల్లనని తెలియదగినది. ఈరీతిగా పితృద్వారకమగు సాపిం డ్యమును విచారము చేయుటయందు యేడవపురుషునిపైన సాపిండ్యము పోవు చున్నది. మాతృద్వారకమగు సాపిండ్యమును విచారముచేయుటయందయితే అయిదవపురుషునిపైనసాపిండ్యము పోవుచున్నదని నిర్ణయము తెలియదగినది.

ఈరీతిగా ముఖ్యకల్పముతో వివాహమందు వర్జించతగిన కన్యలయొక్క సంఖ్యయెట్లన్నను, తండ్రివంశమందు ౨౦౧౬ తల్లివంశమందు ౧౦౫ మొత్త ము ౨౧౨౧ యీసంఖ్యగల కన్యలు వర్జించతగదురు. ఇచ్చటలెక్కించుప్రకా రము అచ్చట మూలశ్లోకములు, ఆమూలశ్లోకములకు వ్యాఖ్యానమున్ను, కౌస్తుభగ్రంథమునందు స్పష్టమైనది. ఈముఖ్యకల్పము నాశ్రయించవలయునే గాని అనుకల్పము నాశ్రయించుటచేత యేడవపురుషునికన్నను అయిదవపురు షునికన్నను పూర్వమే వివాహముజేయుట యుక్తముగాదు. అట్లుచేసితే మహా దోషముప్రాప్తించును. ఇందుకు స్మృతిప్రమాణము "పంచమే సప్తమేచైవ యేషాం వైవాహికీక్రియా । క్రియాపరా అపిహితేపతితాః శూద్రతాంగతాః॥ సప్తమాత్పంచమాద్ధీమాన్ యఃకన్యాముద్వహేద్ద్విజః । గురుతల్పీసవిజ్ఞేయః

సగోత్రాంశ్చైవముద్వహేత్" అనియున్నది. అయితే కౌస్తుభ గ్రంథమునందు చెప్పబడినదేమనగా" అనుకల్పమునాశ్రయించుటచేత సాపిండ్య సంకోచము యెవ్వరియొక్క వంశమునందున్ను దేశమునందున్ను పరంపరగా వచ్చియున్నదో వారలకు సాపిండ్యసంకోచము దోషకరముగాదు. స్వకులదేశవిరుద్ధమయిన సాపిండ్యసంకోచముచేత వివాహముజేయుటయందు దోషము గలుగుచున్నదేను. ఇందుకు "యేనాస్యపితరోయాతాయేనయాతాః పితామహాః। తేనయాయాత్సతాంమార్గంతేనగచ్ఛన్నదుష్యతి" అని ప్రమాణముగలదు. ఇదేప్రకారముగా తృప్తాంజహుర్మాతులస్యేవ, అని మంత్రలింగములచేత మాతులస్యసుతామూఢ్వా, అని మొదలగుస్మృతులకు బాధగలుగుటవలన యెవ్వరివంశమందు మాతులకన్యాపరిణయము పరంపరగా ప్రాప్తించినదో వారలచేత చేయదగినది. గోత్రాన్మాతుః సపిండాశ్చ వివాహోగోవధస్తథా" అనెడు మాతులకన్యావివాహమునకు కలియుగమందు వర్జ్యత్వవచనముకూడ యెవ్వరియొక్క కులమందును దేశమందును మాతులకన్యావివాహములేదో వారిపరమేనని తెలియదగినది. ఇదియే శిష్టాచారము, అని చెప్పబడినది. సాపిండ్యసంకోచప్రకారమెట్లన్నను" మూలపురుషునిమొదలుకొని మూడవకన్య, మేనమామ కూతురే వివాహముజేసికొనతగినది. నాలగవకన్యక నాలగవ అయిదవ పురుషులచేతనే వివాహముజేసికొనతగును. అయిదవకన్య అయిదవపురుషునికన్నితురులగు మూడవపురుషుడు మొదలయిన యేడవపురుషుడు పర్యంతులుగానున్న వారిచేత వివాహముజేసికొనతగును. ఆరవకన్యక అయిదవపురుషులచేతనే వివాహముజేసికొనతగును. యేడవకన్యక మూడవపురుషుడు మొదలగు యేడవపురుషుడు పర్యంతులుగానున్న వారిచేత వివాహము జేసికొనతగును. ఈప్రకారము సాపిండ్యసంకోచముచేత సంకటములయందు అశక్తునిచేత చేయతగినది. కన్యాంతరలాభమందు శక్తులచేత చేయదగదు. ఇందుకు "ప్రభుః ప్రథమకల్పస్య యోనుకల్పేనవర్తతే। సమాప్నోతిఫలంచేహా" అని వచనమువలన శక్తులచేత అను కల్పమును స్వీకరించుటయందుదోషముచెప్పబడినది. సాపత్న్యమాతృవంశమందు సాపిండ్యప్రకారము ధర్మసింధువుయందు చూడదగినది. వకచోట సాపిండ్యము లేకబోవుటయందుకూడ వచనమువలన వివాహముకానేరదు. "అవిరుద్ధ సంబంధా ముపయచ్ఛేత" అని మొదలగు పరిశిష్టవచనమువలన భార్యయొక్క భగినికి కూతురున్ను పితృభ్రాతృవుయొక్క భార్యకు భగినియున్ను వర్జించతగును. బౌధాయనమహర్షి వచనము "మాతుః సపత్న్యాభగినీ తత్సుతాంచ వివర్జయేత్। పితృవ్యపత్నీ భగినీతత్సు





తాంచవివర్జయేత్" అని యున్నందువలన తల్లియొక్క సవితికి భగినిని ఆమెకూతురునున్ను తండ్రిభ్రాతయొక్క భార్యకు భగినిని ఆమెకూతురునున్ను వివాహమందు వర్జించవలెను.

యవీయసియగు కన్యను అనగా తనకన్నను వయస్సుచేతను దేహముచేతనున్ను తక్కువగానున్న కన్యను, అనియర్థము. అట్టి కన్యను వివాహము జేసికొనవలయును.

అసమానార్షగోత్రజయగు కన్యను, అనగా ప్రవరముగాని గోత్రముగాని తనకు సమానములుగా నెవ్వనికియుండునో అట్టివానికి జనియించనట్టి కన్యను అనియర్థము అట్టి కన్యను వివాహముజేసికొనవలెను. గోత్రప్రవరనిర్ణయము ధర్మసింధువుయందు చూడతగినది.

అనంతరము క్షయపక్షాదివిచారము చేయబడుచున్నది. పక్షమధ్యమందు రెండుతిథులయొక్క క్షయముచేత యేపక్షము పదుమూడుదినముల రూపముగానుండునో అది క్షయపక్షము. ఆక్షయపక్షమందు బహుజనసంహారమైనను రాజసంహారమైనను గలుగును. క్షయపక్షమందు చౌలోపనయనోద్వాహాదిశుభమున్ను వాస్తుకర్మాదిశుభమున్ను చేయదగదు. క్షయసంవత్సరముకూడ చౌలాదిశుభకార్యములయందు నిషిద్ధమైనది.

జన్మము మొదలుగానైనను గర్భము మొదలుగానైనను అయిదవవర్షములు మొదలు యెనిమిదవ సంవత్సరమువరకు కన్యావివాహమునందు యోగ్యమైనకాలము. ఆరుసంవత్సరములపైన రెండుసంవత్సరములు మిక్కిలి ప్రశస్తమైనకాలము. తొమ్మిదవ పదియవ సంవత్సరములయందు మధ్యమము పదనొకండవ సంవత్సరమునందు అధమము పదిరెండవ సంవత్సరమునందు ప్రాయశ్చిత్తమును గలుగజేయునది. బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, ఆసురము, గాంధర్వము, రాక్షసము, పైశాచము, అని యెనిమిది వివాహములు. యోగ్యుడగు వరునిపిలిపించి అలంకరించి కన్యాదానవిధానముచేత యతనికొరకుదానము చేయడము బ్రాహ్మవివాహమని చెప్పంబడును. యజమందు ఋత్విక్కర్మనుచేసిన వానికి అలంకరించి కన్యను సమర్పించడము దైవవివాహమని చెప్పంబడును. వరునివలన యొక్క గోవునైనను గోమిథునము నైనను గ్రహించియతనికొరకు కన్యను సమర్పించడము ఆర్షవివాహమని చెప్పంబడును. ఈగోమిథునగ్రహణమును సిష్టులు నింధించరు. ఆగోమిథునము కుమారీపూజనార్థమగుటచేత కన్యావిక్రయముకాక బోవుటవల్లనని తెలియదగినది. నీవు ఈ స్త్రీచేతనే కలిసిగృహధర్మము నాచరించవలయును యీ స్త్రీయొక్క జీవనము పర్యంతము మరియొ

కవివాహమును గాని చతుర్థాశ్రమమునుగాని పొందరాదని సంభాషించి కన్యా
దానము చేయుట ప్రాజాపత్య వివాహము. జ్ఞాతులకొరకు యథేచ్ఛముగా ద్ర
వ్యమునిచ్చి వివాహముచేసు కొనుట ఆసురవివాహము. కన్యావరులయొక్క ఇచ్ఛ
చేత అన్యోన్యసంయోగము గాంధర్వము. యుద్ధము మొదలగు దానిచేత బలా
త్కారముగా హరించడము రాక్షసము చౌర్యముచేత కన్యాహరణము పైశాచ
ము మొదట చెప్పబడిన నాలుగు వివాహములయందు పూర్వపూర్వవివాహము
శ్రేష్ఠమైనది. కడపట చెప్పబడిన నాలుగు వివాహములయందు ఉత్తరోత్తరవి
వాహము నింద్యమైనది. అందులో బ్రాహ్మణునికి బ్రాహ్మాదైవవివాహములు
ప్రశస్తములు క్షత్రియునికి గాంధర్వరాక్షస వివాహములు ప్రశస్తములు. ఆసుర
వివాహము వైశ్యునికి ప్రశస్తమైనది. బ్రాహ్మదైవప్రాజాపత్యార్షవివాహము
లకన్న నితర దుర్వివాహములయందు పుత్రులు బ్రహ్మధర్మమునుద్వేషించువారు
గలుగుదురు.

అనంతరము విష్ణ్వాది పంచాయతనములు చెప్పబడుచున్నవి. ఈవిషయ
మునులభముగ నుండుటవలన శ్లోకములను మాత్రము వ్రాసెద. "విష్ణుర్మధ్యే
శివేభాస్యసూర్యార్యా ఈసదిరిక్క్రమాత్ । శంభౌమధ్యే విష్ణుసూర్యగజాస్యా
ర్యాస్తథాక్రమాత్ ॥ రవౌమధ్యగతే రుద్రగణేశాచ్యుత శక్తయః । మధ్యేదే
వీవిష్ణుశివగణేశరవయః క్రమాత్ ॥ మధ్యేగణపతిర్విష్ణుశివసూర్యాంబికా స్త
థా । ఈశానాది క్రమేణైవ పంచాయతన పంచకం ॥" అని చెప్పబడియున్నవి,
ఆదిత్యంఅంబికం గణనాథం మహేశ్వరం విష్ణుయీఅయిదుచేరితే పంచాయతనం
అవును అనంతరము విష్ణువుకు ప్రీతికరములైన పుష్పపత్రములు చెప్పబడుచు
న్నవి. మాలతీజాతీకేతకీమల్లికాశోకచంపక పున్నాగవకుళోత్పలకుంద కరవీరపాట
లాతగరపుష్పములున్ను పరిమళించుచున్న ఇతరపుష్పములున్ను విష్ణువుకు ప్రీతికర
ములు. ఉత్తరేణి, భృంగరాజము, చంద్ర, జమ్మి, గరక, దర్భ, దమనము, బిల్వము,
తులసి, వీటియొక్క పత్రములు ఉత్తరోత్తరముగా అధికప్రీతినిచ్చునవి. తులసిఅన్ని
టికన్నదధికమైన ప్రీతినిచ్చునది. జాతీపుష్పములయొక్క సహస్రముచేత మాలనుస
మర్పించుటయందు కల్పకోటిసహస్రకాలమువరకు విష్ణుపురమునందు నివాసముగ
లుగును. చింతవూలగుత్తిచేత పూజించుటయందు గోకోటి దానఫలముగలుగును.
అనంతరంశివునికి ప్రీతికరములయిన పుష్పపత్రములు చెప్పబడుచున్నవి. నాలుగుపు
ష్పజాతులయొక్క గంధమును శివుడు ఆఘ్రాణించుచున్నాడు. అవి యెవ్వియనగా,
అర్క పుష్పము, కరవీరపుష్పము, బిల్వపత్రము, వకుళపుష్పము, అనునవి. తెల్ల
జిల్లేడుపుష్పమును శివునియందు సమర్పించితే దశసువర్ణదాన ఫలముగలుగును.





వకుళపుష్పమును సమర్పించితే దానికి వెయ్యంతలు ఫలముగలుగును. ఈప్రకా
రము ఉమ్మెత్తపత్రము, శమీపుష్పము, ద్రోణపుష్పము, నీలోత్పలము, వీటిని
సమర్పించితే ఉత్తరోత్తరముగా వెయ్యంతలుగ గుణించియీయాఫలమును తెలి
సికొనవలెను. బిల్వపత్రము మిక్కిలి అవశ్యకము ముఖ్యమనుటకుగాను ప్రమాణ
ము "మణిముక్తాప్రవాళైస్తు రత్నైరప్యర్చనంకృతం । నగృహ్ణామివినాదేవిబిల్వ
పత్రైర్వరాననే । సర్వకామప్రదంబిల్వం దారిద్ర్యస్యవినాశనం" అనియున్నది.
నీలోత్పలసహస్రముచేత మాలనుసమర్పించుటయందు కల్పకోటి సహస్రకాలము
శివపురమందు నివాసముగలుగును. ఉమ్మెత్త పత్రములచేతను, బృహతీపుష్పము
లచేతనున్ను పూజించుటయందు గోలక్షఫలముగలుగును. పాటలామందారా
పామార్గజాతీ చంపకోశీర తగరనాగకేసరపున్నాగజపామల్లీ సహకార కుసుంభ
పుష్పములు శివప్రియకరములు ఉమ్మెత్తపత్రములు కదంబపుష్పములు శివునికిరా
త్రియందు సమర్పించతగినవి. ఇచ్చట నింక ననేకసంగతులు ధర్మసింధువుయం
దు చూడతగినవి.

శివనిర్మాల్యమును గ్రహించవచ్చునా గ్రహించరాదా అనుటకు నిర్ణయ
మును వ్రాయుచున్నాము జ్యోతిర్లింగము స్వయం భూలింగము, సిద్ధప్రతి
ష్ఠాపితలింగము, వీటియందు పూజకునిచేత యివ్వబడిన ఫలతీర్థాదికమును
భక్తిచేత పరిశుద్ధికొరకు గ్రహించతగినదిగాని రుచిగా వేడుకగా భక్షించవలెన
ని లోభముచేత గ్రహించరాదు. ఈలింగములకన్న నితరలింగములయందు శివ
నైవేద్యము పత్రము పుష్పము ఫలము జలము గ్రహించతగదు. అయితే సాల
గ్రామశిలతోకూడను శివునికి నైవేద్య మొదలగుదానిని చేశియుండగా ఆనైవే
ద్యాదులను స్వీకరించవచ్చును.

ఇది ప్రకీర్ణకప్రకరణము ముగిసెను.



## వ్యవహార ప్రకరణము.

అనంతరము వ్యవహారవిషయములను కొంచముగా వ్రాయుచున్నాము.
వ్యవహారములను సర్వాధికారముగలిగి గుణయుక్తుండగు రాజు, విద్వాంసులయి
గుణయుక్తులగు బ్రాహ్మణులతో కూడ ధర్మశాస్త్రము ననుసరించి క్రోధలోభ
ములులేనివాడై విచారించి అధర్మయుక్తులను శిక్షించి ధర్మయుక్తులను పాలించ
వలెను. వ్యవహారమనగా నొకడు ఈభూమిగృహాదులు నావియని చెప్పుచుండగా
మరియొకడు తద్విరుద్ధముగా నావియని చెప్పుటయని తెలియదగినది. అవ్యవహా

రము అనేకవిధములైనది అనేకభేదములుగా నుండును. యెవ్వడైనను వాదియై వచ్చి విజ్ఞాపనముచేసుకొన్న పక్షమునకు వాదమును విచారింపవలయును. యెవ్వడైనను తెచ్చిన వివాదమును విచారింపక అణచి వేయగూడదు. లిఖితప్రమాణము, అనుభవ ప్రమాణము, సాక్షిప్రమాణము, దివ్యప్రమాణము, అనెడినాలుగువిధములైన ప్రమాణములవలన రాజున్యాయమును దెలిసికొనవలయును. లిఖితానుభవసాక్షి ప్రమాణములనెడు మానుషప్రమాణములలో నొకటియైనను లేకుండెనేని దివ్యప్రమాణములలో నొకప్రమాణమును జాతిదేశకాలాద్యనుగుణముగా గ్రహింపవలయును గాని మానుషప్రమాణంబులైన లిఖితాదులుండగా దివ్యప్రమాణమును గ్రహింపగూడదు. అందువలన యొకడు నావాదమునకు లిఖితాదిమానుష ప్రమాణములున్నవనియు మరియొకడుదివ్యప్రమాణమునుజేసెదననియు చెప్పుకొన్నయెడల రాజుమానుష ప్రమాణములగు లిఖితాదులనే యంగీకరింప వలయుగాని దివ్యప్రమాణము నంగీకరింప గూడదు. అయితే కొన్ని వివాదములయందు నియమముగలదు. అది యెట్లన్నను, విషము పెట్టుటనరుకుట కొట్టుట తిప్పుట మొదలుగాగల వ్యవహారములయందును బలముచే జనించిన వ్యవహారములయందును మానుషప్రమాణము లున్నప్పటికి నిదివ్యప్రమాణమే గ్రహింపదగును. వర్తకులు శిల్పులు మొదలుగాగల వారు సమాజముగాజేరి యేర్పరచుకొనెడు సంకేతమునకు లిఖితప్రమాణమే ముఖ్యమౌనుగాని దివ్యసాక్ష్యాది ప్రమాణములు ముఖ్యములు గావు. గృహాది ద్వారములు మార్గములు ఉత్సవాది కార్యములు నీటికాలువలు ఇత్యాది విషయములైన వ్యవహారములయందు అనుభవమే ముఖ్యమగును గాని దివ్యసాక్ష్యాదులు ముఖ్యంబులు గావు. వేతనాదానవివాదమందును స్వామిపాలవివాదమందును క్రయవిక్రయాదివివాదమందును ద్యూతవివాదమందును సాక్షులే ముఖ్యమౌదురు గాని దివ్యలిఖితాదులు ముఖ్యంబులు గావు. దివ్యప్రమాణమునకు లక్షణము మితాక్షరాదులయందు గలదు. అయితే స్వత్వహేతువులేని కేవలానుభవము ప్రమాణముగాదు. అనుభవము నూరేండ్లకు మించియుండెనేని సత్వహేతువు దెలియంబనిలేదు. ఎన్నేండ్లకైనను సత్వహేతువులేదని తెలిసెనేని అనుభోక్త శిక్షార్హుండగును. అయితే అనుభవహీనమైన, ఆగమముఅనగా ప్రతిగ్రహక్రయాదిరూపమైన స్వత్వకారణము గలిగియున్నను కొంచమయినను అనుభవములేకుండెనేని అట్టి ఆగమము భోగసహితమైన ఆగమముకన్నను బలయుక్తము గానేరదు. ప్రభువు తనరాజ్యమందెవ్వని ద్రవ్యమునైనను చోరుండు దొంగిలించినయెడల అట్టిచోరునిబట్టి తెప్పించి ఆద్రవ్యమును ద్రవ్యస్వామికిప్పించవలయును. అట్లుచే





యక చోరునివలన ఆద్రవ్యమును రాబట్టి తాను తీసుకొన్నయెడల ఆచోరుడుచేసియున్న పాపమును ప్రభువు పొందును. చోరునిబట్టుటకు ప్రభువుసాధ్యమైన ప్రయత్నము చేయనప్పటికిని ఆచోరుడు చేశియున్నపాపమును ప్రభువుబొందును. చోరునిబట్టుటకు ప్రభువు సాధ్యమైన ప్రయత్నము జేసినప్పటికిని ఆచోరుడుదొరకకపోయినను చోరుడు దొరికి వానివలన ద్రవ్యమురాకబోయినను ఆద్రవ్యమునుప్రభువు తనబొక్కసము నుండియెత్తి ద్రవ్యస్వామి కిప్పించవలయును. ఇది వ్యవహారమాతృకముగిసెను.

అనంతరము ఋణాదానప్రకరణము చెప్పబడుచున్నది. ఆఋణాదాన మేడువిధములు. అవెట్లన్నను, ఈలాటియప్పు దీర్చవలయుననియు, ఈలాటియప్పు దీర్చనక్కరలేదనియు, ఇట్టివాడప్పు దీర్చవలయుననియు, ఇట్టిసమయంబున ఋణము దీర్చవలయుననియు, నేవ్విధంబున ఋణము దీర్చవలయుననియు, ఈరీతిగా అధమర్ణునివిషయమై అయిదువిధంబులు. ఇవ్విధంబున అప్పియ్య వలయుననియు, ఇవ్విధంబుగా మరల దీసుకొనవలయుననియు, ఈరీతిగా ఉత్తమర్ణునివిషయమై రెండువిధములుగలవు, అని నారదమహర్షి చెప్పియున్నాడు. (అధమర్ణుడు అనగా అప్పుదీసుకొనువాడు. ఉత్తమర్ణుడనగా అప్పిచ్చువాడు) ఇందులో కొన్నిసంగతులనుమాత్రము వ్రాయుచున్నాము. కుదవయుంచుకొని అప్పిచ్చినవాడు ప్రతిమాసంబును ౮౦ కి ౧ లెక్కను వడ్డిదీసుకొనుట ధర్మ్యంబగును. కుదవలేక యప్పిచ్చినవాడు ప్రతిమాసంబును బ్రాహ్మణునివలన నూటికి రెండులెక్కను క్షత్రియునివలన నూటికి మూడులెక్కను, వైశ్యునివలన నూటికి నాలుగు లెక్కను, శూద్రునివలన నూటికి అయిదులెక్కను, వడ్డిదీసుకొనుట ధర్మ్యంబగును. అధికలాభార్థమై ప్రాణధనహాని శంకాస్పదమైన మహారణ్యమునకు బొయ్యెడివర్తకులుమొదలైనవారికి అప్పిచ్చినయెడల ప్రతిమాసము నూటికి పదిలెక్కనువడ్డిదీసుకొనవచ్చును. సముద్రమందు ఓడనెక్కి పోవుచుండెడి వారికి అప్పిచ్చినయెడల ప్రతిమాసము నూటికి ఇరువదిలెక్కను వడ్డిదీసుకొనవచ్చును. ఇట్టివారికిచ్చినమూలద్రవ్యము మరలవచ్చునని నిశ్చయములేదు గనుక కొందరివలన రాకపోయినను ఆయుత్తమర్ణునికి నష్టము సంభవింపకుండవలయు గనుక ఈవిషయమై అధికముగా వడ్డిదీయవచ్చును. ఇట్లు వడ్డినిర్ణయించు కొనవలసినది. మరియొకపక్షమందు కులనిర్ణయములేక వారివారియిష్టానుసారముగా కుదవయున్నను లేకబోయినను, వడ్డినిర్ణయించుకొనవచ్చును. వడ్డినిర్ణయించుకొనక ప్రీతిపూర్వకముగానిచ్చిన ద్రవ్యమునకు వడ్డిగట్టగూడదనియు, మొదటవడ్డి నిర్ణయించుకొనకయిచ్చినపిమ్మట వడ్డినపేక్షించినయెడల ఆరునెలలపిమ్మట ఆద్రవ్యమునకు వడ్డిగట్టవచ్చు

ననియు నారదస్మృతియందు చెప్పబడినది. అధమర్ణుడు తనంతటగాని సాక్షిలిఖిదాది సాధనములచేత తప్పించుకొనజాలక గాని యియ్యవలసినది సత్యమనియొప్పుకొనియున్న ధనమును మనూక్తములైన ధర్మాద్యుపాయములచేత ఉత్తమర్ణుండు సాధించుకొనవచ్చును. ఆయుపాయములేవి యనగా ౧ ధర్మము అనగా ప్రీతియుక్తములైన సత్యవచనములు పలుకుట ౨ వ్యవహారము అనగా పత్రమున్నది నీరుజువున్నది సాక్షులున్నారు అని మొదలగువచనములను పలుకుట ౩ చలము అనగా అప్పుదీర్చుమని యడుగక యుత్సవాదులపేరుసెప్పి భూషణాదుల దీసుకొనుట, ౪ ఆభోజనము యనగా ద్రవ్యము నిచ్చువరకు నేను భుజింపనని వానియింట గూర్చుండుట, ౫ బలము అనగా నిగళబంధనాదులచే నిర్బంధించుట అనునవి. అధమర్ణుడు న్యాయవాదియై వప్పుకొనకయుండగా అతని బాధించినయుత్తమర్ణునికి తత్సమానదండనముచేసి దూషించవలెను. అధమర్ణుడు అన్యాయవాదియైవప్పుకొనక యుండగా రాజు ఉత్తమర్ణునికి బలవంతముతో ద్రవ్యము నిప్పించి తత్సమానధనదండనమును తాను తీసుకొనవలయును. ఆధమర్ణుడు నిర్ధనుడై యుండెనేని వాడు ఉత్తమర్ణునికంటె హీనజాతీయుడైకాని సమానజాతీయుడైకాని యున్నపక్షమందు వానివల్ల జాత్యుచితములైన పనులుసేయించుకొనుచు వాని కిచ్చు వేతనమందు వాని కుటుంబజీవనాంశము పోగా మిగిలిన ద్రవ్యమువల్ల తనయప్పుదీర్చు కొనవలయును. అధమర్ణు డుత్తమర్ణునికంటె నుత్తమవర్ణుండై యున్నపక్షమందు మెల్లమెల్లగా వానికిగలిగినపుడు దీసుకోవలయునుగాని వానివల్ల పనులుసేయింపకూడదు. ఇట్లు మనువచనముగలదు. అవిభక్తులై యున్న యనేకులలో కొందరిచేతగాని యొకనిచేతగాని కుటుంబరక్షణార్థమై చేయబడినఋణమును ఆకుటుంబనిర్వాహకుడు దీర్చవలసినది. అట్లు తీర్చకకుటంబ నిర్వాహకుడులోకాంతరగతుండైనను దేశాంతర గతుండైనను తదాయార్హులై యున్నవారందరు ఆఋణమును దీర్చవలశినది. కుటుంబార్థముగాక కార్యాంతరమునుగురించి భర్తచేసినఋణమునుభార్యగానికుమారుడుచేసినఋణమును తల్లిదండ్రులుగాని భార్యచేసినఋణమును భర్తగాని తీర్చపనిలేదు. తండ్రి తానుచేసినఋణము దీర్చక దేశాంతరగతుండైనను లోకాంతరగతుండైనను చికిత్సానర్హవ్యాధి పీడితుండై యున్నను వానిఋణమును పుత్రుండు తీర్చవలయును. పుత్రుడును తండ్రివలెనయినపక్షమందు పౌత్రుండాఋణమును తీర్చవలెను. వీరు పితృపితామహ ద్రవ్యమును పొందనివారై యున్నను ఋణమునుమాత్రము తీర్చకయుండగూడదు. అయితే సురాపానము కామము జూదము రాజదండనము సుంకము వృథాదానము, వీనినిమిత్తమై తండ్రిచేసి





యున్నఋణమును పుత్రుడుతీర్చనక్కరలేదు. గొల్ల, యీడిగె, నట్టువు, చాకలి బోయ, యీకులములయందును ఈలాగే స్త్రీయాధీనజీవనమైయున్న ఇతరకులములయందును కుటుంబార్థముకన్న నితరకార్యములనుగురించి భార్యచేసినఋణమున్ను పతి తీర్చవలయును. కుటుంబార్థముగాక కార్యాంతరమునుగురించి భర్తచేసినఋణమునుగూడ కొన్నిప్రకారములయందు భార్యతీర్చవలసినది. అవియెవ్వియనగా భర్త, లోకాంతరమునకుగాని దేశాంతరమునకుగాని పోవునపుడు నీవీయప్పుదీర్చవలయునని యాజ్ఞాపించగా భార్య తీర్చెదనని యొప్పుకొనియున్నపక్షమందు అట్టి యప్పును భార్యతీర్చవలసినది. భర్తతోగలసి తానుతీసినయప్పును భర్తృపుత్రాదులు లేనిపక్షమందు స్త్రీ తీర్చవలసినది. తానుస్వతంత్రించి తీసినయప్పును స్త్రీ తీర్చవలసినది. తక్కినయప్పులను స్త్రీతీర్చనక్కరలేదు. ఒకని కప్పిచ్చునప్పుడు వానియందు నమ్మకము లేకుండగా మరియొకని పూటకాపుగా నేర్పరుచు కొనవచ్చును (పూటకాపుఅనగా జామీనుదారుడు) ఈపూటకాపులు విషయాభేదము వలనమూడువిధములుగా నేర్పడుచురు. అది యెట్లనిన, ఈపురుషునిజూపుమన్నపుడు నేజూపెదనని యొప్పుకొనువాడు చూపుడు పూటకాపు నాయందలి నమ్మకముచేత వీని కప్పిమ్ము వీడు నిన్ను మోసపుచ్చడు వీనికి సస్యములు పండెడుమంచిగ్రామమున్నది. అనునవి మొదలైన నమ్మకములు చెప్పెడువాడు నమ్మికపూటకాపు వీనికప్పిచ్చిన ద్రవ్యము రానిపక్షమందు ఆద్రవ్యమును నేనిచ్చెదనని చెప్పెడివాడు ఈవిపూటకాపు. ఈపూటకాపులు చెప్పినదానికి వ్యతిరిక్తముగా జరిగినయెడల ప్రభువు వీరివల్ల నుత్తమర్ణునికి ఋణద్రవ్య మిప్పించవలసినది. వీరిలోఈపూటకాపు గతించినను వానిపుత్రులవల్ల ఆద్రవ్యము నుత్తమర్ణుని కిప్పించవలసినది. తక్కినవారి పుత్రులవల్ల నిప్పించగూడదు. అయితే ఈవిపూటకాపుచనిపోయినపిమ్మట నతనికొడకు లతడు పూటబడిన యపును వడ్డిలేక తీర్చవలసినది. పౌత్రులక్కరలేదు. ఇందుకు "ఋణంపైతామహం పౌత్రః ప్రాతిభావ్యాగతం సుతః। సమందద్యాత్తత్సుతౌతు నదాప్యావితి నిశ్చయః" అని వ్యాసవచనముగలదు. అప్పిచ్చినవాడు పూటకాపును తన ద్రవ్యమిమ్మని యుపద్రవపరచినపుడు పూటకాపు ససాక్షికముగా వానిద్రవ్య మిచ్చినపిమ్మట ఆయప్పు తీర్చవలసినవానివలన తాను రెండంతలు తీసుకొనవచ్చును. అయినను ద్విగుణముగ దీసుకొనవచ్చునుగదా, అని ఆశచేత అప్పిచ్చినవాడు తొందర చేయనప్పుడు తానే తీర్చగూడదు. ఈద్విగుణము దీసుకొనుట రొక్కము విషయము పశుధాన్యాదివిషయముచు గురించి యాజ్ఞవల్క్యస్మృతియందు చూడతగినది. చూపుడుపూటకాపు తానగుపరచవలసినమనిషినివప్పుకొన్న కాలమందగుపరచజాలని పక్షమందు

౧౨ దినములు గడుపీయవలెను. ఆగడువు ప్రకారముగూడ నతడగుపరచనిపక్షమందు ఆపూటకాపేఆయప్పు తీర్చవలసినది. ఇదికాత్యాయన మహర్షిప్రోక్తము. ఒకని కప్పిచ్చునప్పుడు వానియందు నమ్మకములేకుండగాకుదవయుంచుకొనవచ్చును. కుదవయనగా నప్పుతీసుకొను వాడప్పిచ్చు వానియొద్ద వాడిచ్చుద్రవ్యమునకు బదులుగానుంచువస్తువుఅది రెండువిధములుగలది. ఇన్ని దినములలోపల నీయప్పుతీర్చినపక్షమందునేను నీయొద్దనుంచిన వస్తువును నీవు విడుదలచేయవలసినది. లేనిపక్షమందా సొత్తు నీదిగానే కావలసినదని చెప్పియుంచునది. యొకటి నేను నీయప్పుతీర్చి దీని దీసుకొనిపోయెదనని కాలనిర్ణయముచేయకయుంచునది యొకటి ఈరెండిటియందు నొకటికి రెండుభేదములుగలవు. కుదవయుంచుకొన్నవాడావస్తువననుభవించుచుండునట్లు నిర్ణయము గలిగియుండునదియొకటి అట్లుగాక అప్పుతీసుకొన్నవాడాయప్పును మరల దీర్చునంతవరకు కాపాడి యతడప్పుతీర్పగానే వానికిచ్చివేయవలసినట్లు నాలుగువిధములకుదవలలోనొకటికొకటికి జరగవలసినవిధమును అందులో విశేషములున్న మితాక్షరయందు చూడదగినది. అయినను కొంచమువ్రాయుచున్నాను. దాచదగినదిగా కుదవయుంచినవస్తువును కొంచమైనను వాడుకొన్న పక్షమందు అధికముగా వడ్డిరావలసియున్నను ఆవడ్డినంతయు వదిలిపెట్టవలసినది. ఆకుదవవస్తువు అనుభవింపబడకయే చెడిపోయిన పక్షమందు బాగుపరచి యీవలసినది. అనుభవించుటవల్ల చెడిపోయినపక్షమందు బాగుపరచియిచ్చి వడ్డిని విడిచిపెట్టవలసినది. అనుభవింపుచుండునట్లు కుదవయుంచినవస్తువు అనగా దున్నుకొనుచుండుమని యుంచినయెద్దు, వాడుకొనుచుండుమనియుంచిన తపెల, మొదలగువానిని కుదవయుంచుకొన్నవాడు న్యాయముగాననుభవింపుచుండగా నవిచెడిపోయినపక్షమందు బాగుపరచి యీవలసినది. లేదా వడ్డిగలిగియున్న పక్షమందా వడ్డినైన వదిలిపెట్టవలసినది. దైవోపద్రవముగా నిరాజోపద్రవముగాని లేక కుదవవస్తువుపోయినపక్షమందు దానిక్రయము కుదవయుంచుకొన్న వాడిచ్చినపక్షమందే యతడప్పిచ్చిన ద్రవ్యము వడ్డితోడ నతనికి చేరునుగాని లేనిపక్షమందు చేరదు. ఇట్లు నారదులచేత చెప్పబడినది. దైవోపద్రవమనగా నిప్పు జలప్రవాహము మొదలగుదానివలన గలుగునది. రాజోపద్రవమనగా సీతనివలన నేమియుతప్పులేకుండునపుడు దండు మొదలగువానివలన గలుగునది. పైనజెప్పిన రెండువిధముల ఉపద్రవములచేత కుదవవస్తువునకు హానికలిగెనా అప్పుతీసుకొనియున్నవాడు వడ్డితోగూడ నప్పుడే ఆయప్పు తీర్చవలసినది. లేదా ఆవస్తువునకు బదులు మరియొక వస్తువును కుదవయుంచవలసినది. ఇది ఋణాదాన ప్రకరణము ముగిసెను.





అనంతరము సాక్షిప్రకరణము వ్రాయబడుచున్నది. వకకార్యము జరగగా చూచినవాడనియు విన్నవాడనియు, సాక్షిరెండువిధములుగానుండును. ఇట్లు మనువుచే జెప్పబడినది. ఇందొకరికి మరలరెండుభేదములుగలవు. నిర్ణయించుకోబడినవాడు, నిర్ణయించుకోబడనివాడు, అని తెలియవలయు. వీరియందు నిర్ణయించుకోబడిన సాక్షి అయిదువిధములుగానుండును. నిర్ణయించుకోబడని సాక్షి ఆరువిధములుగానుండును. నిర్ణయించుకోబడిన అయిదువిధముల సాక్షులకుగల భేదంబులుకాత్యాయనాది మహర్షి ప్రోక్తములుగానున్నవి. యెట్లన్నను, పత్రమువ్రాయించుకొని వానిచే బిలువబడివచ్చి పత్రమునందు చేవ్రాలుచేసినవాడు లిఖితసాక్షియనంబడును. జరిగినకార్యము యుండునని తలంపుచేత కార్యార్థియైన వాడొకడని బిలిచి యీజరిగిన కార్యమును నీవుమరువవలదని పలుమారు చెప్పెనేని అట్లు చెప్పబడి యెరిగిన స్మారితుడనంబడును. తనంతటవచ్చి జరిగిన కార్యమును కార్యార్థి దెలుపగానెరిగిన సాక్షియదృచ్ఛాభిజ్ఞుడనంబడును. వాదితనవ్యవహారము సిద్ధించుటకై యొకనిబిలుచుకొనివచ్చి దాచియుంచి తాను ప్రతివాదితో నాడుమాటలువినుచుండుమన్న పక్షమందట్లు దాగియుండి వ్యవహారము నెరిగినవాడుగూఢ సాక్షియనంబడును. సాక్షులు గుర్తెరిగిన సంగతివినియుండిగాని సాక్షులచే వినుపింపబడియుండిగాని సాక్షులమీద సాక్ష్యము బలుకువాడు ఉత్తరసాక్షియనంబడును. నిర్ణయించుకోబడని యారువిధముల సాక్షులును నారదులచే వివరింపబడియున్నారు. యెట్లనగా, గ్రామస్థు లొకవిధమైన సాక్షులు. రాజసభయందు జరిగిన వ్యవహారములకు ఆసభయందుండెడు సభికులును రాజవర్యునిచే నధికారమును బొంది వ్యవహారముల విచారించువాడును అచ్చటియుద్యోగస్థులును వీరందరొకవిధమైనసాక్షులు. భూపాలుం డొకసాక్షి. వ్యాపారముచేయువారికార్యములను విచారింపను వారేర్పరుచుకొనియుండు కార్యస్థుడొకసాక్షి. వాదిచే బంపబడినవాడొకసాక్షి. కులవిషయకములైన వ్యవహారములయందు కులమువారొకవిధమైనసాక్షులు. సాక్షులు, తపోనిష్ఠులుగాను, ఈవిగలవారుగాను, గొప్పవంశమందుబుట్టినవారుగాను, నిజముబలుకువారుగాను, ధర్మముచెడకూడదను నిశ్చయముగలవారుగాను కపటప్రవర్తనలేనివారుగాను, బిడ్డలుగలవారుగాను, ధనికులుగాను, శ్రుతిస్మృతులయందు చెప్పబడినక్రియలనుదప్పక యాచరించువారుగాను, ఈసకలగుణములచే సహితులుగా నుండవలసినది. ఇట్టిసాక్షులు దొరకనిపక్షమందు నిజముబలుకువారుగాను, ధర్మముచెడకూడదని నిశ్చయముగలవారుగాను, కపటప్రవర్తనలేనివారుగాను, ఆస్తికులును, అనునాలుగు గుణములచేతనైన సహితులుగా నుండవలశినది.

ఇట్టిసాక్షులు ముగ్గురికంటె దక్కువగాకుండ నెందరైననుండవచ్చును. అందులో స్త్రీలకుస్త్రీలే సాక్ష్యమును చెప్పవలయునని మనువుచెప్పియున్నాడు. ఏతద్విరుద్ధ గుణములుగలవారు సాక్ష్యమునకుదగరు. వాదిప్రతివాదులిద్దరు సమ్మతించిరేని మంచిసాక్షివకడేచాలును. సాక్షులచే చక్కగా ప్రమాణముచేయించి సాక్ష్యముచెప్పించుకొనవలయును. సమాచారమునెరిగియు సాక్ష్యముచెప్పనితులువ, పాపములచేతను, దండనచేతను, తప్పుసాక్షులతో సమానుడగును తప్పుసాక్షిని దండించుక్రమమున దండింపవలయును. తప్పుసాక్ష్యముచేత నొక వ్యవహారము తీర్పుబడినదైనను పిమ్మట తెలిసినపక్షమందు దాని మార్పవలయును. ఇట్లు మను వచనమున్నది. సాక్షులు రెండువిధములుగా చెప్పినప్పుడు పైన చెప్పబడిన గుణములయందలి విశేషగుణములుగలవారు చెప్పినది యేప్రమాణము. ఏవాదియొక్క వ్యాజ్యమందు అతడు వ్రాసుకొన్న నాణెము సంఖ్య మొదలైనవన్నియు అట్లే మేమీవ్యవహారము నెరుగుదుము. అని సాక్షులు చెప్పుదురో అతడు గెలుచును. యెవ్వనివ్యాజ్యమందు వాదివ్రాసుకొన్న విషయమునకు వ్యతిరిక్తముగా సాక్షులుచెప్పుదురో అతడోడును. సాక్షులు మరచిపోయి యేదియు చెప్పనిపక్షమందు మరియొక మార్గముచేత నావ్యవహారమునందు న్యాయము నెరుగవలయునేకాని యాసాక్షుల నధికారిమరల మరల నడగకూడదు. ఇందుకై ఇతరసంగతులనేకములు మితాక్షరాది గ్రంథములయందు చూడదగినవి. ఇది సాక్షిప్రకరణము ముగిసెను.

అనంతరము దాయవిభాగప్రకరణము కొంచముగా వ్రాయబడుచున్నది. దాయమనగా ధనాధికారితో దేహసంబంధము గలుగుటచేత నన్యునకు స్వత్వము గలుగు ద్రవ్యము ఆదాయము, అప్రతిబంధమనియు సప్రతిబంధమనియు రెండు విధములైనది. అందు కొడుకులకు తండ్రిధనమును మనుములకు పితామహధనమును కొడుకులగుట మనుములగుట యనుసంబంధముచేత స్వత్వవిషయమగును గనుక నిదియప్రతిబంధమైన దాయము. ధనాధికారి కొడుకులు లేకుండినను ధనాధికారి లేకుండినను అతని ద్రవ్యమతని తండ్రికిగాని భ్రాతలకుగాని చేరునపుడు ధనాధికారియుండుటయు నతనికి గొడుకులుండుటయు ప్రతిబంధము గనుక నట్టి ప్రతిబంధము లేనియప్పుడు తండ్రియగుట భ్రాతలగుట యనుసంబంధముచేత స్వత్వవిషయమగును గనుక నిది సప్రతిబంధమైనదాయము. ఇట్లేవారిపుత్రులు మొదలగువారి విషయమందు నూహింపదగును. లోకమందు పుత్రాదులకు స్వత్వముజన్మముచేతనే గలుగునని ప్రసిద్ధముగా నున్నది. అందువలన స్వత్వము ధనాధికారి నాశమువలనగాని విభాగమువలనగాని గలుగనేరదు. ఇట్లే గౌతమసూ





త్రమందు పుత్రాదులుత్పత్తిచేతనే స్వత్వమును బొందుదురని చెప్పబడియున్నది. ఆస్వత్వమయితే లోకవ్యవహారముచేతనే తెలియదగినదిగాని శాస్త్రముచేత తెలియదగినదిగాదు. ఈవిషయమై మితాక్షరయందు విస్తారముగా వ్రాయబడియున్నది. రత్నములు ముత్యములు బంగారము మొదలగువానికి తండ్రిస్వతంత్రుడగునుగాని స్థావరమునకు తండ్రిగాని పితామహుడుగాని స్వతంత్రుడుగాడు. ఇందుకు "మణిముక్తాప్రవాళానాం సర్వస్యైవ పితాప్రభుః । స్థావరస్యతుసర్వస్య నపితాన పితామహః" అని మొదలగు వచనములు ప్రమాణములు స్థావరము స్వార్జితమైనను పిత్రాదులవలన వచ్చినదైనను తండ్రి, దానిని బుత్రాదులయనుమతిలేక దానము విక్రయము మొదలగువానిని జేయరాదు. ఆపద్విమోచన కుటుంబ భరణాదికార్యములయందు గూడస్థావర వ్యతిరిక్త ద్రవ్యములనుమాత్రము సెలవుచేయుటయందు తండ్రికి స్వతంత్రమైన అధికారముగలదు. ఇట్లు బృహస్పతిచేతను మనువుచేతను చెప్పబడియున్నది. అయితే స్మృత్యంతరమందు అపవాదముగలదు. యేమనగా కొడుకులుగాని తమ్ములుగాని వ్యవహారము నెరుగజాలక అనుమతియిచ్చుటకును శక్తిలేనిదశలో నుండునప్పుడు సకలకుటుంబమును వ్యాపించిన యాపదయందుగాని సమస్తకుటుంబపోషణవిషయమందు గాని అవశ్యకర్తవ్యములైన పితృశ్రాద్ధాది విషయములయందు గాని కుటుంబ నిర్వాహకుడుగానున్నవాడొకడే స్థావరమును దానముచేయుటఅడుమానముంచుటవిక్రయించుట, చేయవచ్చునని చెప్పబడియున్నది. తండ్రియుండగా కొడుకులు విభాగము చేసికొనుటయందు తండ్రి శాస్త్రసమ్మతమగు మార్గము నవలంబించి తన ఇష్టానుసారముగా పంచియివ్వవలయును. ద్రవ్యమార్జింప సమర్థుడై పితృద్రవ్యమును గోరకున్న కొడుకునకేదైన కొంచమిచ్చి వేశివేరు పరచవలయును. కొంచమిచ్చి వేరుపరుచుట యతనికొడుకులు మొదలగువారు పిమ్మట నవిభక్తులమని వ్యవహారము లేకుండుటకని తెలియదగినది. తల్లిదండ్రులుండగ కొడుకులువిభాగముగాక యున్నచో తల్లిదండ్రులు గతించినపిమ్మట కొడుకులు ద్రవ్యమునుసమముగాభాగించుకొని యప్పును సమముగా తీర్చవలయును. ఇచ్చట నొకవిశేషము గలదు. అదియేమన్నను, తల్లిధనము తల్లిచేసినయప్పుదీర్చగా మిగులునంతయున్నపక్షమందు దానికొమార్తెలు పంచుకోవలయును. ఋణమునకు సరిగానున్నను తక్కువపడినను ఆద్రవ్యమును పుత్రులుతీసుకొని ఆయప్పును వారే తీర్చవలయును. ద్రవ్యము లేక యప్పున్నపక్షమందాయప్పును పుత్రులేతీర్చవలయునని యేర్పడుచున్నది. ఇచ్చట గౌతములవారు నకవిశేషమును వ్రాసినారు. అదియేమనగా, తల్లియొక్కధనమును కొమార్తెలలో పెండ్లికానివారు గ్రహింపవల

యును. అందరికి పెండ్లిఅయివుండిన పక్షమందు అందులో ధనములేనివారు గ్రహింపవలయును. తల్లిదండ్రుల ద్రవ్యము సెలవులేక స్వతఃతాను సంపాదించుకొన్న ద్రవ్యమును, స్నేహితునివలనవచ్చిన ద్రవ్యమును, వివాహకాలమందుమామ మొదలగువారలచే నివ్వబడిన ద్రవ్యమును, పితృక్రమాయాత మైనదేదైన పరులచే నాక్రమింపబడి తండ్రి మొదలగువారు సాధించుకొనజాలక వదిలిపెట్టియుండగా దానివారి యనుమతిచేత సాధించుకొన్న పక్షమం దట్టిద్రవ్యమును, విద్యచెప్పుట గ్రంథముచేయుట మొదలగువిధముల విద్యామూలముగా సంపాదించిన ద్రవ్యమును, సంపాదించినవాడు తండ్రిసహోదరుడు మొదలగువారికి పంచియివ్వనక్కరలేదు. పితృద్రవ్య సహాయములేక యీవిధములలో నేవిధముగా సంపాదించినను పిత్రాదులకు అందులో భాగమివ్వ నక్కరలేదుగాని పితృద్రవ్య సహాయమువలననే యీచెప్పినవిధములలో నేవిధముగా తానుసంపాదించుకొన్నప్పటికిని తండ్రిసహోదరులు మొదలగువారికి పంచియివ్వవలసినది. ఇచ్చట నానావిషయములు మితాక్షరయందు చూడతగినవి. అవి భక్తులగునన్నదమ్ములలో నొకడు సముదాయద్రవ్యమును వ్యాపారము మొదలగుదానిచేత వృద్ధినొందించిన పక్షమందు దానినందరు సరిగానే పంచుకొనవలయును. పితామహద్రవ్యమును పౌత్రులుపంచుకొనునపుడు తమతండ్రుల భాగములప్రకారమే పంచుకోవలయును. తల్లిఅస్పష్టగర్భయై యుండగా తల్లిగర్భిణియని తెలియక తండ్రి మృతిబొందగానే భ్రాతలు పంచుకొన్నపక్షమం దట్లు పంచుకొన్నపిమ్మట తల్లికి గొడుకుపుట్టెనేని ముందుభ్రాతలు పంచుకొనియున్న తండ్రిధనమును పిమ్మటదాననుండి వృద్ధియైనద్రవ్యమును జేర్చి యామొత్తమునందు తండ్రి యప్పున్న పక్షమందా యప్పునుదీర్చి మిగిలిన ద్రవ్యములోనుండి యెత్తి తమభాగములకు సమమగునట్లు తమ్మునికి భాగమీవలసినది. విధవయు సపుత్రయునగు భ్రాతృభార్య గర్భిణియని తెలియకుండగా భ్రాతలుపంచుకొనిపిమ్మట నామెపుత్రుని గన్నచోట నీన్యాయమే ప్రవర్తించుచున్నది. గర్భము స్పష్టముగా నున్నపక్షమందు గాను పువరకు విభాగముచేయకూడదు. ఇది వసిష్ఠమహర్షిప్రోక్తము. తల్లిదండ్రులు పుత్రులతో విభాగమునకు ముందుగాని విభాగమునకు పిమ్మటగాని విభక్తపుత్రునికిగాని అవిభక్తపుత్రునికి విభాగమునకు బిమ్మటపుట్టిన పుత్రునికిగాని ప్రేమచేతనాభరణాదు లేవయిననిచ్చిన పక్షమందు యెవనికిచ్చినది వానిదేయగును గానిదానియందితరులకు పాలురాదని తెలియదగినది అయితేపితామహద్రవ్యమునందుపౌత్రునికి దనతండ్రితోసమానమైన స్వాతంత్ర్యముగలదని శాస్త్రమున్నది గనుకతండ్రి పుత్రులతో విభక్తుడుగాక ముందుగా సకలమైన ఆభరణములను వం





చనచే కొందరుపుత్రుల కుమాత్రమిచ్చి వేశిమిగిలినవారికి నివ్వకపోరాదు. అట్లు అన్నియివ్వక కొంచముగా ఆభరణాదులేవయినను కొందరు పుత్రులకు ప్రేమచేతనివ్వవచ్చును. అందుకై తండ్రికి స్వాతంత్ర్యముగలదు. తండ్రిజీవించియుండగాజేయువిభాగమందు పుత్రులతోసమభాగము భార్యకివ్వవలయును. తండ్రికాలానంతరముపంచుకొను పుత్రులునుతమభాగములకు సమభాగముతల్లికీ వలయును. తండ్రియున్నపుడుపనయనాది సంస్కారములు చేయబడినభ్రాతలువిభాగించుకొనునపుడవిజరగని భ్రాతలకు సముదాయద్రవ్యముచేత నాయుపనయనాదిసంస్కారములను జేయవలయును. తండ్రిచేతవివాహము చేయబడనియాడతోడుబుట్టువులకు వివాహకాలమందు భ్రాతలుయివ్వవలసిన ద్రవ్యమేమనగా, వారు పురుషులుగానున్న పక్షమందుతమతో సమభాగముగలుగునుగదా. స్త్రీలుగానున్నందువలన అంతభాగమందు నాలగవభాగము నివ్వవలయును. భ్రాతలలో నొకడుగాని కొందరుగాని తక్కినవారికిదెలియకుండనేదైన సముదాయద్రవ్యమపహరించియుండి యదివిభాగముచేసికొన్న పిమ్మటనెరుగబడిన పక్షమందు దానినందరు సమభాగములుగా పంచుకొనవలెను. అష్టవిధవివాహములలోనేవర్ణమువారికేవివాహము ధర్మ్యమగునో యట్టివివాహముచేసుకోబడినసమానవర్ణముగలభార్యయందు పుట్టినపుత్రుడౌరసుడనబడును. అతడుముఖ్యపుత్రుడు. తండ్రి దేశాంతర గతుడైనను మృతుడైనను అతనియనుమతిచేత తల్లిదానముచేసినపుత్రుడుగాని తండ్రిదానముచేసిన పుత్రుడుగాని తల్లిదండ్రులు భయులుదానముచేసినపుత్రుడుగాని ప్రతిగ్రహించిన వానికిదత్తపుత్రుడగును. ఇందుకుపయోగించుకొన్నిసంగుతులను మేముప్రకీర్ణక ప్రకరణమందు వ్రాసినాము) ఔరసపుత్రుడు లేనపుడు దత్తపుత్రుడు దాయమునుపొందును. అపుత్రకుడై గతించినవానిద్రవ్యమును బొందదగినవారి క్రమమేమన్నను, విభక్తుడై సంసృష్టి గాని వాడుపుత్రహీనుడై మృతిబొందెనేని వానిద్రవ్యమందుసాధ్వియగు నతనిభార్యకే అధికారము. భార్యలేనిపక్షమందు కొమార్తెలకధికారము. దుహితలులేనిపక్షమందుదౌహిత్రులు అధికారులు. వారులేనిపక్షమందు తనతల్లిఅధికారి. ఆపె లేనిపక్షమందు తండ్రిఅధికారి. తండ్రిలేనిపక్షమందు సోదరభ్రాతలు అధికారులు. వారులేనిపక్షమందు భిన్నోదరభ్రాతృలు అధికారులు. వారులేనిపక్షమందుభ్రాతృపుత్రులు అధికారులు. వారులేనిపక్షమందు పితామహిఅధికారి. ఆపె లేనిపక్షమందు పితామహాపితృవ్యతత్పుత్రులు అధికారులు. వారులేనిపక్షమందు ప్రపితామహీప్రపితామహుడు అతనికొడుకులు వారికొడుకులును ఈరీతిగానేడుతరములసగోత్రసపిండులు అధికారులు. వీరులేనిపక్షమందు సమానోదకులు.

వారులేనిపక్షమందు త్రివిధ బాంధవులు అధికారులు. వారులేని పక్షమందాచార్యశిష్యాదులు అధికారులు. వారులేనిపక్షమందు బ్రాహ్మణద్రవ్యమునకు వకశ్రోత్రియుడును, ఇతరుల ద్రవ్యమునకు ప్రభువును అధికారులగుదురని సకలము తెలియదగినది. అయితే నీ చెప్పబడియున్న విషయమునకు అపవాదముగలదు. అది యేమనగా, వానప్రస్థుని ధనమును ధర్మపరుడై యతనితోగూడ వానప్రస్థాశ్రమమును బొందియున్న భ్రాతపొందును. యతినియొక్క ధనమును వేదాంతశాస్త్రమును జదివి తెలిసికొనియందు చెప్పియున్న ప్రకారము నడుచుకొనగల శిష్యుడు పొందును. నైష్ఠికబ్రహ్మచారియొక్క ధనమును ఆచార్యుడు పొందును. అని తెలియదగినది. ఇందుకు ప్రమాణశ్లోకములు యాజ్ఞవల్క్యస్మృతియందు "పత్నీదుహితరశ్చైవ పితరౌ భ్రాతరస్తథా । తత్సుతో గోత్రజో బంధుః శిష్యస్స బ్రహ్మచారిణః ॥ ఏషామభావే పూర్వస్య ధనభాగుత్తరోత్తరః। స్వర్యాతస్య హ్యపుత్రస్య సర్వవర్ణేష్వయం విధిః॥ వానప్రస్థయతి బ్రహ్మచారిణాం రిక్థభాగినః । క్రమేణాచార్య సచ్ఛిష్య ధర్మభ్రాత్రేకతీర్థినః ॥ ' అని చెప్పబడియున్నవి. (క్రమేణ, అనుటకు ప్రతిలోమక్రమేణ, అని అర్థము.) అయితే పత్నీదుహితరశ్చైవ, అనుడకు వేరే అపవాదముగలదు. అదియేమన్నను, విభాగమైనపిమ్మట నావిభాగించుకొన్న ద్రవ్యమును మరలగలుపుకొని యొకటిగా గాపురముండు వారు సంసృష్టులనబడుదురు. ఈసంసర్గము తండ్రితోడను భ్రాతతోడను పితృవ్యునితోడను గూడునే కాని తక్కినవారితో గూడదు. అట్లు బృహస్పతివచనమున్నది. అట్టిసంసృష్టియైనవాడు మృతుడైనపిమ్మట విభాగము చేసుకొనునట్టి సమయమందతని భార్య గర్భిణియని తెలియకయుండి పిమ్మట గొడుకును కన్నపక్షమందా కొడుకునకు అతని తండ్రి భాగము నీయవలెను. లేనిపక్షమందు సంసృష్టియే గ్రహింపవలయునుగాని వానిభార్యకీ బనిలేదు. ఇచ్చట మరికొన్ని సంగతులు మితాక్షరయందు చూడతగినవి. ఇంక నీప్రకరణమందునేక సంగతులున్ను ఇతరప్రకరణములున్ను కూడ మితాక్షరయందు చూడదగును.

ఇది వ్యవహారప్రకరణము ముగిసెను.





## ప్రాయశ్చిత్తప్రకరణం.

అనంతరము ప్రాయశ్చిత్తములు కొన్ని వ్రాయబడుచున్నది. తాను బుద్ధిపూర్వకముగనైనను, అజ్ఞానమువల్లనైనను, ప్రమాదమువల్లనైనను, అనిచ్ఛవలననైనను, పరేచ్ఛవలననైనను, చేసిన పాపములకు ప్రాయశ్చిత్తమును జేసుకొనవలయును. పాపములవలన నరకప్రాప్తియు హీనజన్మప్రాప్తియు రోగప్రాప్తియు మూకత్వాంధత్వాది ప్రాప్తియు దారిద్ర్యప్రాప్తియు మొదలగునవి పాపభేదానుసారముగా తత్తారతమ్యానుసారముగా గలుగునని స్వతఃప్రమాణభూతమై అప్రామాణ్యకారణ రహితమైన శాస్త్రమువలన తెలియుచున్నందున తాను తెలివి గలవాడై పాపనిదానంబులయిన రాజసాది సకల వృత్తులవలన జనించెడి కామక్రోధాదులను విడిచి పాపములను జేయక నుండవలెను. ఇట్లు జాగరూకుడై యుండినను వకవేళ యేవిధము చేతనైన పాపములను జేసినచో వెంటనే అందుకు శాస్త్రోక్తములైన ప్రాయశ్చిత్తములను జేసి పాపములను నివృత్తిజేసికొనవలయు. "అతీతే చిరకాలేతు ద్విగుణం వ్రతమిష్యతే" అనే న్యాయము ననుసరించి పాపము చేసినపిమ్మట ప్రాయశ్చిత్తమును వెంటనే జేసుకొనుక చిరకాలము గతించినపిమ్మట ప్రాయశ్చిత్తమును చేసుకొను పక్షమందు చేయదగియున్న ప్రాయశ్చిత్తమునకు రెండంతలుగా ప్రాయశ్చిత్తమును జేసుకొనవలయును. ఇట్లు ప్రాయశ్చిత్తమును జేసికొనినపిమ్మట మరల ఆపాపమునే అయినను మరియొక పాపమును అయినను ఏవిధముచేతనైనా జేసితే అందుకు చేయతగిన ప్రాయశ్చిత్తమును మరల జేసికొనవలయును. ఇట్లు ప్రాయశ్చిత్తమును జేసికొనినవానికి పాపము నివర్తించుటవలన యీలోకమందును పరలోకమందును అశుద్ధియుండ జాలదు. ఆప్రాయశ్చిత్తము అనేకభేదములుగా నున్నది. యెట్లన్నను మరణాంతప్రాయశ్చిత్తము ద్వాదశాబ్దవ్రతాది ప్రాయశ్చిత్తము, కృచ్ఛ్రచాంద్రాయణోపవాసాది ప్రాయశ్చిత్తము, తీర్థయాత్రాది ప్రాయశ్చిత్తము, దేవబ్రాహ్మణపూజాది ప్రాయశ్చిత్తము, నాచరణ ప్రాయశ్చిత్తము, ప్రాణాయామ జపాది ప్రాయశ్చిత్తము, ధర్మకార్యాచరణ ప్రాయశ్చిత్తము, విధ్యుక్తోపకారకరణప్రాయశ్చిత్తము, యీమొదలగు అనేకభేదములు గలదిగా నున్నది. కొన్నిపాపములయందుమాత్రము ప్రాయశ్చిత్తభేదములకు సముచ్చయముగలదు. ఈశ్వరధ్యాననామకీర్తనాదిరూపమైన ప్రాయశ్చిత్తము, దేవతాధ్యాన నామకీర్తనాది ప్రాయశ్చిత్తము, మొదలగు ప్రాయశ్చిత్తములున్నను అందుకు అధికారి దుర్లభుడుగనుక అధికార్యనుసారముగనే ప్రాయశ్చిత్తకల్పము చేయదగినది. అట్లనే కాలదేశాదులననుసరించి కూడ ప్రాయశ్చిత్తకల్పనము చేయదగినది. ఇచ్చట కొందరు వివేకశూన్యులు వక ఆశంకను చేయుచున్నారు. అది యేమనగా "నామ్నోహి యావతీశక్తిః పాపనిర్హరణే హరేః । తావత్కర్తుం నశక్నోతి పాతకం పాతకీజనః ॥ అనియు లోకత్రయాధిపతి మప్రతిమ ప్రభావమీశత్వ ప్రణమ్య శిరసా ప్రభవిష్ణుమీశం । జన్మాంతర ప్రళయ కల్పసహస్రజాత మాశు ప్రణాశముపయాతి నరస్య పాపం॥ అనియు కోటయో బ్రహ్మహత్యానామగమ్యాగమకోటయః । సద్యః ప్రళయ

మాయాంతి మహాదేవేతి కీర్తనాత్ ॥ అనియు" మొదలగు వచనములవలన వక పర్యాయము భగవన్నామ స్మరణమునుగాని భగవన్నమస్కారమును గాని చేసినవానికి అనేకకోటి జన్మార్జిత సకలపాపములు నశించును నిశ్చయమని చెప్పియుండగా అనేక పర్యాయములు భగవన్నామ స్మరణాదులను చేసినవానికి పాపమెక్కడిది ప్రాయశ్చిత్తశాస్త్రముతో ప్రయోజన మేమున్నది. యెట్టివాడైనను వక పర్యాయమైనను అజ్ఞాన ప్రమాదాదుల చేతనైనను భగనన్నామ స్మరణాదులనుచేయక నుండజాలడుగదా వకవేళ మేము ధహరించిన యీవచనములు బుద్ధిపూర్వకముగా భగవన్నామ స్మరణాదులను చేసినవారి పరమలేనని మీరుఅర్థముచేతురేమో అట్లయితే మేము బుద్ధిపూర్వకముగా భగవన్నామస్మరణమును యిప్పుడే చేసెదము. ఇక మాకు పాపములేదు నిశ్చయము. అని కొందరు వివేకశూన్యులు ఆశంకించుచున్నారు. ఇందుకు సమాధాన మేమనగా, భగవంతుండగు పరమేశ్వరుడు నిరవధికృపా నీరధియును భక్తవత్సలుండును అయ్యున్నవాడుగనుకనే వకపర్యాయము మాత్రము తననామమును సంపూర్ణభక్తితో స్మరించువానికి సకల పాపములను నిర్మూలముగా బోగొట్టుననుటకు సందేహము లేదనుట మాకనుమత మేను. అయితే నీకుమాత్రము పరిపూర్ణభక్తి లేదనుట నిశ్చయము గనుక సకల పాపములు నీకువక పర్యాయము భగవన్నామస్మరణమువలనపోజాలవు. మరియు వకపాపముకూడపోజాలదు. అందువలన బ్రహ్మహత్యాది పాపమునందు ద్వాదశాబ్ద వ్రతాదిప్రాయశ్చిత్తమును భక్తితో శాస్త్రవిశ్వాసముగలవాడై అనుష్ఠింపవలయును. అట్లుజేసితే నీకు బ్రహ్మహత్యాదిపాపము పోవుచున్నది. అట్లులేక లక్షపర్యాయములు భగవన్నామ స్మరణమును చేసినను నీకా బ్రహ్మహత్య పోచాలదు. వకవేళద్వాదశాబ్ద వ్రతప్రాయశ్చిత్తముకన్నను భక్తితో భగవన్నామ స్మరణమును చేయుటమేలని నీకుతోచినపక్షమునకు సాంగమైనవిధ్యుక్త ద్వాదశాబ్ద వ్రతప్రాయశ్చిత్తమునకు ౭౨౦ ప్రాజాపత్య కృచ్ఛ్రములగుచున్నవి గనుక వక కృచ్ఛ్రమునకు ౧౫౦౦౦౦ పర్యాయములు భగవన్నామ స్మరణము ప్రత్యామ్నాయము గనుక కొంచము తక్కువగా పదనొకండు కోట్లు పర్యాయములు భగవన్నామ స్మరణమును భక్తి శ్రద్ధలతోజేయుము. అట్లుజేసితే నీకు బ్రహ్మహత్యాపాపము పోవుచున్నది. నీకు పరమేశ్వరునియందు అల్పభక్తిగలదుగాని సంపూర్ణభక్తి లేదనుట యేలాగంటేను చెప్పెదవినుము వైరాగ్యము లేక సంపూర్ణభక్తియుండజాలదుగదా మరియు సంపూర్ణముగా పరమేశ్వరుని నమ్మినభక్తునికి పరమేశ్వరుడే చతుర్విధపురుషార్థముల నిచ్చుచుండగా మరియింకొకనిని ప్రార్థించుటయేల. మరియునొకవేళ పరమభక్తుడు చతుర్విధపురుషార్థములను గోరకనే





యుండును. మోక్షమునుగూడ గోరనిపరమభక్తుడు త్రివర్గమును గోరునా. ఇందుకై "నపరిలషంతి కేచిదపవర్గమపీశ్వరతే చరణసరోజహంస కులసంగవిసృష్టగృహాః" అని శ్రీమద్భాగవతమందు శ్రుతిగీతలయందు చెప్పబడినది. మరియును అణిమామహిమాది సర్వసిద్ధులు వకపర్యాయము ఈశ్వరనామోచ్చారణమువలననే గలుగుచున్నవిగదా. ఇందుకు "సకృదుచ్చారణాదేవసర్వసిద్ధి ప్రదాయకం। యన్నామంత మహేశానం శరణంయామిశంకరం" అని వచనమున్నదిగదా. ఆప్రకారము నీవు వకపర్యాయము మాత్రమేగాక కోటిపర్యాయములు భగవన్నామ స్మరణముచేసినప్పటికిని సర్వసిద్ధిగలుగ నేరదుగదా. మరియు వకపర్యాయము పరమేశ్వరనామోచ్చారణమును చేసినమాత్రముచేతనే ముక్తిగలుగుచున్నదిగదా. ఇందుకు "మహాదేవమహాదేవమహాదేవేతి యోవదేత్ । ఏకవారాద్భవేన్ముక్తిర్ద్వాభ్యాం దేవోభవేదృణీ" అని వచనమున్నదిగదా ముక్తుడు సర్వజ్ఞత్వసత్యసంకల్పత్వాది మహిమగలవాడే గాని నీవలె ధన్యం మనుష్యుడుగాదుగదా. ఇట్టిమహిమగల ముక్తి కోటిపర్యాయములుభగవన్నామ స్మరణమును చేసినను నీకుగలగదుగదా. ఇట్లు చెప్పుటవలన భగవన్నామ స్మరణమువలన నీవంటివానికి ముక్తియు సర్వసిద్ధియు గలుగనేరదని మాయభిప్రాయముగాదు. నీవు విశేషశ్రద్ధాభక్తులచేత భగవన్నామ స్మరణాదులను నిరంతరము చేయగా క్రమముగాచాలాకాలమునకు భక్తిపూర్ణమై దానిచే ఆత్మజ్ఞానము గలిగిదానిచే ముక్తిగలుగుచున్నది. వకవేళ యీజన్మమునందు ముక్తిగలగక బోయినను నీవు భక్తితో భగవన్నామస్మరణముచేయుట వ్యర్థముగాదు. కొన్నిజన్మాంతరములు వెళ్లిపోయినపిమ్మట అవశ్యము ముక్తిగలుగును. సర్వసిద్ధివిషయమందు గూడనిదేప్రకారమే తెలియవలెను. ఇందుకు "ప్రయత్నాద్యతమానస్తుయోగీసం శుద్ధకిల్బిషః । అనేకజన్మ సంసిద్ధస్తతో యాతిపరాంగతిం ॥ బహూనాంజన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే" అని భగవద్గీతలయందు చెప్పబడినది. అందువలన ప్రాయశ్చిత్తశాస్త్రము సార్థకమైనదని తెలియదగినది.

బ్రహ్మహత్య, సురాపానము, బ్రాహ్మణ సువర్ణస్తేయము, గురుభార్యాగమనము, ఇవి మహాపాతకములు. ఈమహాపాపములు చేసినవారితో సహవాసముచేసినవాడు అయిదవ మహాపాపియని తెలియదగినది. సఖిభార్య ఉత్తమజాతీయురాలగు కన్యక, భగిని, చండాలస్త్రీ, సమానగోత్రురాలయిన స్త్రీ, కోడలు వీరిని గమనముచేయుట ప్రత్యేకముగా గురుభార్యాసమానమేను యీచెప్పినవారిలోనెవ్వరినైన గమించిరేతస్సేకముకన్నను పూర్వమే సంగమమునుచాలించియున్నవానికి ప్రాయశ్చిత్తముతక్కువ రేతస్సేకముకూడనయి వున్నచో మహాప్రాయ

శ్చిత్తము గురుభార్యాగమనముఅనగా కన్నతల్లియొక్క గమనముఅని అర్థము. పితృభగిని, మాతృభగిని, మాతులభార్య, కోడలు, తల్లిసవితి, ఆత్మభగిని, ఆచార్యునికూతురు, ఆచార్యపత్ని, తనకూతురు భ్రాతృభార్యా, పత్నీమాత, పిన్నతండ్రిభార్య, శరణాగత స్త్రీ, సన్యసించిన స్త్రీ, వ్రతచారిణియైన స్త్రీ, తల్లికన్నన్యయై స్తన్యాదానము మొదలగు దానిచే తనను పోషించిన స్త్రీ, తనవర్ణముకన్నను అధికవర్ణముగల స్త్రీ, ఈమొదలగు స్త్రీని గమనముచేసినవానికి శిశ్నచ్ఛేదముచేత చచ్చుటయే ప్రాయశ్చిత్తము. ఇట్టివాడు గురుభార్యాగమనముచేసిన వానితో సమానుడేనని అర్థము. మరియెప్పుడయితే ఈచెప్పబడిన స్త్రీలు కామయుక్తలై ఈపురుషులనే వశముచేసుకొని అనుభవించుచున్నారో అప్పుడు స్త్రీలకు కూడచచ్చుటయే ప్రాయశ్చిత్తము. ఇచ్చట అనేకవిశేషములు మనుపరాశరయాజ్ఞవల్క్యాద్యనేకస్మృతులయందున్ను తద్వ్యాఖ్యానములయందున్ను చూడతగినవి. గురువులయందు లేనిదై గొప్పదోషము నారోపించుట గురువులయందుదోషముండినను లోకమునకు తెలియకుండిన యాగొప్పదోషమును ప్రకాశింపజేయుట నాస్తిక్యాభినివేశముచేత వేదనిందనము, బ్రాహ్మణాతిరిక్తుడైననుతనకు మిత్రుడుగానున్నవానిని వధించుట అనచ్ఛాస్త్రీవినోదాదులచే తానభ్యసించినవేదమును మరచిపోవుట ఇది యొక్కొక్కటి బ్రహ్మహత్యాసమమైనది. నిషిద్ధములగు మనుప్రోక్తములైన ఛత్రాకలశునపలాండ్వాదులను బుద్ధిపూర్వకముగాభక్షించడము, విశేషముగా చాడిచెప్పడము, మిక్కిలి ఆత్మస్తుతిచేతను పరనిందచేతను యుక్తమైన అనృతమును మాట్లాడడము, రజస్వలా స్త్రీయొక్క వక్త్రాసవమును ఆస్వాదించడము, ఇవి ప్రత్యేకముగా సురాపానసమానములైనవి. బ్రాహ్మణసంబంధములైన అశ్వము, రత్నము, మనుష్యుడు, స్త్రీ, భూమి, ధేనువు, వీటియొక్క హరణమున్ను నిక్షేపముయొక్క హరణమున్ను ప్రత్యేకముగా సువర్ణస్తేయముతో సమానమైనది. తనచే వధింపబడియున్న బ్రాహ్మణునియొక్క శిరఃకపాలమును హస్తముచేత చిహ్నార్థముగా ధరియించినవాడై అట్లనేధ్వజమునుఅనగాదండాగ్రమందు ఆరోపింపబడిన మరియొక శిరఃకపాలమును హస్తముచేతనే ధరియించినవాడై, లోహితకమై నమృణ్మయఖండశరావముచేత భిక్షముకొరకు అసంకల్పితములైన సవర్ణులయొక్క సప్తగృహాలయందు మాత్రముపోయి వేశ్మనోద్వారి తిష్ఠామిభిక్షార్థీబ్రహ్మఘాతుకః అని తనకర్మమును ఖ్యాపనముచేయుచు ఏకకాలమందు భిక్షను గ్రహించి ప్రాణధారణమాత్ర పర్యాప్తమగు ఆభిక్షను ఏకకాలమందు భక్షించినవాడై దృఢబ్రహ్మచర్యవ్రతముగలవాడై ఆచారముచేతస్వవర్ణానుసారముగా స్నానసంధ్యోపాసనాది నిత్యనైమిత్తికకర్మలను చేయువా





డై పదిరెండుసంవత్సరములు ఇట్లు అనుష్ఠించితే బ్రహ్మహత్య నివర్తించును. బ్రాహ్మణశిరః కపాలములు దొరకనపుడు మరియొక బ్రాహ్మణుని యొక్కయే శిరఃకపాలములు గ్రహించతగినవి. యీకపాలధారణము చిహ్నార్థమేగాని భిక్షభోజనముకొరకైనను గాదు. ఇచ్చట వధింపబడిన బ్రాహ్మణుని తారతమ్యము ననుసరించిద్వాదశాబ్దవ్రతమును గాని తన్న్యూనవ్రతమును గాని నిర్ణయించడము పరాశరమాధవీయ మితాక్షరాదివ్యాఖ్యాన గ్రంథములయందు చూడవలెను. గురువునుగాని శ్రోత్రియునిగాని వధించితే మిక్కిలి విశేషప్రాయశ్చిత్తముగలదు. అదికూడను మరియునిచ్చట అనేకవిశేషములున్ను ఆగ్రంథములయందే చూడదగినవి. సురాపానము జేసినవాడు అగ్నిసమానమైన సుర, ఉదకము, గోఘృతము, గోమూత్రము, గోక్షీరము, వీటిలో దేనినైనను ఆర్ద్రవస్త్రమును ధరించినవాడై లోహపాత్రముచేత పానముచేసి మరణమును చెందితే పరిశుద్ధుడగును. ఈప్రాయశ్చిత్తము బ్రాహ్మణక్షత్రియ వైశ్యులకే నని తెలియవలయును. ఏకపర్యాయము సురాపానముచేసిన వానికే యీప్రాయశ్చిత్తము. అనేక పర్యాయములుసురాపానముచేసినవానికి విశేషప్రాయశ్చిత్తము గలదు. ఈమరణాంత ప్రాయశ్చిత్తము కామకృతవిషయమునందే నని తెలియవలెను. అజ్ఞానమువలన సురాపానమును చేసినవానికి ద్వాదశాబ్దషడబ్దాది ప్రాయశ్చిత్తములలో శాస్త్రసమ్మతమైనదానిని చేసుకొని పునరుపనయనమును చేసుకొనవలయును. రేతోమూత్రపురీషములను అజ్ఞానమువలన భక్షించితే షడ్రాత్రాదివ్రతము నాచరించి అనంతరమే పునరుపనయనమును చేసుకొనవలెను. ఇచ్చట విశేషములు స్మృతిగ్రంథములయందు చూడవలెను. బ్రాహ్మణునియొక్క సువర్ణమును సమక్షము నందుగాని, పరోక్షమునందుగాని, బలాత్కారము వలనగాని, చౌర్యముచేతగాని, అన్యాయముగా అపహరించినవాడు, ప్రకీర్ణకేశుడై ఆర్ద్రవస్త్రముగలవాడై నేను బ్రాహ్మణ సువర్ణస్తేయమును చేసితిని అని ప్రసిద్ధముగా చెప్పినవాడై ముసలమును రాజుకిచ్చి యీముసలముచేతనన్ను హననముచేయుము, అని చెప్పగా రాజుతానువకతూరి హననముచేయవలెను. ఆదెబ్బచేత చచ్చినను జీవించినను పరిశుద్ధుడగును. యీమరణాంత ప్రాయశ్చిత్తము ఇచ్చట బుద్ధిపూర్వకమునందే నని తెలియవలయును. ఇచ్చట ౧౫ యవలు వకమాషము. ౧౬ మాషములు వకసువర్ణము. సువర్ణప్రమాణమయిన బంగారమును దొంగలించుట సువర్ణస్తేయమనంబడును. అంతకుతక్కువ సువర్ణమును అపహరించితే ప్రాయశ్చిత్తమేమనగా మాషమాత్రమైన బ్రాహ్మణసువర్ణమునకు మూడుమాసములు గోమూత్రయావకాహారము ప్రాయశ్చిత్తము. అంతకన్నను అధికముగా సువర్ణప్రమా

ణముకన్నను తక్కువగా సంవత్సరము గోమూత్రయావకాహారము ప్రాయశ్చిత్తము. ఈ స్తేయప్రాయశ్చిత్తమును చేసుకొనునతడు తానపహరించిన ధనమును ఆసొత్తుదారునికిచ్చియే ప్రాయశ్చిత్తమును చేసుకొనవలెను. రజతాదులయందు కూడ సువర్ణప్రమాణమైన బంగారుకు నెంతమూల్యమో ఆమూల్యమునకును రజతాదిమూల్యమునకును తారతమ్యమెంతయో ఆ ధరప్రకారము తగువైన ప్రాయశ్చిత్తమును యీచెప్పినప్రకారమే విధించవలయును. క్షత్రియవైశ్యాదులయొక్క సువర్ణమునపహరించితే ఇంతకన్నను ప్రాయశ్చిత్తముతక్కువ. ఇచ్చట భేదములున్ను విశేషములున్ను స్మృతితద్వ్యాఖ్యానములయందు చూడవలెను. గురుభార్యాగమనవిషయమందు అజ్ఞానముచేతనయినను కన్నతల్లియొక్క లేక ఆత్మభగినియొక్క లేక నిజపుత్రికయొక్క గమనముచేయుటయందు మరణాంతమైన ప్రాయశ్చిత్తము. అయితే అజ్ఞానమువలన గమనముచేయునపుడు రేతస్సేకముకన్నను పూర్వమే సంగమమును చాలించగా మరణాంతమైన ప్రాయశ్చిత్తములేదు. మూడుచాంద్రాయణములు ప్రాయశ్చిత్తము. అయితే మొదట మేము వ్రాసినగురుభార్యా గమనకర్తృతుల్యులవిషయమందు ఈ చెప్పినముగ్గురికన్న నితరస్త్రీని అజ్ఞానముచే రేతస్సేకయుక్తమైన గమనమును చేయుటయందు కూడ మరణాంతమైన ప్రాయశ్చిత్తములేదు. తక్కువప్రాయశ్చిత్తమేను. జ్ఞానముచేత గమనముచేయుటయందయితే మరణాంతప్రాయశ్చిత్తమేను. ఈచెప్పబడిన గురుతల్పగమనప్రాయశ్చిత్తము సకృద్గమనమందేనని తెలియవలెను. శూద్రుడు మొదలగువానికి గమనముచేసిన బ్రాహ్మణస్త్రీకి మరణాంతప్రాయశ్చిత్తము. బ్రాహ్మణస్త్రీని వకపర్యాయమైనను గమనముచేసిన శూద్రాదులకుకూడ మరణాంతప్రాయశ్చిత్తము. చండాలస్త్రీని గమనముచేసిన బ్రాహ్మనునికి ప్రాయశ్చిత్తము ఇంతకన్నను కొంచమేను. యెట్లన్నను. వకపర్యాయము అజ్ఞానముచేత గమనముచేసితే రెండుచాంద్రాయణములు ప్రాయశ్చిత్తము. బుద్ధిపూర్వకముగావకపర్యాయము గమనముచేసితే 30 కృఛ్రములు వకసంవత్సరమందు చేయుట ప్రాయశ్చిత్తము. వకదినమంతయు అనేకపర్యాయములు చండాలస్త్రీని గమనముచేసినవానికి అబ్దత్రయప్రాయశ్చిత్తము. బుద్ధిపూర్వకముగా అనేకకాలము చండాలస్త్రీగమనముచేసినవానికి మరణాంతిక ప్రాయశ్చిత్తము. అయితే అత్యంతవ్యభిచారులుగానున్న కోడలు, మాతులభార్య, సవతితల్లికూతురు, మొదలగువారిని బుద్ధిపూర్వకముగా వకపర్యాయము గమనముచేసితే చాంద్రాయణము ప్రాయశ్చిత్తము. అజ్ఞానముచేతనయితే తప్తకృఛ్రము ప్రాయశ్చిత్తము. అజ్ఞానముచేతనైనను వకపర్యాయము ఆత్మభగినీగమనము లేక నిజపుత్రికాగమ





నము మరణాంత ప్రాయశ్చిత్తహేతువని మేము పైనవ్రాసినవిషయము కేవల పాతివ్రత్యము పతినిభక్తించు గల స్త్రీయై యున్నప్పుడేగాని వేరేకాదు. ఈచెప్పిన బ్రహ్మఘాతి, సురాపుడు, స్తేయి, గురుతల్పగుడు, అను వీరిచేత సంవత్సరము అత్యంతముగా సహవాసము చేసినవాడు వీరలతో సమానుడేనని తెలియవలెను. వీరలు ద్వాదశవార్షికాది ప్రాయశ్చిత్తార్హులు గనుక ద్వాదశవార్షికాది ప్రాయశ్చిత్తమును తాను చేసికొనవలెను. ఇది బుద్ధిపూర్వకసంసర్గమునందేనని తెలియవలెను. అజ్ఞానముచేత సంసర్గము నందయితె ప్రాయశ్చిత్తము స్వల్పము. సంవత్సరముకన్నను తక్కువగానే వీరలతో సంసర్గమునుచేసియుండగా తక్కువ ప్రాయశ్చిత్తమేను. నిషిద్ధసంసర్గోత్పన్నులగు ప్రతిలోమజాతిగల సూతమాగధాదులను వధించుటయందు తత్తద్భేదానుసారము షాణ్మాసికవ్రత, చాంద్రాయణ, పరాకకృఛ్రా, దిప్రాయశ్చిత్త భేదములు విజ్ఞానేశ్వరీయమందు చూడవలెను. ఇతరసంగతు లనేకములు స్మృతిద్వ్యాఖ్యానములయందు చూడవలయును. "నజాతుబ్రాహ్మణం హన్యాత్సర్వపాపేష్వవస్థితం" అనియు "వధేనశుధ్యతి స్తెనో బ్రాహ్మణస్తపసైవవా" అనియు చెప్పబడి యున్నందువలన బ్రాహ్మణునికి మరణాంతప్రాయశ్చిత్తార్హంబైన పాపమందు తత్ప్రత్యామ్నాయములగు జపాదులనే చెప్పవలెను. జపాదులలో దేనియందైనను అధికారిగాకయున్నపక్షమందు వధరూపమైన ప్రాయశ్చిత్తమును విధించవలెను. ఇందునుగురించి చతుర్వింశతి మతమందు "గాయత్ర్యాస్తు జపన్కోటిం బ్రహ్మహత్యాం వ్యపోహతి। లక్షాశీతిం జపద్యస్తు సురాపానాత్ప్రముచ్యతే। పునాతిహేమహర్తారం గాయత్ర్యాలక్షసప్తతిః। గాయత్ర్యాలక్షషష్ట్యాతు ముచ్యతే గురుతల్పగః" అని యున్నది. ఇచ్చట చిత్తశుద్ధిలేని కొందరు వివేకశూన్యులు ఆశంకించుచున్నారు. యేమనగా మరణాంత ప్రాయశ్చిత్తము కోటిగాయత్రీ జపాది ప్రాయశ్చిత్తము ద్వాదశవర్షికవ్రతాది ప్రాయశ్చిత్తము. ఇత్యాది ప్రాయశ్చిత్తములు శాస్త్రజ్ఞానములేనివారిని గురించిన్ని సంధ్యావందనము మొదలగు నిత్యకర్మలచేతనే పాపమునిర్మూలమై పోవుచున్నప్పటికిని పోవునో పోదో అని సంశయజ్ఞానముగలవారిని గురించిన్ని విహితములైనవిగాని నిశ్చయజ్ఞానముగలిగి యున్నమాకున్ను శాస్త్రజ్ఞానముగలిగియున్న మాకున్నుకాదు. సకలపాపములు సంధ్యావందనాది నిత్యకర్మలచేతనే పోవునని మామతము సంధ్యావందనోక్తశ్రుతిసంమతము. అని కొందరు వివేకశూన్యులు ఆశంకించుచున్నారు. అందుకు సమాధానమును చెప్పుచున్నాను. మీరు చెప్పినది పూర్ణప్రాయశ్చిత్తశుద్ధిగలవారి విషయముగాని మీకుగాదు. పూర్ణప్రాయచిత్తశుద్ధి మీకుండినచో మహనీయులగు మీరు కృతార్థు

లేగాని పూర్ణప్రాయశ్చిత్తశుద్ధి మీకు లేనందువలన యీదురాగ్రహముమీకు తగునా శాస్త్రజ్ఞానము చేతనే చిత్తశుద్ధిగలుగనేరదు. మీరు పండిత మన్యులేగాని శాస్త్రసంప్రదాయము మీకు దెలియదు. తెలిసినచో నిట్లు చెప్పరు. విజ్ఞానేశ్వరుడు "రజన్యాం వాసరేవాయత్ప్రమాదాదికృతం ప్రకీర్ణకం మానసంవాచికంచోప పాతకం తత్సర్వం ప్రాతర్మధ్యాహ్నాది కాలత్రయవిహితనిత్యసంధ్యోపాసనయా ప్రణశ్యతి" అని చెప్పియున్నందువలన మరియు దశగుణఫలముగలబహిస్సంధ్యావందనమే "అనృతం మద్యగంధంచ దివామైథునమేవచ। పునాతివృషలస్యాన్నం సంధ్యాబహిరుపాసితా" అనెడు ఫలప్రదమైయుండుటవలన సంధ్యావందనముచేత మీకు మహాపాతకాదులు బోకపోయినను ప్రమాదాదులచేత చేయబడినకాయికంబులయిన షట్పంచాశ దుపపాతకంబులుగూడ పోచాలవని సిద్ధాంతము. సంధ్యావందనమొక్కటియే కోటిమహాపాతకంబుల నైనను బోగొట్టునని మాకనుమతమేగాని కొంచము చిత్తశుద్ధిగలవారికి మాత్రమువిజ్ఞానేశ్వరోక్తప్రకారము దెలియందగును. అయితే నిశ్చయ జ్ఞానముగలవారముగనుక మాకు చిత్తశుద్ధిగలదని మీరందురేమో అట్లు అనవద్దు. మాకు నిశ్చయజ్ఞానము కొంచముగా నున్నదేగాని బాగాలేదు. అదెట్లు మాకు తెలిసినదంతేను చెప్పుచున్నాము. దయచేసి వినండి. సంధ్యావందనము పరమేశ్వరవందనమేగదా పరమేశ్వరవందనము వకపర్యాయము చేసినప్పటికిని అనేకకోటిజన్మార్జితపాపములు నశించుచున్నవిగదా. అట్లు సంధ్యావందనముచేత మీకేల నశించలేదు. నశించినవని చెప్పెదరేమో అట్లయితే మీకేల జన్మాంతరస్మృతిగలగలేదు. బహుజన్మాంతరస్మృతిగలగకబోయినను వకజన్మాంతరస్మృతికూడ మీకుగలుగలేదే. భగవద్గీతలయందు 'బహూని మేవ్యతీతాని' అనెడు శ్లోకభాష్యమందుభాష్యకారులుదురితక్షయము లేకబోవుటచేతనే జన్మాంతరజ్ఞానము గలగనేరదని వ్రాసియున్నారు. వకవేళ నిత్యకర్మముచేత పాపక్షయము మాత్రమేగాని పుణ్యక్షయముగలదు గనుక జన్మాంతరజ్ఞానము గలుగనేరదని మీరందురేమో జాతిస్మరత్వాపేక్షచే ఈశ్వరసమర్పణ బుద్ధిచేత మీరుచేసినను జాతిస్మరత్వము మీకేలగలగలేదు చెప్పండి. ఈప్రకారము ననుసరించి యైనప్పటికిని వకసంధ్యావందనమును మాత్రమేగాక నూరుసంధ్యావందనములను కూడాచేసినను మీకు జాతిస్మరత్వముగలుగనేరదుగదా. ఇట్లుచెప్పుటచేత మీకెన్నటికిని గలుగనేరదని గాదు. మరియేమన్నను సంధ్యావందనాది నిత్యకర్మలను ఈశ్వరారాధనమునున్ను అనేకసంవత్సరములు అతిశ్రద్ధతో మీరుచేయగా మీకు క్రమముగా చిత్తశుద్ధిగలిగి తద్ద్వారానిశ్చయజ్ఞానము గలుగును. అందువలన మీ చిత్తశుద్ధి తారతమ్యమును నిశ్చయ జ్ఞానమును మీరు తత్ఫలానుభవముచేత నిశ్చయించ వలసినది.





ఇది మహాపాతకి ప్రాయశ్చిత్తప్రకరణము ముగిసెను.

మహాపాతకములకన్నను అతిపాతకానుపాతకములు తక్కువ పాపము గలివి. వాటికన్నను గోవధాద్యుపపాతకములు తక్కువపాపముగలవి. వాటికన్నను జాతిభ్రంశకరాదిపాపములు (అనగా మధుమాంసఘృతతైలలాక్షాలవణరసాన్నములనెడు అవిక్రేయములను విక్రయించుట) ఇవి తక్కువపాపముగలవి. వాటికన్నను అభక్ష్యాభోజ్యామేధ్యప్రాశనములనెడు యుపపాతకవిశేషములు తక్కువపాపముగలవి. వాటికన్నను శూద్రస్త్రీగమనాన్నభోజనములనెడు యుపపాతకవిశేషములు తక్కుపాపముగలవి. వాటికన్నను ప్రకీర్ణకపాపములు తక్కువపాపముగలవి. యీపాపవిశేషములన్నియు తత్తదనేకభేదములున్ను మనుపరాశరయాజ్ఞవల్క్యాది స్మృతులయందును తద్వ్యాఖ్యానములయందును చూడవలయును.

పాపములు రెండువిధములు, రహస్యపాపములని ప్రకాశపాపములని తెలియవలయును. కర్తృవ్యతిరిక్తులచేత దోషము తెలియకుండినచో ఆదోషమురహస్యపాపము. ఇతరులకుకూడ తెలిసియుండినచో నదిప్రకాశపాపము. రహస్యపాపమునకు రహస్యప్రాయశ్చిత్తమును చేసికోవలెను. రహస్యపాపమునకు ప్రాయశ్చిత్తముకొంచము. ప్రకాశపాపమునకు ప్రాయశ్చిత్తము నిండాఅధికము. రహస్యపాపమును ప్రకాశంబుచేసినట్లయితే అధికంబైన ప్రాయశ్చిత్తముచేసికొనవలసివచ్చును గనుక రహస్యపాపమును ప్రకాశముచేయరాదు. ప్రకాశపాపమును చేసినవానిని శిష్టులు గ్రహించరుగనుక యైహికాముష్మికములయందు ప్రకాశపాపకర్తకు అశుద్ధిగలదు గనుక దోషమితనికి నిండా అధికము. రహస్యపాపకర్తకు ఆముష్మికమాత్రా శుద్ధిగలదు గనుక దోషమితనికి నిండా తక్కువ. ప్రకాశమునకయితే పరిషదనుమతంబైన (పరిషదుపదిష్టంబైన) ప్రాయశ్చిత్తమును చేసికొనవలయునేగాని స్వమతిపరికల్పిత ప్రాయశ్చిత్తమును చేసికొనినచో నది వ్యర్థమేఅగును. అందువలన ధర్మశాస్త్రమునందు రహస్యప్రాయశ్చిత్తములు ప్రకాశప్రాయశ్చిత్తములు, అని రెండువిధములుగా ప్రాయశ్చిత్తములు చెప్పబడినవి. రహస్యప్రాయశ్చిత్తమును ధర్మశాస్త్రమును తెలిసినవాడైతే తదనుసారముగా తానే చేసికొనవలయును. తెలియనివాడయితే సభయందొకానొక వ్యాజమువలన రహస్యప్రాయశ్చిత్తమును దెలిసికొని చేసుకొనవలయు. ఈరహస్యప్రకాశప్రాయశ్చిత్తములు రెండును సకలదురితములు అనేకతారతమ్యములు గలవి

గానుండుటవలన అనేకభేదములు గలవిగానున్నవి. యెట్లనగా. అజ్ఞానకృతము, జ్ఞానకృతము, ప్రమాదకృతము, అభ్యాసకృతము, మొదలగు లక్షణముగలదగుటచేత వకదురితమేఅతి స్వల్పత్వము అత్యాధిక్యము మొదలగు తారతమ్యమును చెందును. అందువలన ప్రాయశ్చిత్తముశాస్త్ర విచారవేద్యమేగాని స్వబుద్ధిమాత్రముచేతవేద్యముగాదు. అందులోధనవంతునికిదాన రూపమైనప్రాయశ్చిత్తము శక్తునికి తీర్థయాత్రోపవాసాదిప్రాయశ్చిత్తముతపోవంతునికి జపాదిప్రాయశ్చిత్తము మొదలగు ప్రాయశ్చిత్తములు అధికార్యనుసారముగా నిర్ణయించతగినవి. అందువలననే కృఛ్రచాంద్రాయణాదులకు అనేకప్రత్యామ్నాయములు ధర్మశాస్త్రములయందు చెప్పబడినవి. మరియునీప్రాయశ్చిత్తము లనుదేశకాలపాత్రాద్యనుసారముగా న్యూనాధిక్యములగు నట్లునిర్ణయించవలసినది. పరిషల్లక్షణాది విషయములున్ను సకలరహస్య ప్రకాశపాపములకు ప్రాయశ్చిత్తములున్ను మనుపరాశరయాజ్ఞవల్క్యాదిస్మృతులయందు చూడవలెను. ఇట్లుకొంచముగా చిత్తశుద్ధిగలశ్రద్ధావంతులకే యీప్రకారము నిరూపింపబడిన ప్రాయశ్చిత్తములని తెలియవలయును.

ప్రాజాపత్యకృఛ్రలక్షణము "త్ర్యహంప్రాతస్త్ర్యహంసాయం త్ర్యహమద్యాదయాచితం। పరంత్ర్యహంతునాశ్నీయాత్ప్రాజాపత్యం సమాచరేత్" అని తెలియవలయును. చాంద్రాయణలక్షణము "తిథివృద్ధ్యా చరేత్పిండాన్ శుక్లేశిఖ్యండసమ్మితాన్ । ఏకైకంహ్రాసయేత్కృష్ణేపిండంచాంద్రాయణంచరన్ । యథాకథంచిత్పిండానాంచత్వారింశచ్ఛతద్వయం । మాసేనైవోపభుంజీతచాంద్రాయణమథాపరం" అని తెలియవలయును. ఇచ్చట ననేకవిషయములున్ను తత్తదనేక ప్రత్యామ్నాయములున్ను ధర్మశాస్త్రగ్రంథముల యందు చూడవలయును.

ఇది ప్రాయశ్చిత్తప్రకరణము ముగిసెను.




అనంతరము ఆశౌచప్రకరణము సంగ్రహముగా వ్రాయబడుచున్నది. అందులో మొదట గర్భనాశము జననము మొదలగు దానియందు ఆశౌచము చెప్పబడుచున్నది. గర్భమునిలిచినది నాలుగుమాసములలోపల విచ్ఛిన్నమగుటయందు గర్భస్రావమనంబడును. అయిదవ ఆరవమాసములయందు విచ్ఛిన్నమగుటయందు గర్భపాతమనంబడును. ఏడవమాసమువచ్చిన పైన జనియించుటయందు ప్రసూతియనంబడును. మొదటి మూడుమాసములలోపల గర్భస్రావమగుటయందు మూడుదినములున్ను నాలగవమాసమందయితే నాలుగు దినము





లున్ను తల్లికి అస్పృశ్యత్వరూపమైన ఆశౌచముగలదు. పిత్రాది సపిండులకయితే స్రావమాత్రమందు స్నానమువలన శుద్ధిగలదు. అయిదవ ఆరవమాసములయందు గర్భపాతమగుటయందు తల్లికి క్రమముగా అయిదు ఆరుదినములు అస్పృశ్యత్వలక్షణమైన ఆశౌచము. తండ్రి మొదలగు సపిండులకయితే మూడుదినములు జాతాశౌచముగలదు. ఈస్రావపాతాశౌచములు సకలవర్ణ సాధారణములు మృతాశౌచములేదు. గర్భిణీస్త్రీకి యేడవమాసము వచ్చినది మొదలుకొని పిమ్మట ప్రసవమగుటయందు తల్లికిన్ని తండ్రి మొదలగు సపిండులకున్ను సంపూర్ణముగా జాతాశౌచముగలదు. ఆసంపూర్ణజాతాశౌచమెట్లన్నను, బ్రాహ్మణునికి పదిదినములు, క్షత్రియునికి పదిరెండుదినములు, వైశ్యునికి పదునైదుదినములు, శూద్రునికి సంకరజాతులకున్ను మాసము, అని తెలియదగినది ఈదశాహాశౌచమందు గర్భిణీస్త్రీకి అస్పృశ్యత్వము, పిత్రాదిసపిండులకు కర్మానధికారమాత్రము, తెలియదగినది. జాతకర్మయందును దానమందును నాళచ్ఛేదనముకన్నను పూర్వము తండ్రి కధికారముగలదు. కూటస్థునిమొదలుకొని యేడుగురు పురుషులపర్యంతులగు వారలుసపిండలు అనంతర మేడుగురుపురుషులపర్యంతులగు వారలు సోదకులుఅనగా సమానోదకులు అనంతర మేడుగురు పురుషులు పర్యంతులగు వారలుఅనగా యిరువదియొకరు పురుషులపర్యంతులగు వారలు సగోత్రులు వీరలలోస పిండులకు దశాహము, సోదకులకు త్రిరాత్రము సగోత్రులకేకరాత్రము, ఆశౌచము. ఈసపిండసోదకాద్యాశౌచవిభాగము జననమునందును మరణమందును సమానమైనది. ఇచ్చట సాపిండ్యవిచారమందు ధర్మసింధువుయందు విచారించి కడపట "ఆదశమాద్ధర్మవిచ్ఛిత్తిః" అనెడును మంతు వాక్యతద్వ్యాఖ్యానములనుబట్టి నిర్ణయించిన నిర్ణయసింధుకారుని మతము ననుసరించి వ్రాయబడినదేమనగా జీవించియున్న పితృపితామహ ప్రపితామహులుగలవానికి ప్రపితామహుని కన్నను పరమందున్న ముగ్గురు పిండభాక్కులనియు వారికన్నను వెనుకనున్న ముగ్గురు నవపురుష పర్యంతులులేప భాక్కులనియు శ్రాద్ధకర్తదశముడనియు, శాస్త్రము ననుసరించి దశమపురుషునికన్నను ముందున్న పురుషులయందు సాపిండ్యనివృత్తి యగుచున్నదనిన్ని పితృపితామహులు జీవించియుండగా నవపురుష పర్యంతము సాపిండ్యమనిన్ని తండ్రి జీవించియుండగా యెనిమిది పురుషులపర్యంతము సాపిండ్యమనిన్ని చెప్పినందువలన యెనిమిదవ పురుషుడు మొదలగువానికి పిత్రాదిజీవనదశయందు దశాహము ఆశౌచమనియు పిత్రాదిమరణానంతరమే మూడుదినములు ఆశౌచమనియు చెప్పుదురు. పితృగృహమందు కన్యకప్రసవించినచో మాతాపితృవుల

కుత్రిరాత్రము ఆశౌచము. ఆగృహమందెడు భ్రాతలకు వకదినము ఆశౌచము
కన్యకకు పతిగృహమందు ప్రసవమగుటయందు పిత్రాదులకు ఆశౌచములేదు.
శిశువుమృతజాతమగుట యందు సపిండులకు సంపూర్ణమేజాతాశౌచము మృతా
శౌచములేదు. (మృతజాతము అనగా పూర్వము మృతమై పరమందు జనియిం
చడము) జననానంతరము నాళచ్ఛేదనము కన్న పూర్వము శిశుమరణమందుపిత్రా
దిసపిండులకు మూడుదినములున్ను తల్లికి పదిదినములున్ను జాతాశౌచముగల
దు. మృతాశౌచమయితే లేదు. నాళచ్ఛేద నానంతరము పదిదినములలోపలశి
శుమరణమగుటయందు సపిండాదులకు సంపూర్ణమేజాతాశౌచముగలదు. మృతా
శౌచమయితే లేదు.

అనంతరము మృతాశవుచము చెప్పబడుచున్నది. అచ్చట మృతాశవుచ
ముగలవారికి అస్పృశ్యత్వమున్ను కర్మానధికారమున్ను గలదు. పదిదినములకన్న
నుపైనను నామకరణము కన్నను పూర్వము శిశుమరణమందు సపిండులకుస్నాన
మాత్రము మాతాపితృవులకయితే పుత్రమృతియందు మూడుదినములున్నుక
న్యామృతియందు వకదినమున్ను ఆశౌచము సాపత్నంమాతకు అన్నివిషయములం
దును తండ్రికివలె ఆశౌచము నామకరణము కన్నను పూర్వము ఖననమేనిత్యము
నామకరణానంతరము చూడాకరణ పర్యంతమైనను మూడువర్షముల పర్యంతమైన
నుదాహమునుగాని ఖననమునుగాని చేయవలయును. నామకరణానంతరము అన
నగాపదిరెండవదిను మొదలు ఆరుమాసములలోపల పుత్రమరణమగుటయందు
దాహము జేసియుండగా సపిండులకు వకదినము ఆశౌచము ఖననముచేసియుండ
గానయితే స్నానమువలన శుద్ధిగలుగును. మాతాపితృవులకు యీరెండువిషయ
ములయందును మూడుదినములు ఆశౌచము కన్యామృతి యందయితే త్రిపురు
షసపిండులకు రెండువిషయములయందు స్నానమువలన శుద్ధిగలుగును. మాతా
పితృవులకు రెండువిషయములయందును వకదినము యేడవమాసము మొదలు
చూడాకరణము పర్యంతములేక మూడువవర్షము పూర్తియగుట పర్యంతముదా
హమందున్ను ఖననమందున్ను సపిండుల కొకదినము రెండువిషయములయందు
ను మాతాపితృవులకు మూడుదినములు ఈచెప్పుట పుత్రమరణ విషయమందు
గానికన్యామృతియందయితే మూడువర్షములపర్యంతము సపిండులకు స్నానమువల
నశుద్ధిగలుగును. మాతాపితృవులకు మూడుదినములు అయితే మొదటి సంవత్స
రముమొదలగు కాలమందు కృతచూడాకర్ముడైన పుత్రునియొక్క మరణమందు
పిత్రాది సపిండులకు మూడుదినములు ఆశౌచము నియతము దాహమున్ను నియ
తము మూడుసంవత్సరముల పైన ఉపనయనము కన్నా పూర్వము కృతచూ





డాకర్ముడైనను అకృతచూడాకర్ముడైనను పుత్రుడు మృతుడయినచో పిత్రా
దిసర్వసపిండులకు మూడుదినములు ఆశౌచముదాహమునియతము. అనుపనీతు
డైన భ్రాతయొక్కమరణమందుభగినికి ఆశౌచములేదు. ఇచ్చటఆకొన్ని ఇతరవిష
యములు ధర్మసింధువు మొదలగుగ్రంథములయందు చూడదగినవి. కన్యకకు
మూడుసంవత్సరములపైన వాగ్దానముకన్నను పూర్వముమరణమందు త్రిపురుష
సపిండులకొకదినము మాతాపితృలకు మూడుదినములు ఆశౌచము. దాహము
మొదలగునది మౌనముచేజేయునది. కన్యకకు వాగ్దానానంతరము వివాహము
కన్నను పూర్వముకన్యామరణమందు పితృసపిండులకును భర్తృసపిండులకును ము
గ్గురుపురుషులపర్యంతము ఆశౌచము. ఇచ్చటఉభయకుల మందున్నయేడుగు
రుపురుషులపర్యంతము సాపిండ్యముగలదు. దాహముమొదలగుదానినిమౌనము
చేతనే చేయవలెను. జననమందును, అనుపనీత మరణమందును, అతిక్రాంతా
శౌచములేదు. స్నానమాత్రమేను. అనుపనీతునికి అనూఢకన్యకకున్ను మాతా
పితృమరణమందేదశాహాశౌచముగాని అన్యమరణ మందేమియు కొంచమైనను
లేదు. ఉపనయనానంతరము మరణమందు జాతాశౌచమునందు వ్రాసినప్రకారమె
తెలయదగినది. యెట్లనగా. సపిండులకుపదిదినములు సోదకులకు మూడుదినము
లుసగోత్రులకు వకదినము ఆశౌచము స్త్రీకివివాహానంతరము మరణమందు భ
ర్తృసపిండులకు పదిదినములు ఆశౌచము. వివాహానంతరముకన్యకకు పితృగృ
హమందు మరణమందుమాతాపితృవులకు సాపత్నమాతకు సాపత్నభ్రాతకుసో
దరభ్రాతకు వీరికిమూడుదినములు ఆశౌచము. ఆగృహమందున్నపితృవ్యాదుల
కువకదినము. వివాహితయగుకన్యకకు పతిగృహమందు మరణమందు మాతా
పితృవులకును సాపత్నమాతకును మూడుదినములు. భ్రాతకుపక్షిణి, (అనగావక
టిన్నరదినము) పితృవ్యాదులకు వకదినము. మాతాపితృవులయొక్కమరణమందు
నుసాపత్నమాత యొక్కమరణమందును వివాహితకన్యకు పదిదినము లలోపలస
మాచారముతెలసినచో మూడుదినములు. అయితే తొమ్మిదవపదియవదినముల
యందు సమాచారము తెలసినచోపుత్రునివలె శేషకాలముచేతనే ఆశౌచము
నివర్తించును. పదిదినములపైన కాలాంతరమునందైనను వత్సరాంతరమునందై
నను తెలిసినచోవివాహితకన్యకు పక్షిణిఆశౌచము. ఇంకననేకములైన ఆశౌ
చభేదములుగలవు. అవియన్నియువిస్తారముగా సంపూర్ణముగా ధర్మసింధ్వాదిని
బంధములయందు చూడదగును. అతిక్రాంతాశౌచమును గురించివ్రాసెదము.
అచ్చటజననాశౌచమందు అతిక్రాంతా శౌచములేదు. అయిననుతండ్రికిస్నాన
మమాత్రము. మృతాశౌచమందుకూడ అనుపనీతమరణము మొదలవిగున

నిమిత్తముగాగల త్రిరాత్రైకరాత్రుల యందును, మాతులాదిపర గోత్రీయ మరణమునిమిత్తముగా గలపక్షిణీ త్రిరాత్రముమొదలగు దానియందును, అతిక్రాంతాశౌచములేదు. అచ్చటవివాహితయగు కన్యకకుమాతాపితృవుల యొక్క మరణమందు ఆశౌచముపైననే వ్రాయబడెను. ఈప్రకారము సోదకాదివిషయమైనత్రిరాత్రాదులయందుకూడ అతిక్రాంతాశౌచములేదు. స్నానముమాత్రమువారివిషయమందు కూడకాలాంతరమందైనను చేయతగినదేను. మరియేమన్ననుదశాహాది మృతాశౌచవిషయమైన అతిక్రాంతాశౌచమే చేయతగినది. అచ్చటదశాహము మొదలగుఆశౌచములకున్ను త్రిరాత్రముమొదలగు ఆశౌచములకున్ను ఆయాఆశౌచమధ్యమందు సమాచారముతెలిసినచో శేషదినముల చేతశుద్ధిగలుగును. పుత్రుడుమొదలగువానికికూడ శేషదినముల చేతనేశుద్ధిగలుగును. అంత్యకర్మకూడ శేషదినములచేతనే ముగింపుజేయదగినది. త్రిరాత్రాదికాలము వెళ్లిపోయినపిమ్మట సమాచారము తెలిసినచోటనయితే, దశాహన్యూనాశౌచములకు దశాహమధ్యమందే తెలిసినప్పటికిని అతిక్రాంతాశౌచములేదు స్నానముమాత్రమేను. మాతాపితృవులయొక్క మరణవిషయమందు దూరదేశమందైనాకూడవత్సరాంతరమందైనాకూడ తెలిసినచో పుత్రునికి శ్రవణముమొదలుకొనిదశాహముమొదలగు సంపూర్ణమైన ఆశౌచమేకలదు. దంపతులకు అన్యోన్యముగాదేశాంతరమందైననుకూడ కాలాంతరమందైననుకూడ తెలిసినచో సంపూర్ణమగు దశాహాశౌచమేను. సపత్నులకు అన్యోన్యముగా దేశకాలవిశేషానపేక్షమైనదశాహాసౌచమేను. సాపత్నమాతయొక్క మరణమందు పుత్రునికి పదిదినములపైన తెలిసినచో దేశకాలవిశేషానపేక్షమైన త్రిరాత్రమేను. ఔరసపుత్రమృతియందు మాతాపితృవులకు వత్సరాంతరమందుకూడ త్రిరాత్రము. దశాహమునకు పిమ్మటవకదేశమందే అనగా దేశాంతరముగాకయుండగా సపిండునిమరణము తెలిసినచో పక్షత్రయపర్యంతము త్రిరాత్రము. షణ్మాసపర్యంతము పక్షిణి. వత్సరపర్యంతము వకదినము అటుపిమ్మట స్నానమాత్రము. దేశాంతరమయివుండగానయితే పక్షత్రయపర్యంతము త్రిరాత్రము. ఆరుమాసముల పర్యంతముపక్షిణి. నవమాసపర్యంతము వకదినము. వత్సరపర్యంతముసజ్యోతి. సపిండమరణవిషయమందీవ్రాసినది మాధవమతము. దేశాంతరమనగా బ్రాహ్మణునికి యిరువైయోజనములకుపిమ్మటనే నని తెలియదగినది. లేక భాషాభేదసహితమహాగిరిచేతనైనను భాషాభేదసహిత మహానదిచేతనైనను వ్యవధానమైనది కూడదేశాంతరమేను. అయితే విజ్ఞానేశ్వరుడు దేశాంతరమందు సపిండమరణమైయుండగా దశాహమునకు పిమ్మట తెలిసినచో స్నానమాత్రమును చెప్పియు





న్నాడు. ఇచ్చట మాధవమతమే యుక్తము. అయినను దేశాచారమును శిష్టాచారము యెట్లున్నదో అట్లుచేయవలయును. ఇచ్చట సగోత్రవిషయాశౌచములే భార్యా పతిపుత్రాదులగుసర్వులచేత ఆచరించ తగినవిగాని యేవయితే మాతులత్వభగినీత్వాదిప్రయుక్తములయిన భిన్నగోత్రాశవుచములుగలవో వాటియందు భార్యా పతిపుత్రాదులమధ్యమందు యేఆశౌచము యత్సంబంధియో అతనిచేతనే చేయతగినది. ఇతరులకు ఆవశ్యకములేదు. రాత్రియందు జననమరణమందైనను రాత్రియందుమరణజ్ఞానమందైనను రాత్రిని మూడుభాగములుచేసి మొదటిరెండుభాగములయందు పూర్వదినము మొదలుకొని మూడవభాగమందు పరదినము మొదలుకొని ఆశౌచము లెక్కించతగినది. ఇది యొకపక్షము రెండవపక్షమందు అర్ధరాత్రికన్నను పూర్వమునందు పూర్వదినము మొదలుగా పరమందు పరదినము మొదలుగా ఆశౌచము ఇచ్చట దేశాచారమువలన వ్యవస్థ తెలియదగినది. ఇచ్చట యింక ననేకసంగతులు ధర్మసింధువుయందు చూడదగినవి.

అనంతరము ఆశౌచసంపాతమందు నిర్ణయము చెప్పబడుచున్నది. ఆశౌచసంపాతము అనగా ఆశౌచము గలవారికి వక ఆశౌచము గలిగియుండుటను తెలిసియుండగా మరియొక ఆశవుచము గలిగి యుండుటను తెలియడము. ఆ కారణముచేత పూర్వాశౌచమధ్యమందు జనియించినదైనను పరాశౌచముపూర్వాశౌచము వెళ్లిపోయినపిమ్మట తెలిసినచో ఆశౌచ సంపాతములేదు. అందువలన పూర్వాశౌచముచేత పరాశౌచము నివర్తించును. ఆశౌచ సంపాతమున్నపుడు మాత్రము పూర్వాశౌచ సమాప్తిచేత పరాశౌచముకూడ నివర్తించుచున్నది. అది యేకారణము వల్లననగా “పూర్వత్వపరత్వే తూత్పత్తికృతేనజ్ఞానకృతే తేనపూర్వోత్పన్న స్యపరోత్పన్నజ్ఞానోత్తరం జ్ఞాతేపి పూర్వోత్పన్నేన పరోత్పన్నంతన్మధ్యేజ్ఞాతంనివర్తతఏవ సంపాతఏవజ్ఞాన కృతోనతు పూర్వత్వాదికం” అని సిద్ధాంతమువలననని తెలియవలయును. అయితే సమానకాలప్రమాణములైన జాతాశౌచమృతాశౌచములకు సంపాతమందు జాతాసౌచమే పూర్వప్రవృత్తమైయున్నను మృతాశౌచము యెన్నిదినములు ఆచరించతగినదో అన్నిదినములకే నివర్తించునుగాని జాతాశౌచముచేత నివర్తించదు. మరియు జాతాశౌచముకన్నను మృతాశౌచము న్యూనముగానున్నను నివర్తించదు. ఇదిగాక న్యూనముగానుండిన మృతాశౌచముచేత అధికమైన జాతాశౌచము నివర్తించదు న్యూనజననాశౌచముచేత అధికజననాశౌచమున్ను న్యూనమృతాశౌచముచేత అధికమృతాశౌచమున్ను నివర్తించదు. ఇతరములగు ఆశౌచములు పూర్వప్రవృత్తాశౌచసమాప్తిచేత నివర్తించును. అయితే దసాహాంత్యరాత్రియందు ని

వృత్తియోగ్యమైన దశాహమునకు సంపాతముగలిగినచో అప్పుడు రెండుదినము
లు అధికముగా ఆశౌచముగలదు. దశమరాత్రియొక్క నాలగవయామమందు
నివృత్తియోగ్యమైన దశాహాంతరమునకు సంపాతముగలిగినచో మూడుదినములు
అధికము. దశాహాంత్యరాత్రియందు నాలగవయామమందైనను నివృత్తియో
గ్యత్రిరాత్రాశౌచపాతమందయితే పూర్వప్రవృత్తాశౌచాంతముచేతనే శుద్ధిగ
లుగునుగాని ఇందుకై రెండుదినములు మొదలగు వృద్ధిలేదు. వర్ధితములగు రెం
డుమూడుదినములయందు మరియొకదశాహాశౌచముయొక్క సంపాతమందు పూ
ర్వద్విరాత్రముచేతనైనను పూర్వత్రిరాత్రముచేతనైనను నివృత్తిలేదు. వర్ధితద్వి
రాత్రముచే పక్షిణ్యాశౌచమునకు నివృత్తిగలదు. వర్ధితత్రిరాత్రముచేత అన్యత్రి
రాత్రమునకు నివృత్తిగలదు. అచ్చట అనేకవిశేషములున్ను మరియనేక సంగతు
లున్ను ఇతరవిషయములున్ను ధర్మసింధువుయందు చూడవలయును. అందులో
దుర్మరణమందు నారాయణబల్యాది ప్రాయశ్చిత్తములచేతనే దుర్మరణదోషనా
శనము గలుగును. ఆప్రాయశ్చిత్తభేదములు పరాశరమాధవీయాదులయందు
చూడవలయును.

ఇది ఆశౌచప్రకరణము ముగిసెను.



## శ్రాద్ధప్రకరణము.

అనంతరము శ్రాద్ధప్రకరణము సంగ్రహముగా వ్రాయబడుచున్నది.
జీవత్పితృకునికి పితృకృత్యములైన దర్శాది శ్రాద్ధతర్పణ పైతృకదానములయందు
అధికారములేదు. ఇచ్చట విశేషముగలదు. ఏమనగా, స్వాపత్య సంస్కారముస్వ
ద్వితీయవివాహము మొదలగునది నిమిత్తముగాగల నాందీశ్రాద్ధమునందు చాతు
ర్మాస్యాంతర్గతపితృయజ్ఞమందు సోమాంగతృతీయ సవనస్థపితృయజ్ఞమందు జీవ
త్పితృకునికి అధికారముగలదు. జీవత్పితృకుడు ప్రసంగమువలన గయకుపోయివుం
డగా మాతయొక్క శ్రాద్ధమును చేయవచ్చునుగాని మాతయొక్క శ్రాద్ధమును
ద్దేశించిగయకు పోరాదు. సమస్తములగు మహానదులయందును తీర్థమునందును
జీవత్పితృకుడు తండ్రియొక్క పితృమాత్రాద్యుద్దేశముచేత శ్రాద్ధమును చేయవ
లయును. భ్రాతృపుత్రుడు అపుత్రుడగు పితృవ్యునికి ప్రత్యబ్దశ్రాద్ధమును సపిండ
కముగా చేయవలెను. ఈప్రకారము కనిష్ఠభ్రాతకూడా అపుత్రుడగు జ్యేష్ఠభ్రాత
యొక్క ప్రత్యబ్దశ్రాద్ధమును అట్లనే సవతికొడుకు అపుత్రవతియగు సాపత్నమా
తయొక్క శ్రాద్ధమును అట్లనే దౌహిత్రుడు అపుత్రుడగు మాతామహునియొ
క్క ప్రత్యబ్దశ్రాద్ధమును చేయవలయును. అట్లు పితృవ్యాదులయొక్క శ్రాద్ధచతు
ష్టయమందు జీవత్పితృకునికికూడ నధికారముగలదు. అపుత్రులగు పితృవ్యభ్రా





త్రాదులకు భార్యయుండగా ఆయమయే అధికారిగాని భ్రాతృపుత్రాదులకు
శ్రాద్ధాధికారము లేదు. ఈప్రకారము పుత్రాభావమందు పతియే భార్యా
శ్రాద్ధమును చేయవలయును. సవతి కొడుకుండగా నయితే ఆ సవతి కొ
డుకే భార్యాశ్రాద్ధమును చేయవలయునుగాని పతి చేయరాదు. దౌహిత్రభ్రాతృ
పుత్రులిద్దరుండగా మృతునియొక్క శ్రాద్ధమును, భ్రాతృపుత్రుడు అవిభక్తుడు
గానున్నచో భ్రాతృపుత్రుడు చేయవలెను. విభక్తుడుగానున్నచో దౌహిత్రుడే
చేయవలెను. అట్లనే జీవత్పితృకునికి పితృపితామహాది మనుష్యపితృతర్పణమం
దు నిషేధము గలిగియున్నను, అగ్నిష్వాత్త్యాది దేవర్షిపితృతర్పణమునందు నిషేధ
ములేకపోవుటవలన స్నానాంగతర్పణమందున్ను బ్రహ్మయజ్ఞాంగభూత దేవర్షిపి
తృతర్పణమందున్ను అధికారమున్నదెను. ఈప్రకారము యెవ్వనిసంబంధమగు
శ్రాద్ధమందు అధికారముగలదో అతనిసంబంధమగు శ్రాద్ధమునకు అంగమైన
తర్పణమందుకూడ నధికారముగలదు. జీవత్పితృకుడుకూడ యమభీష్ములకు తర్ప
ణమును చేయవలెను. శ్రాద్ధాంగతర్పణభిన్నతర్పణమును జీవత్పితృకుడు తిలల
చేత చేయరాదు. శ్రాద్ధప్రయోగమధ్యమందు వామజానున్యగ్భావమునివీతీబంధ
మున్ను చేయతగదు. తండ్రిమృతుడైయుండి పితామహుడు జీవించియుండగా
తండ్రికొరకు పితామహునికన్నను పరమందున్న నిద్దరికొరకు అనగా ప్రపితామ
హునికిని ప్రపితామహునితండ్రికిని శ్రాద్ధమునాచరించవలెను. అదేప్రకారము
పితృపితామహులును మృతులయివుండగా ప్రపితామహుడు జీవించియుండుట
యందుకూడ తెలియవలెను. అందుకు ప్రమాణము ధర్మసింధువుయందు వా
క్యము "మృతేపితరిపితామహజీవనే పిత్రేపితా మహోత్పరాభ్యాంచ శ్రాద్ధం దే
యం-ఏవంపితృపితామహ మరణేప్రపితా మహజీవనే ప్యూహ్యం" అనియున్నది.
ఆనంతరము జీవత్పితృకునికి ప్రేతకర్మయందు ప్రతిప్రసవమేమనగాతనతల్లియొక్క
యు, అపుత్రసాపత్నమాతయొక్కయు, స్వపుత్రుడును సపత్నీపుత్రుడును లేన
ట్టి భార్యయొక్కయు, అపుత్రుడగు పితృవ్యునియొక్కయు, అపుత్రులగు మా
తామహమాతామహులయొక్కయు, దాహాదిప్రేతకర్మలను చేయవలయును.
అచ్చట అపుత్రపదముచేత ముఖ్యగౌణపుత్రప్రపౌత్రాభావము వివక్షింపబడెను.
తల్లికౌర్ధ్వదేహికమును జీవత్పితృకుడైనప్పటికిని అనుపనీతుడైనప్పటికినిచేయవ
లెను. అచ్చట విశేషమేమనగా, ఊనత్రివర్షుడుచూడా రహితుడైనచో దాన
మాత్రమును సమంత్రకముగాచేసి ఇతరకర్మను ఇతరునిచేత చేయించవలెను.
ఎపుడయితే కృతచూడుడయినచో లేక పూర్ణత్రివర్షుడయినచో నపుడు సర్వమ
గుప్రేత కర్మను సమంత్రకముగా చేయవలయును. బ్రహ్మచారియయినచో మా

తాపితృవులయొక్కయున్ను మాతామహునియొక్కయున్ను అంత్యకర్మను చేయవలయునుగాని ఇతరునియొక్క అంత్యకర్మనుచేయరాదు. భర్తృదౌహిత్రులిద్దరుండగా భర్తయేపత్నియొక్క దాహము మొదలగు దానిని చెయవలెను. ముండనమయితే భర్తకుకూడను. ఈప్రకారము అపుత్రునికి భార్యా దౌహిత్రులిద్దరుండగా భార్యయేపతికి చెయవలయు. అచ్చట దాహమునుమాత్రము సమంత్రకముగాచెసి ఇతరమగు సంకల్పమాత్రమును తానుచేసి సర్వమును బ్రాహ్మణద్వారా చేయించవలెను. భర్తయు సవతికొడుకును,అనునిద్దరుండగా సవతికొడుకేచేయవలయుగానిభర్తచేయరాదు సవతికొడుకుదౌహిత్రుడు,అనునిద్దరుండగాసవతి కొడుకేచేయవలయును. అపుత్రులగువిధవాధురులకు భాతృపుత్రదౌహిత్రులిద్దరుండగాదౌహిత్రుడే అధికారిఅని యనేకులు చెప్పియున్నారు. అపుత్రునికి పత్నీభాతృపుత్రులిద్దరుండగా పత్నియేచేయవలయును. ఈప్రకారముగా పుత్రుడు సన్నిధానమందులేకబోయినపుడు పౌత్రుడుమొదలగునతనికి పితామహ పితామహ్యాదులయొక్కయార్ధ్వదేహికమందు అధికారముగలదు. ఇచ్చట అనేకవిషయములున్ను విశేషములున్ను ధర్మసింధువుయందు చూడతగినవి.

అనంతరము శ్రాద్ధాదులయందు అధికారులయొక్క నిర్ణయముచేయబడుచున్నది. ఇచ్చటసాంవత్సరికాదిశ్రాద్ధములయందును దాహముమొదలగు యార్ధ్వదేహికక్రియయందును ఔరసపుత్రుడుముఖ్యుడగు అధికారియని తెలియదగినది. ఔరసపుత్రులనేకులుగానున్న చోజ్యేష్ఠుడేఅధికారియని తెలియవలయును జ్యేష్ఠుడులేక బోవుటయందయినను అసన్నిధానమందైనను పాతిత్యము మొదలగుదానిచేత నధికారములేకబోవుటయందైనను జ్యేష్ఠునికి వెంబడిగాజనించినవాడు అనగా రెండవవాడు అధికారియనితెలియదగినది. అచ్చటపుత్రులు విభక్తులుగానున్నచోకనిష్ఠులవలన ధనమునుగ్రహించి జ్యేష్ఠునిచేతనే సపిండీకరణాంతమైనక్రియచేయతగినది. సాంవత్సరికము మొదలగుదానినయితే వేరువేరుగాచేయతగినది. విభక్తులుగాకయున్నచోటనయితే సాంవత్సరికము మొదలగునది కూడ వకనిచేతనే చేయదగినది. యేలననగా, వకడుచేసినప్పటికి కూడ సమస్తులకు ఫలభాగిత్వము వలనని తెలియవలయు. అయినసర్వపుత్రుల చేత బ్రహ్మచర్యము పరాన్న వర్జనము మొదలగు నియమములు చేయదగినవి. పుత్రులొక్కదేశ మందుండక బోవుటయందు దేశాంతర మందయినను గృహాంతరమందయిన నున్నట్టి అవి భక్తులయిన యాపుత్రులచేత కూడ వేరుగానేవార్షికాదికము అయతగినది. ఆందులో యెప్పుడయితే జ్యేష్ఠుడు సన్నిధానమందు లేకబోయినప్పుడు కనిష్ఠుడు దాహము మొదలగుదానిని చేయుచున్నాడో ఆప్పు





డు షోడశ శ్రాద్ధాంతమునే చేయవలయుగాని సపిండీకరణమును చేయరాదు. సంవత్సరపర్యంతము జ్యేష్టునిరీక్ష చేయవలయును. సంవత్సరములోపల తెలిసినప్పుడు సపిండీకరణమును జ్యేష్ఠుడే చేయవలయును. లేకపోతే వర్షాంతమందుకనిష్ఠునిచేత కూడచేయతగినది. వర్షముకన్నను పూర్వము పుత్రభిన్నునిచేత చేయబడినప్పటికిని మాసికానుమాసిక సపిండీకరణమును పుత్రుడు మరల చెయవలయును. ఈప్రకారము కనిష్ఠుడు చేసియున్నప్పటికిని జ్యేష్ఠపుత్రుడు మరలచేయవలయును. కనిష్ఠుడు సాగ్నికుడుగా నున్నప్పుడు సపిండికరణముకూడ పదిరెండవ దినమందు కనిష్ఠునిచేత చేయతగినది. ఔరసపుత్రుడు లేకబోయినప్పుడు దత్తపుత్రుడే అధికారియని తెలియదగినది. దత్తకపుత్రుడు లేకబోయినప్పుడు పౌత్రుడును పౌత్రుడులేక బోయినప్పుడు ప్రపౌత్రుడును అధికారియని తెలియదగినది. భర్తలేకబోయినప్పుడును ప్రపౌత్రుడు లెకబోయినప్పుడున్ను భర్తకు పత్నియుపత్నికిభర్తయు దాహము మొదలగు యార్ధ్వదేహికమును సాంవత్సరికాది శ్రాద్ధమునున్ను చెయవలయును. పతికికూడ సవతి కొడుకున్నప్పుడు అధికారము లేదు. ఇందుకు ప్రమాణము “విదధ్యాదౌరసః పుత్రోజనన్యా ఔర్ధ్వదేహికం। తదభావేస పత్నీజః” అని యున్నది. భార్యచేత కూడ సమంత్రకముగనేయార్ధ్వదేహికము మొదలగు దానినిచేయవలయును. అశక్తియందయితే అగ్నిదానము మాత్రముసమంత్రకముగాచేశి మిగిలిన దానిని మరియొకనిచేతచేయించదగినది. శ్రాద్ధమందు సంకల్పమాత్రమును చేసిమిగిలినదానిని మరియొకనిచేత చేయించవలయును. యేవిధముచేతనైనా శాస్త్రవిచారమందుఅవిభక్తుడై యుండినలేక సంసృష్టుడై యుండినభాతృపుత్రునికే ధనగ్రహణమందు అధికారముగలదుగాని అట్లయినను క్రియాధికారము పత్నికేనని తెలియవలయును. భ్రాతవిభక్తాసంసృష్టుడుగానున్నచోధనాధికారము కూడపత్నికేనని తెలియదగినది. పత్నిలేకబోయినప్పుడు విభక్తాసంసృష్టునికి కన్యకపిండమునిచ్చునదియుధనహారిణియునగును. అందులోకూడ వివాహముచేయబడిన కన్యయే పిండమునిచ్చునది. ధనమునుహరించుటయందయితే వివాహముచేయ బడనికన్యకకూడానని తెలయవలయును. కన్యకలేకబోయినప్పుడు దౌహిత్రుడుధనహారియుపిండదుడునగును. దౌహిత్రుడులేక బోయినప్పుడుభ్రాతయు, భ్రాతలేకబోవునపుడు భ్రాతృపుత్రుడు అధికారియగును. అవిభక్తునికిని సంసృష్టునికినిపత్ని

లేక బోవుటయందు భ్రాతయధికారియగును. సంసృష్టుడనగా మొదటవిభక్తుడుఅయివుండి మరలతనధనమునుభ్రాతృధనములచేత నేకముజేసిఏకపాకముమొదలగుదానిచే యుపజీవించువాడు, అని తెలియదగినది. అందులోసోదరాసోదరులయొక్క సమదాయమందు సోదరుడేనని తెలియదగినది. అందులోకూడ జ్యేష్ఠకనిష్ఠులుండగా కనిష్ఠుడేనని తెలియదగినది. కనిష్ఠభ్రాత లేక బోయినప్పుడు జ్యేష్ఠభ్రాతయేనని తెలియదగినది. కనిష్ఠులనేకులున్న చోటనయితే మృతునికివెంబడిగాజనించినవాడును అతడులేక బోయినపుడు అతనికివెంబడిగాజనించినవాడును, అని యీక్రమము తెలియదగినది. ఈ ప్రకారము జ్యేష్ఠులు అనేకులుగానున్నప్పుడు మృతానంతరక్రమముచేత నేనని తెలియదగినది. సోదరభ్రాత లేక బోయినపుడు సాసాపత్నభ్రాతయధికారి. ఇచ్చటకూడ జ్యేష్ఠత్వము మొదలగు విచారము పూర్వమునందువలె తెలియదగినది. భ్రాతలేకబోయినపుడు భ్రాతృపుత్రుడు అధికారి. అందులోకూడ సోదరభ్రాతృపుత్రుడుముఖ్యుడు. అతడులేకబోయినప్పుడు సాపత్నభ్రాతృపుత్రుడు. అతడులేకబోయినప్పుడు తండ్రిఅధికారి. తండ్రిలేకబోయినపుడు తల్లిఅధికారి. తల్లిలేకబోయినప్పుడు కోడలు అధికారి. కోడలులేక బోయినప్పుడు ఆత్మభగినిఅధికారి. భగినిలేకబోయిన పుడుభగినీపుత్రుడు అధికారి. అతడు లేకబోయినపుడు పితృవ్యుడు పితృవ్యపుత్రుడు మొదలగు సపిండులు అధికారులు వారిలోనొకడైనను లేనప్పుడుసోదకులు అధికారులు. సోదకుడులేకపోయినప్పుడుగోత్రజులధికారులు గోత్రజుడులేనప్పుడు మాతామహుడు మాతులుడు మాతులపుత్రుడు మొదలగు మాతృసపిండులు అనుక్రమముచేత నధికారులు. మాతృసపిండుడు లేనప్పుడుతనయొక్క పితృష్వస్వమాతృష్వస్వపుత్రులువారులేనప్పుడు తండ్రియొక్క పితృష్వస్వమాతృష్వస్వమాతుల పుత్రులనెడు పితృబంధువులువారులేనప్పుడు తల్లియొక్క పితృష్వస్రాదిపుత్రులనెడుమాతృబంధువులువారులేనపుడు శిష్యుడుశిష్యుడులేనప్పుడుఅల్లునికిశ్వశురుడునుశ్వశురునికిఅల్లుడునుఅధికారి. అతడులేనప్పుడు స్నేహితుడు మరియొకపక్షమందు మరణోన్ముఖులైన విప్రాదులచేత తన అంత్యకర్మాదులకొరకు ధర్మపుత్రుడుచేయదగును. అనంతరము స్త్రీలకు దాహాదులయందు అధికారులు చెప్పబడుచున్నారు. అవివాహితయైన స్త్రీకి తండ్రియధికారి తండ్రిలేనప్పుడు భ్రాత మొదలగు నతడు అధికారి వివాహితయగు స్త్రీకి ఆ స్త్రీయొక్క పుత్రుడులేనప్పుడు సవతికొడుకు అధికారి.





అతడులేనప్పుడు పౌత్రప్రపౌత్రు లధికారులు వారు లేనప్పుడు పతి అతడులేనప్పుడు కూతురు ఆమె లేనప్పుడు కూతురు కొడుకు అతడులేనప్పుడు పతియొక్క భ్రాత అతడులేనప్పుడు పతియొక్క భ్రాతృపుత్రుడు అతడులేనప్పుడు కోడలు ఆమె లేనప్పుడు తండ్రి తండ్రిలేనప్పుడు భ్రాత అతడులేనప్పుడు భ్రాతృపుత్రుడు మొదలగు పూర్వోక్తులు అధికారులు ఇచ్చట అన్నిచోట్లయందు పుత్రభిన్నులగు వారికి పుత్రులయొక్క అసాన్నిధ్యమువలననైనను పుత్రుడు లేకబోవుటవలననైనను కర్తృత్వమున్నదని శాస్త్రిమర్యాదగలదు. అందులో నెప్పుడు పుత్రాసన్నిధానమువలన కర్తృత్వము గలిగియుండునో అప్పుడు పుత్రభిన్నులచేత దాహమును మొదలుచేసి సపిండీకరణముకన్నను ప్రాచీనమైనకర్మయె చేయదగును. సపిండీకరణమయితే పుత్రభిన్నులచేత చేయదగదు. పుత్రుడు లేనప్పుడయితే ఇతరులచేత సపిండీకరణముకూడ చేయదగినది. అందులోకూడ సపిండుడు మొదలగు స్నేహితుడు అంతముగాగల వారిచేత దాహము మొదలుకొని దశాహక్రియ చేయదగినది. ఇవియే పూర్వక్రియలని చెప్పబడుచున్నవి. అనంతరము పదనొకండవదినము మొదలుకొని సపిండీకరణాంతములైన క్రియలు మధ్యమసంజ్ఞగలవి ఆకర్మలు సపిండుడు మొదలగువారిచేత చేయబడినవయినను చేయబడకపోయినను యుక్తమేను. అందుకు పరమందుండినఅను మాసికము సాంవత్సరీకము మొదలగునవి ఉత్తరసంజ్ఞగలవి. అవి సపిండుడు మొదలగువారిచేత చేయదగనివేను. ఈచెప్పడము అతని సంబంధమైన స్థావరధనమును చరధనమును గ్రహించకబోవుట యందేనని తెలియవలయును ఈరెండుధనములలో నేదోవక ధనమును గ్రహించుటయందయితే సపిండుడు మొదలగువారిచేత మధ్యమోత్తరములని సంజ్ఞలుగల క్రియలుచేయదగినవేను. దత్తకుడయితే జనకపాలకులనే ఇద్దరు తండ్రులకు సంతతిలేనప్పుడు జనకపాలకులనే ఇద్దరియొక్క ధనమును గ్రహించవలయును. ప్రతిసాంవత్సరిక శ్రాద్ధమునున్ను ఇద్దరికిచేయవలయును. దర్శమహాలయము, మొదలగు దానియందయితే రెండువిధములుగానుండిన తండ్రులు మొదలగువారికి శ్రాద్ధమునుచేయవలయు. అచ్చట రెండువిధములుగా నుండిన తండ్రిలు మొదగువారికి వేరుగాపిండదానముచేయతగినది. ఈప్రకారముదత్తకునియొక్క పుత్రుడు కూడదత్తకజనకునికి పుత్రాదులు లేకబోయినప్పుడు తనతండ్రినిపితామహద్వయమును ప్రపితామహద్వయమునున్ను ఉచ్చరించిదర్శాదిశ్రాద్ధ

మునుచేయవలయు. అట్లనేధనమును గ్రహించవలయు. ఈప్రకారముదత్తక
యొక్కపౌత్రుడుకూడ దత్తజనకునియొక్కకులమందు ప్రపితామహునికి పుత్ర
డుమొదలగు నతడులేకబోయినపుడు తనతండ్రినొకనిని పితామహుని నొకని
ప్రపితామహద్వయమునున్ను ఉచ్చరించి దర్శాదిశ్రాద్ధమును చేయవలయును
ప్రపితామహునియొక్క ధనమునున్ను గ్రహించవలయును. జనకపాలకులనే ఇ
రుతండ్రులకుపుత్రాది సంతతియుండినట్లయితే, నపుడు దత్తకుడు ఇరువురికిన్ని
యౌర్ధ్వదేహికమునువార్షికము మొదలగుదానినిన్ని చేయరాదు. పాలకతండ్రి
యౌరసపుత్రునికన్నను విభక్తుడగుదత్తకునిచేత దర్శమహాలయాదిశ్రాద్ధముప
త్రముపాలకపిత్రాది పార్వణోద్దేశముచేత చేయుదగినది. అవిభక్తుడగుదత్తకుని
యితేనపుడాజౌరసకృతదర్శమహాలయాదులచేతనే దర్శమహాలయాదిసిద్ధి గలు
చున్నది. బ్రహ్మచారికిసంబంధమగుమాసికాబ్దికాది శ్రాద్ధముమాతాపితృవులచే
చేయతగినది. బ్రహ్మచారిచేతనయితే మాతృపితృ మాతామహోపాధ్యాయ
చార్యభిన్ను లగువారికి శవనిర్హరణముదాహాద్యంత్య కర్మయున్ను చేయ
దగినది. ఇతరుడగు అధికారి లేనప్పుడు మాతృపితృ మాతామహాచార్యు
కుదాహాదికము బ్రహ్మచారిచేత చేయదగినది. అందులో దశాహకర్మనుచేయు
యందు దశాహము ఆశౌచము దాహమును మాత్రము చేయుటయందు వక
నము ఆశౌచము ఆశౌచమందు కూడ నితనికి నిత్యకర్మలోపములెదు. అశు
త్వమున్నప్పటికి కూడ యతనిచేత యాశౌచముగల వారియొక్క అన్నముభుజి
పదగదు. ఆశౌచముగల వారితోచేరి యుండదగదు. ఆరెండుచేసినచో ప్రాయ
శ్చిత్తముపునరుపనములు చేయదగినవి. ఇతరులయొక్కదాహాము మొదలగుదాని
చేయుటయందు మూడుకృఛ్రిములు పునరుపనయనమున్ను జేయదగినది. ధర్మా
ముగా నొకానొకనిచేత నొకానొక సవర్ణునియొక్క దాహాముమొదలగునదిశ్రా
ముమొదలగునది చేయబడినచో సంపత్తిమొదలగుఫలము గలుగును. తాను రా
జకార్యమందు నియుక్తుడైయుండినను బంధనిగ్రహములలో చిక్కియుండినను
సర్వవ్యసనములను పొందియుండినను శ్రాద్ధమును బ్రాహ్మణునిచేత చేయించవల
యును. ఇందుకు ప్రమాణము “ రాజకార్యేనియుక్తస్య బంధనిగ్రహవర్తిన
వ్యసనేషుచ సర్వేషు శ్రాద్ధంవిప్రేణకారయేత్ ” అని యున్నది. ఇచ్చట నితరస
గతులనేకములు ధర్మసింధువుయందు చూడదగినవి. ఈశ్రాద్ధప్రకరణమందు శే





ముబాలబోధార్థముగా వ్రాసినదే వ్రాసియున్నాము. అందువలనపునరుక్తిదోష
ములేదు.

అనంతరము శ్రాద్ధశబ్దార్థము చెప్పబడుచున్నది. మృతులగు పిత్రాదుల
నుద్దేశించి విహితమగుకాలమందు దేశమందు పక్వాన్నము ఆమాన్నముహిరణ్య
మువీటిలో నేదోయొకద్రవ్యమును విధిచేత దానము శ్రాద్ధమనంబడును. శ్రాద్ధ
మందు ఆగ్నౌకరణము పిండదానము బ్రాహ్మణభోజనము ఇవి ప్రధానములైనవి
ఇందుకు ప్రమాణము “ హోమశ్చపిండదానంచ తథాబ్రాహ్మణభోజనం। శ్రా
ద్ధశబ్దాభిధేయం స్యాదేకస్మిన్నౌపచారికం ” అనియున్నది. వకచోట వచనమువ
లననైనను అశక్తిచేతనయినను పిండదానము మొదలగుదానిని చేయకబోవుట
యందు బ్రాహ్మణభోజనము మొదలగునది మాత్రముకూడ శ్రాద్ధశబ్దార్థమునం
పన్నమగుచున్నదని నాలగవపాదమున కర్థము. అనంతరము శ్రాద్ధభేదములుచె
ప్పబడుచున్నవి. అచ్చట శ్రాద్ధము నాలుగువిధములు యెట్లన్నను పార్వణశ్రాద్ధ
మువకోద్దిష్టశ్రాద్ధము నాందీశ్రాద్ధము సపిండీకరణశ్రాద్ధము అని తెలియవలయును
తండ్రి మొదలగు ముగ్గురి యుద్దేశించి విహితమై పిండత్రయయుక్తమైనదిపార్వ
ణశ్రాద్ధమనంబడును. ఆపార్వణ శ్రాద్ధము ఏకపార్వణకముద్వి పార్వణకముత్రి
పార్వణకము అని మూడువిధములు. వీటియొక్క స్వరూపములు ధర్మశాస్త్రము
లయందు చూడదగినవి. మృతుడగు నతనికి పదిరెండవదినము మొదలగుకాల
మందు పిండార్ఘ్యసంయోజనాది. రూపమగు శ్రాద్ధము సపిండీకరణమనంబడును.
ఈశ్రాద్ధము మరల మూడువిధములు నిత్యమని నైమిత్తికమని కామ్యమని తెలి
యవలయు. నియతనిమిత్తమందు విహితమగుదర్శాది శ్రాద్ధము నిత్యమనంబడు
ను. ఆనియతనిమిత్తమందు విహితమగుశ్రాద్ధము నైమిత్తికమనంబడును. అదె
ట్టిదనగా సూర్యచంద్ర గ్రహణాదియందు విహిత మయినది. ఫలకామనయం
దు విహితమైనది కామ్యమనంబడును. అదెట్టిదనగా పంచమ్యాది తిథియం
దును కృత్తికానక్షత్రమందును విహితమైనది. అనంతరము శ్రాద్ధదేశములు చె
ప్పబడుచున్నవి. కురుక్షేత్రము ప్రభాసము పుష్కరము ప్రయాగ కాశి గంగా
యమునా నర్మదాదితీరము నైమిషము గంగాద్వారము గయాశీర్షము అక్షయ్య
వటము మొదలగు పుణ్యస్థలములయందు శ్రాద్ధము మహాఫలమునిచ్చునది.
“ తులసీకాననచ్ఛాయా సాలగ్రామస్యసన్నిధిః। చక్రాంకితస్యసాన్నిధ్య మేషు

యత్క్రియతేనరైః। స్నానందానంతపఃశ్రాద్ధం సర్వమక్షయ్యతాంవ్రజేత్ ” అని శ్లోకోక్తస్థలములు రమణీయములైనవి. గోగజాశ్వాదిమప్ట ప్రదేశమునందున్ను మ్లేచ్ఛప్రదేశమందున్ను శ్రాద్ధమునుచేయరాదు. పరకీయగృహము మొదలగు దానియందు శ్రాద్ధమును చేయుటయందు ఆభూమి కధికారియగు నతనియొక్క పితృవులు భాగమును హరించుచున్నారు. ఆకారణముచేత గృహస్వామికొరకు మూల్యమును సమర్పించి చేయవలయును. స్వామి యనుజ్ఞచేతనైనను చేయవలయును. స్వామిత్వములేని స్థలములెవ్వియనగా “ వనానిగిరయోనద్యా స్తీర్థాన్యాయతనానిచ । దేవఖాతాశ్చగర్తాశ్చన స్వామ్యంతేషుకస్యచిత్ ” అని తెలియవలయును. శ్రుతిస్మృత్యుదిత కర్మాచరణమునందు నియమములెవ్వియనగా “ నైకవాసానచద్వీపేనాంతరిక్షేకదాచన । శ్రుతి స్మృత్యుదితంకర్మ నకుర్యాద శుచిఃక్వచిత్ ” అని తెలియవలయును.

అనంతరము శ్రాద్ధకాలములు చెప్పబడుచున్నవి. “అమాయుగమనుక్రాంతిధృతిపాత మహాలయాః। అష్టకాన్వష్టకా పూర్వేద్యుః శ్రాద్ధైర్నవతిశ్చ షట్ ” అని ౯౬ నిత్యశ్రాద్ధములు తెలియదగినవి. సంక్రాంతి గ్రహణాది కాలములయందు చేయదగినవినైమిత్తికశ్రాద్ధములు. మహాతీర్థప్రాప్తియు, వ్యతీపాత, మృతదినము, సూర్యచంద్రగ్రహణములు, శ్రాద్ధమును గురించిరుచి తెలియదగినది. శ్రోత్రియాదిబ్రాహ్మణసంపత్తి, అర్ధోదయము కపిలాషష్ఠి మొదలగు అలభ్యయోగములు, పద్మకయోగము, ఇత్యాదులు శ్రాద్ధకాలములు. పద్మకయోగస్వరూపమేమనగా “ యదావిష్టి ర్వ్యతీపాతో భానువారస్తథైవచ పద్మకోనామయోగోయమయ నాదేశ్చతుర్గుణః ,, అని తెలియదగినది. ఇదిసామాన్యకాలము. అనంతరము అపరాహ్ణకాలము మొదలగు విశేషనిర్ణయము చెప్పబడుచున్నది. అహస్సుకు పదునైదుముహూర్తములు గనుక అయిదుభాగములు చేయగా మూడుముహూర్తములు వకకాలము. అందులో మొదటి భాగము ప్రాతఃకాలము. రెండవదిసంగవకాలము. మూడవది మధ్యాహ్నకాలము. నాలవదిఅపరాహ్ణకాలము. అయిదవభాగము సాయంకాలము. అహస్సు యందెడవముహూర్తము గాంధర్వముయెనిమిదవ ముహూర్తము కుతుపముతొమ్మిదవముహూర్తము రోహిణము. అనంతరము ప్రతిసాంవత్సరికమాసికాదినిర్ణయము





చెప్పపడుచున్నది. అందులో ఏకోదిష్టము మధ్యాహ్న కాలమునందు చేదగినది. అందులో కూడా యెనిమిదవ తొమ్మిదవ ముహూర్తములు ముఖ్యకాలము. అచ్చట పూర్వదిన మందైనను పరదినమందైనను మధ్యాహ్నవ్యాప్తియుండగా అదే తిథిగ్రహ్యించతగినది. రెండుదినముల యందు పూర్ణముగా మధ్యాహ్నవ్యాప్తి యుండుటయందు గాని మధ్యాహ్నస్పర్శయే లేకబోవుటయందుగాని రెండుదినములయందు సమముగా కొంతభాగమును వ్యాపించుటయందుగాని పూర్వదినమే గ్రహించతగినది. రెండుదినములయందున్ను హెచ్చుతగ్గుగా కొంతభాగమును వ్యాపించుటయందు యేదినమందు అధికముగావ్యాపించియుండునో ఆదినము గ్రహించతగినది. పార్వణమందయితే అపరాహ్ణవ్యాపిని గ్రహించతగినది. పూర్వదినమందైనను పరదినమందైనను అపరాహ్ణమును వ్యాపించుటయందు అదేదినము గ్రహించతగినది. రెండుదినములయందు అపరాహ్ణవ్యాప్తి పూర్ణముగా నుండుటయందు గాని, కొంతభాగము అనగా ఏకదేశముగాసమవ్యాప్తియందుగాని ఉత్తరతిథియొక్క క్షయమందు పూర్వదినము గ్రహించతగినది వృద్ధియందును ఉత్తరతిధికి క్షయవృద్ధులులేకజోవుటయందును పరదినము గ్రహించతగినది. ఇది మాధవాచార్యమతము రెండుదినములయందును తిథికి అపరాహ్ణస్పర్శలేక బోవుటయందు పూర్వదినమునందు సాయాహ్నవ్యాప్తియుండుటవలన పూర్వదినము గ్రహించతగినది. ఈక్షయాహనిర్ణయము ప్రత్యాబ్దికమందును మాసికమమృతతిథియందు చేయబడుచుండెడు సకృన్మహాలయమందున్ను తెలియదగినది. ఈపార్వణశ్రాద్ధముకు తుపాదిముహూర్తపంచకమందు చేయతగినదిగాని సాయాహ్నకాలమందును రాత్రియందును ప్రాతఃసంగవకాలములయందును చేయరాదు. పిండపితృయజ్ఞదినమందు సాయాహ్న కాలమునందు కూడ పార్వణము ఆజ్ఞాపింప బడుచున్నది. యెప్పుడయితే విఘ్నవశమువలనపగటియందు సాంవత్సరిక శ్రాద్ధము చేయబడదో అప్పుడు రాత్రియందుకూడ ప్రథమయామాంతము లోపలనే శ్రాద్ధము చేయదగినది. అట్లు చేయక మృతాహాతిక్రమమందు చాండాలత్వాది దోషముగలుగును. శేషవిషయములు ధర్మశాస్త్రగ్రంథములయందు చూడదగును. పితృదేవతా నిర్ణయమెట్లనిన “ పిత్రాది పార్వణం యత్రతత్రమాతామహాదయః । సర్వత్రైవహికర్తవ్యా నాబ్దికేమాసికేషున । మాసికేషుత్వాబ్దికే చత్రిదైవత్యం ప్రకీర్తితం । వృద్ధావీర్థేన్వష్టకాసు

గయాయాంచమహాలయే । త్రిపార్వణకమత్రేష్టం శేషం షాట్పౌరుషం విదుః।స పత్నీకం పిత్రాదిత్రయం సపత్నీకం మాతామహాదిత్రియ మితిషాట్పౌరుషత్వం। తుయాహం వర్జయిత్వైకం స్త్రీణాంనాస్తిపృథక్రియా । అన్వష్టకానువృద్ధౌచగ యాయాంచ క్షయేహని । అత్రమాతుః పృథక్ శ్రాద్ధమన్యత్ర పతినాసహ"అని తెలియదగినది. విశ్వేదేవతా నిర్ణయ మెట్లంటేను యెచ్చట విశేషము చెప్పబడ దో అచ్చట సర్వత్ర పార్వణశ్రాద్ధమందు పురూరవార్ద్రవ సంజ్ఞులైన విశ్వేదేవత లుగ్రహించతగుదురు. కామ్యశ్రాద్ధమందును మహాలయమందున్ను ధూర్మిలోచ నసంజ్ఞులగు విశ్వేదేవతలు నైమిత్తిక శ్రాద్ధమందును అష్టకాశ్రాద్ధమందునుకా మకాలసంజ్ఞులగు విశ్వేదేవతలు నైమిత్తిక శ్రాద్ధమనగా ఏకోద్దిష్టమైనను సపిండీ కరణమైనను తెలియదగినది. నాందీశ్రాద్ధమందు సత్యవసుసంజ్ఞులగు విశ్వేదేవతలు ఇచ్చట విశేషమున్ను ఇతర విషయమున్ను సర్వము ధర్మసింధువు మొదలగు గ్రంథములయందు చూడదగినది.

ఇది శ్రాద్ధప్రకరణము ముగిసెను.

శ్లో. ఏవం విచార్య బహుధారమ్యాని బహూని ధర్మశాస్త్రాణి। సరళాం ధీభాషయా యద్గ్రంథోవ్య రచీశ్వర ప్రీత్యై॥

విద్వద్వేంకట రామార్య తనయోమల్లికార్జునః । అకరోత్కృతి మద్వై తామలుకూరు పురస్థితః॥

ఇది ధర్మశాస్త్ర రత్నాకరము ముగిసెను.



ఆనందముద్రాక్షరశాల, చెన్నపట్టణము.